మొదటి వివరి అట్టలలోపల ముద్రించిన శిల్పం బుద్ధుని తల్లి మాయాదేవి స్వప్నాన్ని శుద్ధోదన మహారాజుకు ముగ్గురు జ్యోతిష్కులు వివరించడం, దిగువ కూర్చొని వివరణన వ్రాస్తున్న వ్రాయసకాణ్ణి చూపించే దృశ్యం భారతదేశంలో లిపిని గూర్చి తెలియజేసే చిత్రరూపంలో లభించే ప్రాచీనాధారలలో బహుశా ఇదే అన్నింటికంటె ప్రాచీనం కావచ్చు.

— (నాగార్జునకొండ క్రీ. శ. రెండవ శతాబ్దము

— క్రొత్త ఢిల్లీలోని జాతీయవస్తు ప్రదర్శనశాల సౌజన్యంతో.)

*Hari Narayana Apte* — Telugu translation by V Ramachandra of R. B Joshi's monograph in English, Sahitya Akademi, New Delhi (1989) Rs 5

© Sahitya Akademi
First Published 1989

సాహిత్య అకాడెమీ

ప్రధాన కార్యాలయం
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ - 110 001

ప్రాంతీయ కార్యాలయాలు
29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు - 600 018
బ్లాక్ V - బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా - 700 029
172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి - 400 014

రూ 5

Stree Seva Mandir Press, Madras - 93

# విషయ సూచిక

# 1. వ్యక్తి - జీవనస్థితి

హరినారాయణ ఆప్టే హరిభావ్ ఆప్టేగా ప్రసిద్ధుడు. ఆధునిక మరాఠీనవల ప్రారంభకుడతడే అని అందఱూ అంగీకరించారు. 1985లో ప్రకటితమైన "మధ్లీ స్థితి" (మధ్యస్థితి) ఆయన మొట్టమొదటి నవల. అది ఆనాటి పరిత్రలోకంలో ఒక గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఆ నవల పూనానుండి వెలువడే "పుణెవైభవ్" అనే మరాఠీ పత్రికలో 1883 నుండి వరుసగా ప్రకటింపబడుతూ ఉండేది నవలలోని మొదటి ఒకటి రెండు భాగాలు ప్రకటింపబడగానే, ఆ నవల కర్తయెవరని అడుగుతూ ఎందరో ఉత్తరాలు వ్రాయసాగారు కర్తపేరులేకుండా ఆ నవల ప్రకటింపబడడమే అందుకుకారణం ఆ నవలను ప్రశంసిస్తూ వ్రాసినవారిలో సంఘంలోని ప్రసిద్ధపురుషులూ, సాహితీ వేత్తలూ ఉన్నారు. అప్పటికి హరిభావ్ వయస్సు 19 సంవత్సరాలు మాత్రమే అప్పుడతడు పూనాలోని దక్కన్ కళాశాలలో ప్రథమవర్షం చదువుతున్నాడు.

అతని నవల లెటువంటివనిగానీ, నవలకర్తగా అతనికిగల స్థానం ఎటువంటిదనిగానీ చర్చించడానికి ముందు, అతడెటువంటి కుటుంబంలో జన్మించాడో, ఎలాంటి చదువు చదివాడో, ఎట్టివ్యక్తులతో కలిసి మెలిగాడో, తన సాహిత్య వర్తనానికి తగిన అర్హతనెట్లు గడించుకొన్నాడో తెలుసుకోవడం న్యాయం.

1864లో మార్చినెల 8వ తేదీన అంతగా సంపన్నంకాని, గౌరవప్రదమైన ఒక మధ్యతరగతి కుటుంబంలో హరిభావ్ ఆప్టే జన్మించాడు. అతని తాతగారి మృతితో ఆ కుటుంబానికి క్లిష్టపరిస్థితులు దాపురించాయి. అప్పటికే వివాహితుడైన ఆయన తండ్రి వయస్సు పదహారుసంవత్సరాలు మాత్రమే హరిభావ్ ఆప్టేకి ముగ్గురు పినతండ్రులు, ఇరువురు మేనత్తలు కూడా ఉండేవారు ఈ కారణాలచేత హరిభావ్ తండ్రియైన నారాయణరావ్ ఆప్టే చదువుకు తిలోదకాలిచ్చి, బొంబాయిలో తపాలా శాఖలో ఒక చిన్న ఉద్యోగాన్ని చేపట్టక తప్పలేదు పది పండ్రెండు మందితో కూడిన ఆ కుటుంబమంతా స్వల్పమైన అతని సంపాదన మీదనే ఆధారపడి బ్రతకవలసి వచ్చింది ఇలా ఉండగా, హరిభావ్ పినతండ్రియైన మాధవరావ్ తన పధ్నాలుగవ సంవత్సరంలో పెండ్లిచేసుకొన్నాడు. అతడు గొప్ప

చదువరిగా పేరుహొందాడు. ఆపేరు వృధాగాకుండా, అదనుచూసి, బొంబాయి లో న్యాయవాదవృత్తి ప్రారంభించి చేతినిండా సంపాదింపసాగాడు. హరిభావ్ మొదట బొంబాయిలో రాకూర్ ద్వార్‌లో ఉన్న ప్రాధమిక పాఠ శాలలోను, ఆమీద ఒక 'మిషను' పాఠశాలలోను విద్యాభ్యాసం చేసాడు కాని 1878లో అతడు పూనాలోని ఉన్నతపాఠశాలలో చేరిన తరువాతనే అతని నిజమైన విద్యాభ్యాసం ప్రారంభమయింది ఆ పాఠశాలలోను, ఆ పిదప అతడు 1880 నుండి 1882 వఱకూ నూతనాంగ్ల పాఠశాల (న్యూఇంగ్లీష్ స్కూల్)లో చదివిన కాలంలోనూ, అతడు మహారాష్ట్రంలోని ముఖ్యులైన మేధావులచే ప్రభావితుడయ్యాడు ఆ కాలంలోనే అతనిప్రతిభ, వ్యక్తిత్వం రూపుదిద్దుకొన్నవి నూతనాంగ్లపాఠశాలలో అతనికి విష్ణుశాస్త్రి చిప్లంకర్, గోపాల్ గణేష్ అగార్కర్, బాలగంగాధరతిలక్‌ల వంటి సమర్థులు గురువు లయ్యారు ఆనాటి సంఘాన్ని తమరచనలతో గొప్పగా ప్రభావితంచేసిన ప్రతిభావంతులు వాళ్ళు ఈ నాటికీ మహారాష్ట్రంలో వారిప్రభావం కనబడు తూనే ఉంటుంది హరిభావ్ అమితంగా చదివేవాడు పాఠశాలలో ఉండగానే అతడనేక విషయాలను గుఱించి చాలా విస్తృతంగా చదివాడు ఆ చదువు నిర్ణీతమైన ఆయన పాఠ్యప్రణాళికకు ఎన్నోరెట్లు మించిపోయింది పాఠశాలలో ఉండగానే అతడు ముఖ్యమైన సంస్కృతనాటకాలనూ, కావ్యా లనూ, బాణుడికాదంబరీ, దండిదశకుమారచరితలను మళ్ళీ మళ్ళీ చదివాడు 1881 - 1886ల మధ్య కాళిదాసు శాకుంతల నాటకాన్ని పదకొండుసార్లు చదివాడు. ఆంగ్లంలో షేక్స్పియర్, మిల్టన్, స్కాట్, షెల్లీ, కీట్స్, మోలి యర్, థాకరే, డికెన్స్, జేన్ ఆస్టెన్ మొదలైనవారి రచనల్ని చదివాడు. మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడు కావడానికి ముందే, పద్దెనిమిదేండ్ల ప్రాయంలో షేక్స్పియర్ "హామ్లెట్" నాటకానికి అగార్కర్ చేసిన భాషాం తరీ కరణాన్ని గుఱించి ('వికారవిలసిల్' అనే శీర్షికతో) 72 పుటల విమర్శ వ్రాశాడు, ఆ విమర్శలో తన భాషాంతరీ కరణాన్ని గుఱించి తప్పులెన్న బడినప్పటికీ పట్టించుకోకుండా అగార్కర్ ఉదారబుద్ధితో తన చిన్నశిష్యుని ప్రజ్ఞనే గుర్తించాడు గురువులు సంస్కృతాంగ్లరచనలు పాఠం చెప్పే టప్పుడు హరిభావ్ తఱచుగా వాటికి భిన్నార్థాలు సూచించేవాడు ఆ యర్థాలు బాగున్నప్పుడు అతని గురువులేమాత్రం సంకోచించకుండా, వాటినంగీకరించే వారు

అతడు తన విద్యార్థిదశలోని తొలిరోజుల్లో "విష్ణుశాస్త్రి చిప్లంకర్" ప్రభావానికి ఎక్కువగా లోనయ్యాడు. మహారాష్ట్రంలో పందొమ్మిదవ శతాబ్దంలోని చతుర్థపాదం పొంగులెత్తే గొప్పప్రతిభా ప్రాభవానికీ,

రసావేశానికీ నెలవయింది. ఆమోదయోగ్యాలుకాని పాశ్చాత్య విద్యా ఫలితాలెన్నో అప్పుడప్పుడే తెలియవస్తున్నవి కొత్తగా విద్యావంతులైన కొందఱు పాశ్చాత్య జీవితవిధానాలను అనుకరింప సాగారు వాటిలో మన కనపేక్షణీయమైన త్రాగుడుకూడా ఒకటి కొందఱు తమ సాంఘిక బాధ్యతలను నిర్వర్తించడం మానేశారు. మఱికొందఱు తమ సంపదను పెంపొందించుకునే చింతలోనే మునిగిపోయారు. వీళ్ళంతా అస్వతంత్రులై, అనాలోచితంగా, గుడ్డిగా పాశ్చాత్యుల్ని అనుకరించినవారే కాని, మాఱు తున్న పరిస్థితుల ఒత్తిడికి స్వతంత్రులైన మేధావులు మాత్రం రెండు రకాలుగా స్పందించారు ఒకవర్గం వాళ్ళు పాశ్చాత్యవిద్యను, దానినంటి వచ్చే ప్రయోజనాలను ఆహ్వానించారు కాని, అప్పటికి ప్రచారంలోఉన్న సంఘవ్యవస్థను గుఱించీ, మతవిశ్వాసాలను గుఱించీ పునరాలోచించి విలువల్ని నిర్ణయించడం ఆవశ్యకమని తలపోయలేదు ఈ వర్గంవాళ్ళకు విష్ణుశాస్త్రి చిప్లంకర్ నాయకుడు. సాంఘికమైన, మత విషయకమైన సంస్కారాన్ని అపేక్షించే వాళ్ళనతడు శక్తిమంతాలూ, తీక్షాలూ అయిన తనరచనలలో హేళనచేశాడు. అట్టి వాళ్ళు మూర్ఖులు, అజ్ఞానులుగానో, లేకప్రభుత్వానికిచెందిన దేశద్రోహులూ, వంచకులూ అయిన ముఖస్తుతి పరులుగానో ప్రత్యక్షమయ్యేటట్లు ఆయనచేత చిత్రింపబడ్డారు. అతడు కూడా పూనాలోని ప్రభుత్వోన్నత పాఠశాలలోనే ఉపాధ్యాయుడుగా పని చేస్తుండేవాడు. ఆ పాఠశాలలోనే హరిభావ్ విద్యార్థిగా మొట్టమొదట ఆయ నను కలుసుకొన్నాడు 1883లో ముప్పయ్యేండ్ల ప్రాయంలో విష్ణుశాస్త్రి తన ప్రభుత్వోద్యోగానికి రాజీనామా చేసి, "నూతనాంగ్లపాఠశాల" (New English School) అనే ఒక సొంత పాఠశాలను నెలకొల్పాడు ఇతరమైన అనేక సంస్థలకు కూడా విష్ణుశాస్త్రి పునాదులు వేశాడు. ఉదాహరణకు మరాఠీభాషలో 'కేసరి' అనే వారపత్రికను, ఆంగ్లంలో 'మరాఠా' అనేవార పత్రికనూ నెలకొల్పాడు ఆయన జాతీయతా దృక్పథ ప్రచారానికీ, విద్యావంతులైన హిందువులు ప్రజాశ్రేయస్సుకు సంబంధించిన తమ అభి ప్రాయాల్ని సొంతంగా ప్రకటించడానికీ, అవి ఉద్దేశింపబడ్డాయి

అట్టి విష్ణుశాస్త్రి ప్రోత్సాహం చేత ఉత్తేజితులై యువకులైన విద్యా వంతులెందఱో ఆయన చుట్టూ చేరారు. అందుచేత యువకుడూ, ప్రతిభా శాలీ, మృదు స్వభావుడూ అయిన హరిభావ్ విష్ణుశాస్త్రి చిప్లంకర్‌చే సహజం గానే ప్రభావితుడయ్యాడు అదే సమయంలో మఱొక ఆలోచనా స్రవంతి పొడసూప సాగింది సంప్రదాయ సిద్ధాలై వస్తున్న దోషజుష్టాలైన మన విశ్వాసాలూ, లోపయుతమైన మన జీవిత విధానాలే మనం పరుల యేలు బడికి లొంగిపోవడానికి కారణాలని యీ ఆలోచనా ధోరణికి సంబంధించిన

వాళ్ళు భావింపసాగారు. ఈ లోపాలు పరిహరింపబడితేనే గాని, మన సమాజం దృఢమూ, ఆరోగ్యవంతమూ, ప్రగతిశీలమూ - అయినదిగా రూపొందదు అందుచేత, హేతువాదమూ, దానిననుసరించి వచ్చిన ప్రశ్నించే స్వభావమూ ఈ వర్గం వారికి ప్రీతిపాత్రాలైనవి ఈ వర్గం వాళ్ళలో గోపాల్ గణేష్ అగార్కర్ బాలా శక్తిమంతుడు, అగ్రేసరుడు

ఈ రెండు వర్గాలే కాకుండా మధ్యే మార్గాన్నవలంబించిన మూడో వర్గం ఒకటుంది. జస్టిస్ మహదేవ్ గోవింద్ రెనడే యీ వర్గానికి నాయకుడు బ్రిటిష్ పరిపాలనం, ఆ ప్రభుత్వం ప్రవేశ పెట్టిన విధ్యావిధానం, అనుకొనని వరాలుగా మనకు సిద్ధించాయనీ, మొత్తం మీద ఉదారమైన ఆ ప్రభుత్వం మన దేశానికి శ్రేయస్కరం, లాభదాయకమైనదనీ యీ వర్గం వారు భావించారు అంత మాత్రం చేత హిందూ ప్రజల కోరికలనూ, హక్కులను పట్టించుకోని పర ప్రభుత్వం యొక్క నిర్దయమైన, నిర్లక్ష్యమైన వైఖరిని వాళ్ళెఱుగరనికాదు. సాంఘిక, మత విషయికాలైన సంస్కారాలకు సంబంధించినంతవఱకూ, ఈ వర్గం వాళ్ళు జాగరూకులైన ప్రగతి శీలురని చెప్పవచ్చు.

విష్ణుశాస్త్రి, చిప్లుంకర్ 1882లో ముప్పది రెండేండ్ల చిన్నవయస్సు లోనే మరణించాడు. హరిభావ్ తొలి నాళ్ళలో ఆయన ప్రభావానికెక్కువగా లోనయ్యాడు. గురువు మరణానికాయనెంతో దుఃఖించి, "శిష్యజన విలాప" మనే పేరుతో ఒక స్మారక గీతి వ్రాశాడు. ఆ పద్యాల అచ్చు ప్రతులు రెండే రోజులలో వేయి అమ్ముడు పోయాయి.

ఆ కాలంలో నూతనాంగ్ల పాఠశాలలో హరిభావ్‌కు అగార్కర్ అధ్యాపకుడయినా, సాహిత్య విషయంలో గానీ, సంస్కారదృక్పథంలోగానీ ఆయన ముద్ర హరిభావ్ మీద అంతగా పడలేదు అగార్కర్ వ్రాసిన 'వికారవిలసిత్''ను హరిభావ్ విమర్శించడాన్ని గుఱించి యిదివఱకే చెప్ప బడింది. కాని, అంతకొక సంవత్సరం మునుపే కూడ కాళిదాస భవ భూతుల రచనల తులనాత్మక పరిశీలన విషయంలో హరిభావ్ అగార్కర్‌తో వివాద పడ్డాడు. అగార్కర్ భవభూతి కంటె కాళిదాసు విశిష్టుడంటే, హరిభావ్ కాళిదాసు కంటె భవభూతి విశిష్టుడన్నాడు అతడు సంస్కృత సాహిత్యాన్నంత క్షుణ్ణంగా చదివి ఉండబట్టే ఆ విషయాన్నంత ధైర్యంగా చెప్పగలిగాడు.

కాని అగార్కరునెడ హరిభావ్ ధోరణిలో క్రమంగా ఒక మార్పు కలుగసాగింది 1882 లో ఒకప్పుడు గోవింద్ వాసుదేవ్ కనిత్కర్

తోను, కొంత కాలం తరువాత అతని భార్యమైన శ్రీమతి కాశీబాయ్ కనిత్కర్‌తోను అతనికి కలిగిన పరిచయమే అందుకు కారణం శ్రీ కనిత్కర్ న్యాయవాదవృత్తిని చేపట్టిన గొప్ప చదువరి లోతైన ఆలోచన, నిష్పాక్షికమైన బుద్ధి, ప్రగతి శీలదృక్పథమూ ఉన్నవాడు అతడు తన భార్యకు కూడా చదువు చెప్పాడు ఆ కాలంలో చదవనూ, వ్రాయనూ నేర్చుకోవడానికి గూడా స్త్రీ ఎదుర్కొనవలసి ఉండిన కష్టాలను బట్టి చూస్తే, తన భర్త ప్రయత్నాలకు పూర్తిగా అనుకూలించి, త్వరలోనే పరిపూర్ణ విద్యావతి కావడానికి ఆమె విశిష్టత గోచరిస్తుంది ఆమె అన్నా, ఆమె అభిప్రాయాలన్నా హరిభావ్‌కు గొప్ప గౌరవం అయినా, కొన్ని సందర్భాల్లో ఆమెతో ఏకీభవింపలేనప్పుడు అతడు తన అభిప్రాయాలను ప్రకటించడానికి వెనుకాడలేదు. శ్రీ కనిత్కర్ హరిభావ్‌కు జె యస్ మిల్ రచనలతో, ముఖ్యంగా అతని 'స్త్రీ దాస్యం' అనే రచనతో పరిచయం కలిగించాడు హరిభావ్ ఆ పుస్తకాన్ని మఱలా మఱలా ఎన్నోసార్లు చదివి, దానిచే చాలా ప్రభావితుడయ్యాడు ఇంకా హెర్బర్ట్, స్పెన్సర్, ఆపై మోర్లే రచనలను చదివి అతడు క్రమంగా అగార్కర్ అభిప్రాయాల విలువనెఱిగి, తుదకతణ్ణి మెచ్చుకోసాగాడు. అందువేతనే 1888లో అగార్కర్ తన అభిప్రాయాలను ప్రకటించడానికై సొంత పత్రికను ప్రారంభించాలని నిర్ణయించుకొన్నప్పుడు, హరిభావ్ అతడిని మహాపురుషుడని, ఉత్తమాచార్యుడనీ పేర్కొని సంఘ ప్రతికూల శక్తులను బయల్పరచడంలో ఆయనకు సహాయపడడానికి సంతోషంతోనూ, ఉత్సాహంతోనూ సిద్ధపడ్డాడు

ఈ లోపల గోపాలకృష్ణ గోఖలే దక్కను విద్యా సంస్థలోను, ఫెర్గూసన్ కళాశాలలోను చేరాడు హరిభావ్ అతనికీ, మితవాదులైన రాజకీయవేత్తలకూ, సాంఘికవిషయ సుసంస్కారపరులకూ చేరువయ్యాడు తరువాత వారు ఆప్తమిత్రులయ్యారు గోఖలేతో పాటు రెనడేకి కూడా హరిభావ్ సన్నిహితుడయ్యాడు అట్లయి, గోఖలే మనదేశంలో లేనప్పుడు, సాంఘిక విషయ పరిశీలనకూ, ప్రజల బాధలను ప్రకటించడానికీ, అతడు స్థాపించిన దక్కను సభకు సంయుక్త కార్యదర్శిగా పనిచేశాడు

పాఠశాల గడప తొక్కింది మొదలు హరిభావ్ తెగచదివేవాడు అతని ఆ పఠనాసక్తి, విద్యారక్తి జీవితాంతం వఱకూ కొనసాగాయి. అతడు మిల్ వ్రాసిన 'స్త్రీ దాస్యం' అనే గ్రంథాన్ని పలుతడవలు చదివినట్లు మునుపు చెప్పబడింది అలాగే, అతడొకసారి మోర్లే రచనల్లో తాను చదవని పంక్తి ఒకటి కూడా లేదని చెప్పడం జరిగింది మనదేశంలోని భాషల్లో ఆయన తన మాతృభాషైన మరాఠీలోనేగాక, సంస్కృతంలోనూ అమేయమైన

పాండిత్యం సంపాదించాడు అంతేకాదు, ఒక బెంగాలీ వ్యక్తితో బెంగాలీ భాషలో చర్చలు జరిపి, అతణ్ణి ఓడించగలంత పాండిత్యాన్ని ఆ భాషలో గడించాడు పాశ్చాత్య భాషల్లో, ఆంగ్లంతో పాటు ఫ్రెంచి, జర్మను భాషలుగూడా ఆయనకు తెలుసు ఒక జర్మను పుస్తకాన్ని తెప్పించి చదివి నట్లు అతని ఉత్తరాలను బట్టి తెలుస్తున్నది విభిన్న విషయాలను గుఱించిన అతివిస్తృతమైన పఠనంచేత, ముఖ్యమైన గ్రంథాలను క్షుణ్ణంగా పఠించడం చేత, విశ్వవిద్యాలయపు పట్టం లేకపోవడం అతనికొక కొఱత కాలేదు కాని, తానొక విశ్వవిద్యాలయపు పట్టం పొందలేక పోయినందుకు అతడు బాలా బాధపడ్డాడనడం మాత్రం యథార్థం తరువాత అతడు బొంబాయి విశ్వ విద్యాలయపు మరాఠీ M A పరీక్షలకు పరీక్షకుడుగా నియమింపబడగా, అతనికా కొఱత గూడా పూర్తిగా తీఱిపోయింది

హరిభావ్ పుస్తకాల పురుగుకాడు. లోకం తెలియని రచయితాకాడు ప్రజాహితమైన కార్యక్రమాల్లో ఉత్సాహంతో పాల్గొన్నాడు పూనాలో ప్లేగువ్యాధి వ్యాపించిన కాలంలో అతడు తన ప్రాణాలను కూడా లెక్కచెయ్య కుండా, ఎన్నోసార్లు స్వచ్ఛందంగా సంఘసేవ చేశాడు అతడెన్నో సంవత్సరాలు పూనా మునిసిపాలిటీ సభ్యుడుగా నియమింపబడ్డాడు ఒక కొంతకాలం మునిసిపాలిటి అధ్యక్షుడు గూడా అయ్యాడు 1890లో అతడు 'కరమానుక్' అనే సొంత పత్రికను స్థాపించి, దానికి సంపాదకత్వం వహించాడు అదిసుత, అతని జీవితాంతం వఱకూ అతడు వ్రాసిందంతా 'కరమానుక్'లోనే ప్రకటితమయింది ఇదిగాక, అగార్కర్ మరణానంతరం అతని "సుధాకర్" పత్రికకూ, "ధ్యాన్‌ప్రకాష్" అనే ఒక మంచి దిన పత్రికకూ సంపాదకత్వ విషయంలో సహాయంచేశాడు ఆ విధంగా హరిభావ్ చైతన్యవంతమైన పరిపూర్ణ జీవితం గడిపాడు అతనికి చాలామంది స్నేహితు లున్నారు వారి సాహచర్యం అతనికెంతో సంతోష దాయకమయింది.

మహారాష్ట్రంలో 19వ శతాబ్ది నాల్గవపాదం గొప్పసాంఘిక చైత న్యానికీ, శేముషీ సంపదకూ ఆలవాలమైనట్లు చెప్పబడింది కాని, యీ యిరవైయయిదు సంవత్సరాల్లో 1885కూ 1895 కూ నడుమగల పది సంవత్సరాలు చాలా అశాంతికరమైనవి ఈ పది సంవత్సరాల కాలంలో తలయెత్తిన కొన్ని వివాద్యాంశాలు వ్యక్తుల్ని రెచ్చగొట్టి వాళ్ళ ఉద్రేకాలను పెంచాయి. ఫలితంగా ఆప్తమిత్రులు బద్ధశత్రువులయ్యారు జీవితాంతం కలిసి పనిచేయడానికై ప్రతినపూనినవారు విడిపోయారు సార్వజకనిమైనవి వాద్యాంశమేదైనా సరే, వార్తాపత్రికలమూలంగా, సభలమూలంగా వాదోప వాదాల పరిధిని దాటి పరస్పర దూషణలలో పడి పోయింది మహా

రాష్ట్రంలోని విద్యావంతులందరూ సంఘసంస్కరణవాదులు, తద్వ్యతిరేకులు - అనే రెండు విరుద్ధ సమూహాలకు చెందినవారుగా విడిపోయినట్లనిపించింది ఆ నాటి సంఘ సంస్కరణోద్యమం బాల్యవివాహం, బలవంతపు వైధవ్యం, స్త్రీవిద్య వంటి రెండు మూడు సమస్యలతో ముడిపడి ఉండేది. ఎట్టకేలకు, అవన్నీ కలిసి హిందూ సంఘంలో స్త్రీకి గల హక్కులు - ఆ సంఘంలో ఆమె స్థానం - అనే ఒకే వివాద్యాంశంగా రూపొందాయి

1884-85లో బైరంజీ మలబారి బాల్యవివాహాన్ని గురించీ, బలవంతపు వైధవ్యాన్ని గురించీ కరపత్రాలు ప్రకటించి, ఆ విషయాలను గురించి ప్రజలు తీవ్రంగా ఆలోచించేటట్లు చేయనారంభించాడు మనదేశంలో ప్రజానాయకుల నభ్యర్థించడంతో తృప్తిపడక, అతడా కరపత్రాలను ఇంగ్లండులోని విశిష్టులైన నాయకులకు గూడా పంపి, బాల్యవివాహం మొదలుగా గల సాంఘికమైన అన్యాయాలను రూపుమాప గోరాడు. అతని యీ చర్య మహారాష్ట్రంలోని వైదికాచార పరాయణులలో ఒక కల్లోలాన్ని సృషించింది. మలబారి సత్యస్థితిని గురించీ, హిందువుల విషయంలో తల దూర్చడానికి ఆయనకు గల హక్కును గురించీ ప్రశ్నలు పుట్టాయి 1880లలో యుక్త వయస్సును పెంచి చట్టం చేయాలన్న ప్రతిపాదన చేయబడినపుడు, ఈ వివాద్యాంశం పరకోటి ముట్టింది. సభలు జరిపీ, సంతకాలు సేకరింపీ, వయస్సు మార్పునకు అనుకూలంగానూ, ప్రతికూలంగానూ కూడా చాలా మంది విన్నపాలు పంపుకున్నారు అభిప్రాయభేదాలు తీవ్రతరం కావడం చేత వివాదంలో మర్యాద, ఔచిత్యాలు బొత్తిగా లోపించి పోయాయి కడకుయుక్త వయస్సును పెంచాలనే ప్రతిపాదన అంగీకరింపబడి 1891లో శాసనం చేయబడింది అంతవఱకూ ఉన్న పదినుండి వయస్సు 1886లో IPC క్రింద పన్నెండుకు పెంచబడింది

వయః పరిమితికి సంబంధించిన యీ వివాదంలో రెండు ముఖ్యాంశాలు ఇమిడి ఉన్నాయి అసలటువంటి సంస్కరణం ఆవశ్యకమేనా? అన్నదొకటి ఒకవేళ అది ఉచితమూ, ఆవశ్యకమూ అనిపించినప్పటికీ, ఒక పరాయి ప్రభుత్వ శాసనం ద్వారా దాన్ని అమలు జరపాలా? అన్నది రెండవది కానీ, ఆ ప్రతిపాదన అంగీకరింపబడి చట్టమైన తరువాత ఆ వివాదమే సమసిపోయింది

ఈ కాలపు మఱొక వివాద్యాంశం కేవలం వ్యక్తిగత మయింది. కానీ అది పలుచిక్కులకు లోనయింది. 1884లో దాదాజీ అనే ఒక వ్యక్తి ఆయన భార్యయైన రఖ్మాబాయ్ ఆయనతో కలిసి జీవించేటట్లు చేయవల

సిందంటూ 'కోర్టు'కు వెళ్ళాడు అనేకకారణాలు చూపి రఖ్మాబాయ్ ఆయన కోరికను నిరాకరించింది. క్రింది కోర్టు దాదాజీకి ప్రతికూలంగా తీర్పివ్వడం జరిగింది. కాని, దాదాజీ విన్నపాన్ని బట్టి హైకోర్టు, క్రింది కోర్టు తీర్పును రద్దుచేసి, రఖ్మాబాయ్ ఆమె భర్తతో కలిసి కాపురం చేయవలసిందనీ, లేదా ఖైదు తప్పదని తన ఆజ్ఞను జారీచేసింది రఖ్మాబాయ్ తన భర్త దగ్గఱకు పోవడం కంటె జైలు జీవితాన్నే యిష్టపడింది ఈ వ్యాజ్యంలోని అసలైన వివాద్యాంశం న్యాయమేమన్నదీ కాదు, కోర్టులో ఇవ్వబడిన తీర్పు న్యాయ సమ్మతమైనదా ? అన్నదీ కాదు. ఒక భార్య ఆమె కిష్టం లేనప్పుడు తన భర్తతో కలిసి కాపురం చేయవలసిందని నిర్బంధించడం సరైన పనేనా? అన్నదే ప్రశ్న సమర్థులైన నాయకులు ఇరుపక్షాలుగా చీలి కటువైన వాగ్వాదాలతో ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకోవడానికి కూడా యీ వ్యాజ్యం కారణభూతమయింది. కడకు దాదాజీయే హైకోర్టు తీర్పును అమలు జరప వద్దని నిర్ణయించుకొన్నాడు ఆయన వాదాన్ని బలపఱిచిన వారు గూడా రఖ్మాబాయ్‌ని బలవంతంగా ఆమె భర్తతో కలపడం ఆ యిద్దఱకూ శ్రేయ స్కరం కాదనే నిర్ణయానికొచ్చారు ఆ విధంగా ఆ వాదం పరిష్కార మయింది

ఇక అనాటి మూడవ వివాద్యాంశం శారదా సదనాన్ని గుఱించి. ఆ సదనం 1889లో పండిత రమాబాయ్ చేత బొంబాయిలో స్థాపింప బడింది. ప్రాథమికంగా ఆ సదనం వితంతువులైన హిందూ యువతుల. విద్యాభ్యాసం కోసం ఏర్పడింది. కాని, అందులో అవివాహితలైన కన్యలకు గూడా ప్రవేశం కల్పింపబడింది. పండిత రమాబాయ్ చాలా తెలివైనది. సమర్థురాలు శాస్త్ర పాండిత్యం కలిగిన విదుషీమణి ఆమె ఒక బ్రహ్మ సామాజికుణ్ణి పెండ్లి చేసుకొన్నది కానీ చిన్న వయసులోనే వితంతు వయింది. వితంతువులయిన హిందూ యువతుల దుస్థితి యెంత ఘోర మయిందో ఆమెకు బాగా తెలుసు శారదా సదన సంస్థాపనలో, నిర్వహణ లో ఆమెకు సంఘ సంస్కరణలలోనూ స్త్రీ విద్యలోనూ విశ్వాసమున్న హిందువులు సహాయం చేశారు. కానీ, సదనానికి కావలసిన ధన సాహాయ్యం మాత్రం ముఖ్యంగా విదేశాల్లోని క్రైస్తవ మిషనరీల నుండి వచ్చేది. కారణం, రమాబాయ్ మునుపే విదేశాలల్లో క్రైస్తవ మతాన్ని స్వీకరించి ఉండటమే ఆమె క్రీస్తువే అయినప్పటికీ, సదనంలోని వారిని క్రైస్తవ మతస్వీకారానికి పురి కొల్పదనే ఒక నమ్మకం ఉండేది కొన్ని కారణాల చేత 1890లో సదనం యొక్క ముఖ్య కార్యాలయం పూనాకు మార్చ బడింది. ఆ పిమ్మట కొంత కాలానికే సదనంలోని కొందఱమ్మాయిలు

క్రైస్తవమతం స్వీకరించినట్లు వదంతులు వ్యాపించాయి. సదనంలోని ఏ అమ్మాయినీ క్రీస్తువు కమ్మని చెప్పకపోవడం, ఏ యువతి అయినా తానైయిష్ట పడి క్రీస్తువు కాదలుచుకుంటే అడ్డపడక పోవడం తన పద్ధతిగా రమాబాయ్ చాటుకొన్నది తుదకు, అప్పటివఱకూ సానుభూతి చూపిన హిందువులు సదనానికి సాయం చేయడం మానుకొన్నారు శారదా సదనం పూర్తిగా క్రైస్తవ సదనమయింది ముక్తి సదనమనే పేరుతో "కెగ్గోవన్"కు మార్చ బడింది అంతటితో ఆ విషయానికి సంబంధించిన వివాదం సమసి పోయింది

ఈ వివాదాలు సాగినంతకాలం హరిభావ్ మనస్సూ, సానుభూతీ సంఘసంస్కరణ వాదులవైపే ఉన్నది కానీ ఆయన ఆ సంస్కరణ కార్య క్రమాల్లోకి ప్రత్యక్షంగా దిగలేదు ఆయన కుటుంబ పరిస్థితులూ, వ్యక్తిగత జీవితమూ అందుకు కారణం అతడి సంతోషాన్ని పోగొట్టి దుఃఖితుణ్ణి చేసిన ఘోరమైన పరిస్థితులవి అతనికి నాలుగుసంవత్సరాల వయసున్నప్పుడతని తల్లి మరణించింది తండ్రి రెండో పెండ్లి చేసుకొన్నాడు. హరిభావ్ తన పినతల్లి, అంటే తన పినతండ్రియైన మాధవరావ్ భార్య పెంపకంలోకి వచ్చాడు కాని, అతనికెనిమిది సంవత్సరాలు నిండేటప్పటికి, 1872లో ఆమె కూడా మరణించింది అటు పిమ్మట ఆ కుటుంబంలోని పెద్దవయసు వాళ్ళే అతని ముద్దూ ముచ్చటా చూసేవారు. ఆ కుటుంబమంతా తపాలా శాఖలో పనిచేసే హరిభావ్ తండ్రిమీదనే ఆధారపడి ఉండేది ఏ ఊరికైనా మార్చబడదగిన ఉద్యోగం అతనిది ఆయన పినతండ్రియైన మహదేవ్ చిమ్నాజీఆప్టే నుండి కూడా కొంత సహాయం అందేది అతనికి బొంబాయిలో మంచి ఆదాయంగల వకీలు వృత్తి ఉండేది భార్య మరణించిన తరువాత మాధవరావ్ మళ్ళీ పెండ్లి చేసుకోలేదుగానీ, త్రాగుడు మఱిగి ఒక స్త్రీని తెచ్చుకొని ఆమెతో జీవింపసాగాడు ఇవన్నీ అతన్ని కుటుంబానికి కొంతదూరం చేశాయి అందుచేత హరిభావ్ అప్పటికే పూనాలో స్థిరపడి ఉన్న మఱికొందఱు కుటుంబసభ్యులతో కలిసి బ్రతక డానికై 1878లో అక్కడకు వెళ్ళాడు. 1879లో పదిహేను సంవత్స రాల వయసప్పుడే అతనికి పెండ్లయింది.

హరిభావ్ 1883లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. కానీ, ఆ తరువాత ఐదు సంవత్సరాలపాటు చదివినా (కళాశాలచదువు) మొదటి సంవత్సరం పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేకపోయాడు. లెక్కలంటే అతనికున్న వైముఖ్యమే అందుకు కారణం. కడకాతడు 1888లో తన చదువుకు తిలోదకాలిచ్చాడు.

అప్పటికి హరిభావ్‌కు ఇరవైనాలుగు సంవత్సరాలు. రెండు నవలలు ప్రకటించి రచయితగా పేరు తెచ్చుకొన్నాడు కాని, యిందువల్ల అతనికంతగా ధనం ప్రాప్తించలేదు ఏ పరీక్షలోనూ గట్టెక్కనందువల్ల స్వతంత్రంగా జీవించడానికి తగిన ఉద్యోగమేదీ అతనికి లభించలేదు. అంతేగాక, అతడు వివాహితుడు బలమైన సంస్కరణ దృక్పథం కలవాడు కావడంచేత తన భార్యకు చదవనూ వ్రాయనూ నేర్పయత్నించాడు. చదువుకొన్న వివాహిత స్త్రీలలో తన కాదర్శప్రాయురాలైన శ్రీమతి కాశీబాయ్ కనిత్కర్‌ను తన భార్య అనుసరించాలని ఆయన కోరిక కాని, ఆయన యీ సంస్కరణ పూర్వకమైన ప్రయత్నానికి కుటుంబంలోని అందఱూ అడ్డుపడ్డారు. అసలాయన భార్యకే నేర్చుకోవాలన్న ఆసక్తి లేకపోవడం అంతకంటే విశేషం ఆ విధంగా ఆమె విషయంలో అతడు ఎంతో ఆశాభంగం పొందాడు కుటుంబంలో అందఱి కంటె అతడే చిన్నవాడు కావడం చేత తన కోరిక సాధించుకునే అవకాశం అతనికి లేకపోయింది అందువల్ల అతడు ఆశాభంగంతో, నిస్సహాయతతో అలమటించాడు అతడు న్యాయవాద వృత్తిలో పట్టాపొంది, తన క్రింద శిక్షణ పొందాలనుకొన్న అతని పినతండ్రి కూడా ఆయన విషయంలో ఆశలు వదలుకొన్నాడు

1888లో సంఘసంస్కర్తయైన ఆయన పినతండ్రి ఉన్నట్టుండి తన పద్ధతి మార్చుకొని పూర్తిగా ఆచారపరాయణుల పక్షమయ్యాడు. ఆనందాశ్రమమనే ఒక సంస్థను స్థాపించి, దాని నిర్వహణకోసం ఒక ఆస్తిని కూడా ఏర్పాటు చేశాడు ప్రామాణిక సంస్కృత గ్రంథాలను సేకరించి, భద్రపఱచి, పరిష్కరించి ప్రకటించడం, పండితులైన బ్రాహ్మణులనూ, సాధువులనూ, సన్యాసులనూ సత్కరించడం ఆ సంస్థ లక్ష్యం అక్కడ పవిత్రమైన ఆచారాలను పాటిస్తూ పూజలు జరపడాని కుద్దేశింపబడిన శివాలయం ఒకటి ఉండేది

మాధవరావ్ ఆ సంస్థ నిర్వహణ బాధ్యత హరిభావ్‌కు అప్పజెప్పి, తననూ, తన కుటుంబాన్నీ పోషించుకోవడం కోసం కొంత సొమ్ము తడు తీసుకోవడాని కనుమతించాడు ఇది హరిభావ్‌కు కొంత ఆర్థికస్థిరత్వాన్ని కలిగించింది కాని అదే సమయంలో అతనినొక విపరీత స్థితిలో పడవేసింది మనో నిర్ణయాన్నిబట్టి తాను సంస్కారప్రియుడైనా, ఆ సంస్థ నిర్వహణాధికారిగా ఛాందసమైన జీవితాన్ని ప్రోత్సహిస్తూ అటువంటి జీవితమే తానూ గడపవలసి వచ్చింది ఇది అతనికి విసుగు కలిగించి

ఉండవచ్చు కాని, అతనికా స్థితి తప్పలేదు. ఆశ్రమంలో అతడొక్కడే నివసించేవాడు అతని భార్య యథా పూర్వంగా తక్కిన కుటుంబంతో నివసించేది

1891లో ఆయన భార్య మరణించింది అతని కప్పటికి 27 సంవత్సరాలు మళ్ళీ పెళ్ళిచేసుకోదగిన వయస్సు సంస్కర్తగా ఒక వితంతువును పెండ్లాడటమో, లేక పెండ్లి చేసుకోకపోవడమో ఆ స్థితిలో అతడు చేయవలసినపని అంతకుముందే 1873లో తన భార్య మరణించగా తండ్రి నిర్బంధంమీద నలభైయొక్క సంవత్సరాల వయస్సులో పదకొండేండ్ల అమ్మాయిని పెండ్లాడిన న్యాయమూర్తి ఎమ్ జి రెనడే ఉదంతం ఆయనకు తెలుసు రెనడే తన చర్యకు పలితంగా సంస్కరణవాదులూ, అచార పరాయణులూ అయిన యిరుపక్షాలవారి తీవ్ర విమర్శలకు గురయ్యాడు హరిభావ్ కూడా రెనడే చర్యను నిరసించడం జరిగింది. ఇప్పుడతనికి పరీక్షా సమయం కుటుంబంలోని తన స్థానాన్ని బట్టి అతడొక వితంతువును పెండ్లాడటమనేది జరగని పని అందుచేత అతడసలు పెండ్లి చేసుకోకూడదని నిర్ణయించుకొన్నాడు తన కుటుంబ సభ్యులకీ విషయం తెలియజేశాడు కాని, అప్పటికే అతని పునర్వివాహాన్ని గురించిన చర్చ సాగడం, వధువుకోసం అన్వేషణ ప్రారంభించడం జరిగిపోయాయి తాను పెండ్లాడనని చెప్పినందువల్ల కుటుంబమంతా అతనియెడ పగతో కూడిన క్రూరమైన మూకీభావం వహించింది ఇది అతణ్ణి యింకా బాధించింది. అప్పటికి అతని అవ్వగారు ఇంకా బ్రతికే ఉన్నారు ఆమెకతడు చాల ఇష్టుడు అతనికి కూడ ఆమె అంటే ఎంతో ఇష్టం ఆమె ఎంతో ప్రయత్నించి మళ్ళీ పెళ్ళిచేసుకోడానికి అతణ్ణి ఒప్పించి ప్రమాణం కూడ చేయించుకొంది అలా కాని పక్షంలో తాను ప్రశాంతంగా మరణించలేనని ఆమె చెప్పడం అతని ఒప్పుదలకు కారణం

హరిభావ్ రెండవపెండ్లి 1892లో జరిగింది. అతనికప్పటికి 28 సంవత్సరాలు కొత్త వధువుకు 11 సంవత్సరాలు 17 సంవత్సరాల వయోభేదం ఏది చేసినందుకు రెనడేని ఆయన నిందించాడో, సరిగ్గా ఆయన అదే చేయవలసి వచ్చింది ఆ పెండ్లి బలవంతంగా ఆయనమీద రుద్దబడినందువల్ల ఆయన ఆ పెండ్లి జరగనట్లే ప్రవర్తించాడు ఆయన ఆశ్రమంలోనే నివసించేవాడు ఆయనభార్య తక్కిన కుటుంబంతో ఉండేది భోజనానికి వచ్చినప్పుడు మాత్రమే ఆయన కుటుంబంతో కలిసేవాడు ఒకవిధంగా ఇది ఆయన తన భార్యకు చేసిన అన్యాయమే

కడకు అతని భార్య వివాహితుడుగా అతడు నెరవేర్చవలసిన బాధ్యతలను తెలియజెప్పి తననుకూడ ఆయనతోకలిసి జీవించడానికి అనందాశ్రమానికి తీసుకువెళ్ళమని కోరింది కాని 1903లో ఇది జరిగే టప్పటికే వాళ్ళకు పెండ్లై 11 సంవత్సరాలు గడిచిపోయాయి హరిభావ్ తన భార్యను అమర్యాదగా చూడలేదు ఎప్పుడూ నిర్దయను ప్రదర్శించ లేదు కాని ఆ పదకొండు సంవత్సరాలకాలం ఆ భార్యాభర్తలిద్దరి తీవ్రమైన మానసిక వ్యదకు ఆలవాలమయింది ఆ తరువాత ఆనందా శ్రమంలో వారి జీవితం సంతోషంగా గడిచిపోయింది హరిభావ్ స్వాభావి కంగానే స్త్రీలంటే చాలదయ, సానుభూతి ఉన్నవాడు కావడమే అందుకు కారణం అతని భార్యకు కొంత విద్య కూడ అబ్బింది అతడామెను ఇంకా ఎక్కువ చదవమని ప్రోత్సహించాడు

ఈమధ్యకాలంలో 1894లో అతని పినతండ్రి మరణించాడు. ఆయన తండ్రి 1896లో ఉద్యోగం నుండి విరమించి కుటుంబంతో నివసించడానికి పూనాకు వచ్చాడు. ఆయన 1915 వఱకూ జీవించి ఉన్నాడు ఆనాటి చాలమందివలె ఆయన ఆచారపరాయణుడు. ఆయన హరిభావ్ అభిప్రాయాలను అంగీకరించలేదు. అలాగని బైటపడి ఆయన అభిప్రాయాలను నిరసించనూలేదు. అప్పటికే హరిభావ్ వ్యక్తిగా ఎదగడం, రచయితగా గొప్పపేరు గడించడం, ప్రజాజీవిత రంగంలో ప్రాముఖ్యం సంపాదించడంకూడా ఆయన అభిప్రాయాలను నిరసించడం అతని తండ్రికి సాధ్యం కాకపోవడానికి కారణాలు.

ఆయనకు 1906లో ఒక కూతురు పుట్టింది సహజంగానే ఆ పాపంటే ఆయనకు ప్రగాఢమైన ప్రేమ. కానీ, దురదృష్టవశాత్తు అతని జీవితంలో ఒక తీరనిలోటు కల్పిస్తూ ఆమె 1913లో మరణించింది.

అతని వ్యక్తిగత జీవితానికి సంబంధించిన యీ వివరణాత్మకమైన వృత్తాంతానికి నవలా రచయితగా అతడు గడపిన జీవితంతో సంబంధం ఉన్నది సంఘసంస్కరణకు సంబంధించిన ఆయన అభిప్రాయాలూ, సంస్కర్తలతో ఆయనకున్న సాన్నిహిత్యం, కుటుంబంలోని ఆయన స్థానం, ఆ కుటుంబంతో ఆయనకున్న అనుబంధం, తన పినతండ్రిమీద ఆధారపడవలసి రావడం ఆయన్ని భిన్నమార్గాలలోకి లాగి, ఎంతో మానసికమైన శ్రమను కల్గించాయి. ఆయన శ్రీ కనిత్కర్, శ్రీమతి కనిత్కర్‌లకు వ్రాసిన ఉత్తరాలనుబట్టి యీ విషయం స్పష్టపడుతున్నది. తనకొక సొంతయిల్లు లేదనే విషయం ఆయన్నెంతో బాధించింది కాని,

యీ మానసికమైన బాధతో అతడు క్రుంగిపోలేదు అతడు దేనికీ దూరం కాలేదు దేన్నీ అసహ్యించుకోలేదు అన్నింటినీ సమచిత్తంతో స్వీకరించి, బాధకు తన మనస్సు బలికాకుండా కాపాడుకొన్నాడు.

స్వాభావికంగా అతడు ఆందోళనపరుడూ, ప్రచారకుడూ కాదు. చదవడమంటే ఆయనకు ప్రీతి వ్రాయడం ఆయన వ్యసనం. ఆయన 1890లో ప్రారంభించిన "కరమానుక్" వార్తాపత్రికలోనే ఆయన తరువాతి నవలలన్నీ ప్రకటించాడు. చదువరులకు విషయాలు తెలిపి వాళ్ళను విజ్ఞానవంతుల్ని చేసి, వాళ్ళకాహ్లాదం కలిగించడమే ఆ పత్రిక ఆశయం. ఆయన వివాదాలజోలికి పోలేదు కాని, అతడు జీవించిన కాల పరిస్థితులూ, ప్రజాజీవితంతో అతనికున్న సంబంధమూ మనుష్యుల మనస్తత్వాలను క్షుణ్ణంగా చదవడానికీ, విపరీతమైన వాళ్ళ ఆలోచనా ధోరణులను పరిశీలించడానికి గొప్ప అవకాశాన్ని కల్పించాయి. ఆయా రచనలకీ యనుభవాలు ఎంతో ఉపకరించాయి. హరిభావ్ 1919లో మార్చి 3 న మరణించాడు

# 2. హరిభావ్ ఆప్టేకు ముందు మరాఠీ నవల

పాతరోజుల్లో కూడా మరాఠీలో నవలఅంటే అసలు తెలియకపోలేదు పదమూడవ శతాబ్దికి చెందిన మహానుభావ్ సారస్వతంలో చిన్నచిన్న కట్టు కథలూ, ఉదాహరణలతో కూడిన నీతి కథలూ కనిపిస్తాయి. వ్రత మాహాత్మ్యాలు మొదలైన మతాచారాలకు సంబంధించిన కథలూ ఆడవాళ్ళ మధ్య ప్రచురంగా ఉండేవి. ఎందఱో దేవుళ్ళను గుఱించీ, దేవతలను గురించీ పదింబదిగా స్తుతిస్తూ విభిన్న మతప్రచారకులు చెప్పిన కథలుండేవి. దయ్యాలనుగుఱించీ, పిశాచాలను గుఱించీ, మోహినీ దేవతలను గుఱించీ అవ్వలు తమ మనుమలకూ, మనుమరాండ్రకూ చెప్పే కథలుండేవి. వీటితోపాటు మహాభారత, రామాయణ, భాగవతాలలోని కథలూ ప్రచారంలో ఉండేవి. కానీ, ముద్రితగ్రంధాలు లేకపోవడంచేత అప్పుడవన్నీ మౌఖిక ప్రచారంలోనే బ్రతికిఉండేవి.

ఈనాడు మనకు తెలిసిన నవల మనదేశంలో ఆంగ్లప్రభుత్వం నెలకొల్పబడిన తరువాత ప్రప్రథమంగా పుట్టింది. అప్పటికి ముద్రణాలయాలు నెలకొల్పబడినవి. ప్రభుత్వం చేతా, క్రైస్తవ మిషనరీల చేతా విద్యాసంస్థలు కూడా స్థాపింపబడినవి. పాఠ్యపుస్తకాలు మొదలైన అచ్చు పుస్తకాల ప్రచురణ ప్రారంభమయింది. ప్రారంభంలో పాఠశాలా

విద్యార్థులకు బోధించడం కోసం, వాళ్ళ జ్ఞానాభివృద్ధి కోసం చిన్న చిన్న కట్టు కధలూ, కధలూ, ప్రకటింపబడ్డాయి. ఆ రచనల్లో విద్యార్థులకు వినోదం కలిగించే విషయానికి స్థానమే లేదు. హరికేశవ్‌జీ పథారే 1841లో "యాత్రిక్ క్రమణ్" అనే పేరుతో ప్రకటించిన నవలే మరారీభాషలో మొట్టమొదటి నవల అది 'బన్యన్' వ్రాసిన Pilgrims' Progress అనే రచనకు భాషాంతరీ కరణం. కాని అసలైన అర్థంలో దీన్ని నవల అనడానికి వీల్లేదు అది బైబిలు బోధన మీద ఆధారపడిన ఒక అలంకారికమైన రచనగా ప్రఖ్యాతమయింది

ఈ సంస్థల్లో విద్యాభ్యాసం చేసే వారి సంఖ్య పెరిగే కొలదీ, విద్యా బోధన చెయ్యడంలో, వినోదం కల్పించడంలో మఱింత మెఱుగైన రచనలు కావాలనే ఒక పరితల వర్గం క్రమంగా రూపొందింది ఆ కోరిక తమ కుత్సాహ కారణంకాగా కొందఱు రచయితలట్టి రచనలు చేసి వారి కందించారు 1856లో బొంబాయి విశ్వవిద్యాలయం స్థాపింపబడడంతో ఎందఱో పట్టభద్రులు రూపొందారు వివిధ రంగాలలో విభిన్న ఉద్దేశాలతో రచనలు వెలువడడానికిదొక ప్రేరణ అయింది. కొంచెం హెచ్చు తక్కువలుగా చదువుకొన్నవారూ, కొద్దో గొప్పో తీరుబడి ఉన్నవారూ అయిన ఒక పరితల వర్గం ఏర్పడసాగింది వీళ్ళలో ప్రత్యేకోపాధ్యాయ శిక్షితులైన పాలకులైన రాకుమారులూ, సంపన్నులైన భూస్వాములూ, ప్రభుత్వోద్యోగులూ, పాఠశాలలోనో, భర్తలవలననో, ప్రత్యేకోపాధ్యాయుల వల్లనో చదవడం వ్రాయడం నేర్చిన వివాహితలైన యువతులూ ఉన్నారు.

ప్రజలు విద్యార్జన చేయడం ప్రారంభించి యూరపుదేశాలు, ఇతర దేశాలు, ఇండియాలగురించిన రాజకీయ సాంస్కృతిక చరిత్రను తెలుసు కోవడం మొదలు పెట్టేటప్పటికి, హిందూదేశపు రాజకీయ దాస్యానికి కారణా లేమిటో, హైందవసంఘం ఎందుకు వెనకబడిఉందో, ఎందుకు ప్రగతి హీనంగా మిగిలిపోయిందో వాళ్ళకు అర్థంకాసాగింది ఇది మతపరమైన, సాంఘికమైన సంఘసంస్కరణకు ప్రేరకమయింది అదేసమయంలో కొందఱు విద్యావంతులు ప్రాచీన హైందవసంస్కృతీ, సంప్రదాయాలనూ మళ్ళీ ప్రబలంచేయాలన్న ప్రేరణ పొందారు ఆ విధంగా కాలగతిలో రెండు విరుద్ధమైన ఆలోచనా విధానాలేర్పడ్డాయి సర్వత్ర తీవ్రమైన ఒక వివేచనాత్మక ధోరణిప్రబలింది మాఱుతున్న పరిస్థితులను గుర్తింప గలిగిన వాళ్ళూ, తత్కాలావసరాల నెరిగినవాళ్ళూ దిన, వార, మాస పత్రికలను నెలకొల్పారు. విభిన్న ఆలోచనాధోరణులను ప్రతిబింబిస్తూ నవలలు, నాటకాలు, వ్యాసాలు వ్రాయబడ్డాయి ఇంకా చదవగోరే ప్రజల

కోరికలు తీర్చడానికై అనేక సాహిత్య ప్రక్రియలు కల్పింపబడ్డాయి ఈ విషయం 1830 నుండి 1885 వఱకు ప్రకటింపబడిన నవలల్లో ప్రతి బింబిస్తుంది ఈ కాలంలో వెలసిన నవలల గుఱించే ఈ యధ్యాయంలో చెప్పబడుతుంది హరిభావ్ ఆప్టే మొదటి నవలకూడా ఈ కాలంలోనే ప్రకటితమయింది

1857 - 1879ల మధ్య మరారీ భాషలో నవల ఒక ముఖ్యమైన సాహిత్యప్రక్రియగా రూపొంది పాఠకులకెంతో ఆదర్శపాత్రమయింది కాని, యిట్టి ప్రబలమైన నవలలు ఒకవంక కాదంబరి, దశకుమారచరిత్ర వంటి గ్రంధాలచేతా, మఱొకవంక అరేబియన్ నైట్స్ వినోదకధలతో కూడిన అరేభియా, పర్షియా శృంగార గాధలచేత ప్రభావితమైన అతిశయశృంగార గాధలే. 1861 - 1873ల మధ్య ఆంగ్లంలో ప్రకటింపబడిన మీాది గ్రంధాలే యీా నవలారచయితలకు ఆధారాలైనవి ఈ నవలల్లోని నాయికా నాయకులు రాజకుటుంబాలకు చెందినవారుకాగా, వాళ్ళస్నేహితులు, సహచరులూ, ఉన్నతవంశాలకు చెందినవారు కధానాయకుడు తప్పనిసరిగా అపరమన్మధుడు, ధైర్యంరూపెత్తినవాడు నాయిక రతీదేవీ వంటిది ఈ నవలల్లోని ప్రధానపాత్రలు, సన్నివేశాలూ, సందర్భాలూ, ప్రకృతివర్ణనలూ, ఋతువర్ణనలూ, పాత్రలకుకలిగే దుర్దశలూ, విపత్తులూ అన్నీ ఒకలాంటివే వాటినుండి ఆ పాత్రలు తప్పించుకొనే తీరుకూడా అన్నిటా అద్భుతావహాలు, లేదా యుక్తియుక్తాలు భాష అలంకారికం, కృతకం ఈ నవలల ప్రధానోద్దేశం పఠితలకు ఊరించే వినోదాన్ని కల్పించడం [ముఖ్యంగా తీరుబడి గలవాళ్ళూ, చదువుకొన్నస్త్రీలూ ఈ వర్గంవారు ] దానితోపాటు దుర్నీతియుతమైన ప్రవర్తనయొక్క దుష్ఫలితాలనూ, ఆదర్శవంతమైన ప్రవర్తనవల్ల కలిగే సత్ఫలితాలనూ వాళ్ళకు నచ్చేటట్లు చెప్పడం. అందుచేత ఆ నవలలన్నీ దుష్టశిక్షణ, శిష్టరక్షణలతో మోదాంతంగా ముగిసిపోతాయి

వీటన్నిటిధోరణులను పట్టియిచ్చే లక్ష్మణ్ శాస్త్రి హాల్బేకృతమై1861 లో వెలువడిన "ముక్తామాల" అనే ఒక నవలలోని కధను రేఖామాత్రంగా ఇక్కడ పేర్కొంటాను మునుపు వివరించిన కాల్పనిక నవలా లక్షణాలన్నీ కలిగి నవలారంగంలో ఒక మైలురాయిగా ఇది గుర్తింపబడింది. ఈ నవలకు కధానాయిక పేరే పెట్టబడింది ముక్తామాల ఇరావతీ జాగీర్దా రయిన శాంతవర్మ కూతురు భయానకుడనే ప్రభువుకడ ఉపమంత్రిగానున్న ధన శంకరుణ్ణి ఆమె పెండ్లిచేసుకొంటుంది ఈ భయానక ప్రభువు క్రూరుడు, అన్యాయపరుడైన పరిపాలకుడు ఆయన చుట్టూ ఉన్న సహాయకులు, సలహాదారులుకూడా అలాంటివారే వాళ్ళల్లో శాంతవర్మ సోదరుని

కుమారుడైన శక్లాక్షుడనే వాడొకడున్నాడు. అతడు ధనశంకరుడి సిఫారసు వల్లనే భయానకుని సిబ్బందిలో చేర్చుకోబడ్డాడు.

ధనశంకరుణ్ణీ, ముక్తామాలనూ చంపించి శాంతవర్మ సోదరుని కుమారుడుగా తానే శాంతవర్మ జాగీరుకు వారసుడుకావాలని శక్లాక్షుడి ఆశ. నవలలోని సంఘటనలన్నీ శక్లాక్షుడి యీ అత్యాశనుండి ఏర్పడినవే, అతడు ధనశంకరుణ్ణి ఖైదుచేయిస్తాడు. తరువాత అతన్ని ఒక గోనెసంచిలో పెట్టి కుట్టించి నదిలో పారవేయిస్తాడు. అదృష్టవశాత్తు అతడు కొందరుబెస్తల చేత కాపాడబడతాడు. వాళ్ళతన్నిగుర్తించి, అతనికారోగ్యం చేకూరుస్తారు. ఆ తరువాత ధనశంకరుడొక బైరాగివేషంలో తీర్థయాత్రలకు బయలు దేరుతాడు.

ముక్తామాలకీ విషయాలేవీ తెలియవు. ఒక మాంత్రికుడి సహాయంతో కారాగారంలో ఉన్న తనభర్తను కలుసుకొనే ప్రయత్నచేస్తుంది. శక్లాక్షుడు ముక్తామాల తలనునటికి తనకుతెచ్చి చూపవలసిందని ఆ మాంత్రికుణ్ణే రహస్యంగా నియోగిస్తాడు. కాని, మాంత్రికుడు ముక్తామాల అందానికి సమ్మోహితుడవుతాడు. అందువల్ల ఆవిడను చంపకుండా ఒక గుహలో దాచిపెట్టి, ఆమె సేవకురాలిని చంపి, ఆమె చేతులూ, కాళ్ళూ నటికి తెచ్చి శక్లాక్షుడి ముందుంచుతాడు. ఆ అవయవాలు ముక్తామాలవి కావని శక్లాక్షుడు తెలుసుకుంటాడు. మాంత్రికుణ్ణి శిక్షించి, ముక్తామాలను వెదకడానికి బయలుదేఱుతాడు.

ఈ లోపల ముక్తామాల తానున్న గుహలో కనిపించిన ఒక సొరంగ మార్గం ద్వారా తప్పించుకొని వెలుపలికివచ్చి, అక్కడ నుండి తన నమ్మిన బంటైన గులాల్‌సింగ్ అనే అతని సాయంతో ఉజ్జయినికి బయలుదేఱుతుంది. కాని, శక్లాక్షుడు ఆమెను వెంటాడి పట్టుకొని ఉజ్జయినికి దగ్గఱలో ఉన్న ఒక నదిలోని దీవిలో, ఒక పాడుపడిన యింట్లో బంధిస్తాడు. ఏదో నిరాశతో ఇల్లు విడిచి తిరుగుతున్న ముక్తామాల చిన్ననాటి స్నేహితుడైన సోమదత్తుడు యాదృచ్ఛికంగా ముక్తామాలను కలిసి, ఆమెకు బంధవిముక్తి కల్గిస్తాడు. తరువాత అతడు కూడా ఖైదు చేయబడతాడుగాని, కారాగారాధికారికి లంచమిచ్చి తప్పించుకొంటాడు

ధనశంకర ముక్తామాల లిద్దరూ మరణించారన్న ఉద్దేశంతో శాంతవర్మ, తన భార్యతో, పెద్ద పరివారంతో సుదీర్ఘమైన తీర్థయాత్రకు బయలు దేఱుతాడు అంతంలో హఠాత్సం ఘటనల మూలంగా అందఱూ కలుసుకొని సంతోషిస్తారు. వాళ్ళందరూ జయపూరుకు తిరిగి వచ్చేసరికి, ప్రజలందఱూ భయానకుని మీాదా, అతని సలహాదారుల మీాదా తిరుగుబాటు

చేసి, వాళ్ళను శిక్షించి, సుస్వభావుడైన భయానకుని సోదరుడు విశాలాక్షుణ్ణి సింహాసనాధిష్ఠితుణ్ణి చేసినట్లు తెలుస్తుంది. విశ్వాసపాత్రుడైన పాత మంత్రిని అతని మునుపటి పదవిలో నిలుపడం కూడా జరుగుతుంది ధనశంకరుడు కూడా తన పదవి పొందుతాడు. ఆ విధంగా అందరూ ద్విగుణీకృతమైన ఆనందాన్ని పొందుతారు

ఈ కథ ఆ కాలంలో ఎటువంటి కాల్పనిక నవలలు ప్రకటింపబడేవో తెలుపగలదు 1867లో ఎన్. ఎస్ రిస్బుద్ ప్రకటించిన "మంజుఘోష" విశ్వాస యోగ్యం కాని ఆపదలనూ, అదృష్టకరమైన తప్పుకోవడాలనూ కల్పించడంలో 'ముక్తామాలను' మించిపోతుంది. ఇందులోని కథానాయకుడు ఒక విమానాన్నే వాడతాడు. దాన్నతడు ధనమిచ్చి కొన్నాడట! అవసర మైనప్పుడు దాన్ని మడిచి పెట్టెలో పెట్టుకొని ఒక వ్యక్తి మోసుకు పోవచ్చు నట. నలుగురు సౌకర్యంగా కూర్చోగలిగిన ఆ విమానం కథానాయిక భవనంలోని కిటికీలో దూటి పోగలదట! అది హిందూ దేశానికి ఈశాన్యంగా నాలుగు మైళ్ళ దూరం ప్రయాణించినట్లు చెప్పాడు గానీ, అది యే దేశానికి వెళ్ళిందో చెప్పలేదు.

నవలగా 'మంజుఘోష' 'ముక్తామాల' ముందు తీసికట్టు - కానీ, అటువంటి నవలలు ఆ కాలపు పరితలను విపరీతంగా ఆకర్షించేవి. మొత్తం మీద 1861 - 1876 ల మధ్య అటువంటి నవలలు పధ్నాలుగు ప్రకటింపబడ్డాయి.

బాలికలను చదివించడం, బాల వితంతువులను పునర్వివాహం చేసుకోనివ్వడం, బాల వితంతువుల శిరోముండనాన్ని నివారించడం వంటి ఆకాలపు విద్యావంతుల మనస్సుల్లో మెలుదన్నుతున్న కొన్ని క్రొత్త భావాలు ఈ కాల్పనిక నవలల్లో కూడా చోటు చేసుకొన్నాయి. ఉదాహరణకు, 'ముక్తామాల' నవలలో ముక్తామాల భర్త మరణించాడని విశ్వసించడంతో ఆమె తల గొరిగించవలసిన సందర్భం ఏర్పడుతుంది. (ఆమె భర్త సజీవుడని తరువాత తెలిసి రావడం ముక్తామాల శిరోముండన కార్యం జరగక పోవడంతో దీనికి సంబంధం లేదు) ఆ పని చేయాలా, అక్కఱలేదా ? అనే ప్రశ్న ఆ రోజుల్లో ముఖ్యాంశాలకాలవాలమై, తీవ్రమైన వాద ప్రతివాదాలకు ఆకరమయింది. హరిభావ్ యొక్క అతి ముఖ్యమైన గ్రంథం "పణ్ లక్ష్యాన్ కోణ్ ఘేతో" లోని కథలో ఈ సంఘటనే నిర్ణాయక పాత్ర వహిస్తుంది. 1866 నాటి లక్ష్మణ్‌శాస్త్రి హాళ్బే కృతమైన 'రత్నప్రభ' అనే మఱొక నవలలో వితంతు పునర్వివాహ ప్రశ్న

వస్తుంది. 1870 నాటి 'విచిత్రపురిలో' నవలలో బాలికలను చదివించడ మెంత ముఖ్యమో నొక్కి చెప్పబడింది. అది తప్ప ఆ నవలంతా భయంకర మైన మూఢవిశ్వాసాలూ, పూర్ణ దుష్పరిపాలన, నవీన భావాల వంటి అతకని అంశాలతో కూడిన కలగూర గంపగా కనిపిస్తుంది.

ఈ నవలల్లో కొన్ని యింకా ప్రసిద్ధంగానే ఉన్నవి అప్పుడప్పుడు ప్రకటింప బడుతున్నవి కాని అవి అసలైన మరాఠీ నవల కోవలోకి రావు.

మరాఠీ భాషలో వెలువడిన అసలైన మొదటి నవల బాబా పద్మాజీ రచించిన "యమునా పర్యటన్" 1854లో క్రైస్తవ మతాన్ని స్వీకరించిన ఆయన 1857లో దాన్ని ప్రకటించారు "హిందూ వితంతు పరిస్థితి వర్ణన" అనేది ఆ నవల ఉపశీర్షిక. మొత్తంమీద మహారాష్ట్రలోని హిందూ వితంతువుల గురించి, బ్రాహ్మణ వితంతువుల గురించి ప్రత్యేకంగా వర్ణించి, వాళ్ళ అభ్యుదయం కోసం సాగుతున్న కృషికి సాయపడడమే ఆ నవల ప్రయోజనం 1882 నాటి యీ నవల యొక్క రెండవ ముద్రణ పీఠికలో గ్రంథకర్త యీ విషయం తేటతెల్లం చేశాడు

వినాయక్, యమున - అనే విద్యావంతులైన మధ్యతరగతికి చెందిన హైందవ యువదంపతి గాథ అది ఆ భార్యా భర్తలిద్దఱూ దీర్ఘ ప్రయాణం చేస్తూ ఆయా సందర్భాలలో ఎందఱో హిందూ వితంతువులను కలుస్తారు ఆ వితంతువులు దగా పడినవాళ్ళు. బిచ్చగత్తెలుగా మారిన వాళ్ళు. అవినీతికరమైన జీవితంలోకి దింప బడినవాళ్ళు. ఆ వితంతువుల దుస్థితికి వాళ్ళెంతో బాధ పడతారు. వాళ్ళు తిరిగి యింటికి వచ్చేటప్పుడొక ప్రమాదం జరిగి వినాయక్ బాగా గాయపడతాడు పరిస్థితి తీవ్రతరమై మరణిస్తాడు. అతడూ, అతడి భార్య రహస్యంగా క్రైస్తవం స్వీకరించి ఉంటారు తన అంతం చేరువలో ఉందని అనిపించగానే వినాయక్ క్రైస్తవ మతానుసారం తనకు జ్ఞానస్నాన సంస్కారం చేయించుమని యమునను అడుగుతాడు ఆమె అలాగే చేస్తుంది వినాయక్ మరణానంతరం ఆమె కూడా క్రైస్తవ మతాన్ని స్వీకరించి, అతని బోధనననుసరించి మళ్ళీ పెళ్ళి చేసుకొంటుంది.

నవలలో చేర్చబడిన అనేక ఉపాఖ్యానాలలో హిందూ వితంతువుల పరిస్థితి గురించి విశదంగా చేయబడిన వర్ణన మన సానుభూతిని రేపుతుంది ఈ నవల ప్రకటింపబడినప్పుడు అది యీ సమస్యయొక్క తీవ్రతపట్ల పరిత లను శ్రద్ధాళువులను చేసి ఉంటుందని మనం ఊహించవచ్చు. కాని, నవల

లోని ప్రాసంగికాలన్నీ ఒక వరుసలో రావడమే గానీ, అవన్నీ కలిసి ఒక కథలో ఇముడవు. వ్యక్తుల మధ్య వాళ్ళ దృక్పథాలకు సంబంధించిన వైరుధ్యాలూ సంఘర్షణలూ ఉన్నాయి. కానీ అవన్నీ కలిసి నవలకు ఉత్కంఠావహమైన ఒక రూపాన్ని యేర్పఱచవు. అంతేగాక నవలలోని క్రైస్తవ మతానికి సంబంధించిన విషయం అందులోని ప్రధాన పాత్రలైన నాయికా నాయకుల హృదయాలకు చేరువైనా కథలో ఇముడని విషయం గానే అనిపిస్తుంది నవలలోని కథకు ఒక సమగ్ర సుందరమైన నవలగా రూపొందగల శక్తి ఉన్నది కానీ, బాబా పద్మాజీలో ఒక మంచి నవలా కారుని లక్షణాలు లేవు ఫలితంగా, దీన్ని చదివితే ఏదో ఒక చిన్న పుస్తకాన్ని చదివినట్లుంటుంది.

ఏమైనా, తరువాత రానున్న అసలైన నవలకిది పూర్వ రూపమని చెప్పక తప్పదు. ఇందులోని యమున పాత్ర చాలా సున్నితమయిందిగా, చిత్రింపబడింది. ఆమె సూక్ష్మగ్రాహి, వివేకవతి, దయామయి, గొప్ప మతాభిమానం కలిగిన, సాంఘిక బాధ్యతలను గుర్తెఱిగిన యువతి. వినాయక్ ప్రేమశీలియైన భర్త ఔదార్యం, ఆర్ద్రహృదయం, అభ్యుదయ భావాలూ కలవాడు ఈ రెండు పాత్రలు సజీవాలే. కానీ, ప్రాథమికంగా బాబా పద్మాజీ లఘుకథా రచయితే కానీ, నవలా రచయిత కాడు. అందు చేతనే అతని రచన నవలా ప్రారంభదశనే సూచిస్తుంది కానీ తనంత తానే ఒక నవల కాలేకపోయింది

రెండవ యథార్థమైన నవల వినాయక్ కొండేవో ఓకా వ్రాసిన "శిరస్తేదార్" అది చాలామంది ఉపేక్షించిన నవల అది 1881లో ప్రకటింపబడినా 1872లోనే వ్రాయబడింది 'యమునా పర్యటన్' లాగానే, 'శిరస్తేదార్', కూడా ఒక నిర్దిష్టమైన సాంఘిక ప్రయోజనం కోసం వ్రాయ బడిందే. కచ్చేరీలలో ఇంగ్లీషు వాళ్ళ క్రింద ఉద్యోగాలు చేసే కొందఱు శిరస్తేదార్లు, కార్కూన్లు మొదలైనవారి లంచగొండితనాన్నీ, ద్రోహ బుద్ధినీ తేటతెల్లం చెయ్యడమే ఆ ప్రయోజనమని గ్రంథకర్తే చెప్పడం జరిగింది. అంతేగాక, ఆ ఉద్యోగులు తమకున్న కొద్దిపాటి అధికారాన్నీ బీదలను త్రొక్కిపెట్టి నాశనం చేయడానికేవిధంగా దుర్వినియోగ పరుస్తున్నదీ తెలియజెప్పి, అనిర్దయమైన దమన విధానాన్ని పూర్తిగా ఆపలేకపోయినా, వీలైనంతవఱకూ వారించడానికి తగిన పద్ధతులను ప్రభుత్వానికి సూచించ డానికి కూడా యీ నవల ఉద్దేశింపబడింది.

ఒక రివెన్యూ కోర్టుకు చెందిన పాత గుమాస్తా అయిన ఒక శిరస్తే దార్ తన దోషాలనంగీకరిస్తూ విషయాలను వెల్లడిచేసే ధోరణిలో ఈ కథ

చెప్పబడింది. కథకుడు తన జీవితాన్ని నెలకు 10 రూపాయల జీతం గల చిన్న ఉద్యోగంతో ప్రారంభిస్తాడు ఉద్యోగంలో చేరిన తరువాత వక్ర మార్గాల్లో డబ్బెట్లా సంపాదించవచ్చో తెలుసుకొని, కాలక్రమేణ లంచాలు తీసుకోవడం మొదలుపెడతాడు అంతలో, అసూయాపరుడైన తన క్రింది ఒక గుమాస్తా మూలంగా అతని లంచగొండితనం బైటపడి న్యాయస్థానంలో ఆ నేరానికి కఠినకారాగార శిక్షను పొందుతాడు

కారాగారంలో అతడు తాను శిరస్తేదార్‌గా ఉన్నప్పటి పాత జీవితాన్ని గుర్తుకు తెచ్చుకొని, తానుచేసిన దుష్టమైన, అవినీతికరమైన పను లను వెల్లడించి, పశ్చాత్తాపంతో భగవంతుణ్ణి క్షమాపణ కోరుతాడు ఈ దోషాంగీకారమే 'శిరస్తేదార్' నవలలోని కథ.

'యమునా పర్యటన్' కంటె కొన్ని విషయాల్లో ఇది మెఱుగైన రచన. ప్రారంభం నుండి కథాగతి పరాకాష్ఠను పొంది, కథాపురుషుడు కారాగారం పాలయ్యేదాకా కథ కొంచెం కొంచెంగా క్రమోన్మీలితమవుతుంది.

ప్రధానమైన యీ పాత్ర క్రమోన్మీలితమయ్యే కొలదీ బహుముఖ క్లిష్టంగా రూపొందుతుంది ఈ నవలలోని వివిధ వ్యక్తుల మధ్యగల తారతమ్యాలూ, ఘర్షణలూ కూడా మానవ ప్రకృతిని విశదం చేయడానికి ఉపకరిస్తాయి సాహిత్య పరమైన యే అలంకారిక శైలీ విన్యాసమూ లేకుండా, అతిశయోక్తుల పొంత పోకుండా మామూలు ధోరణిలో ఈ కథ చెప్పబడింది. దోషాంగీకార సందర్భంలో మామూలుగా వ్యక్తమయ్యే ఆత్మ విమర్శకు సంబంధించిన ఒక అంతర్గతి యిందులో కనిపిస్తుంది ప్రభుత్వ కార్యాలయాల్లో జరిగే విషయాలన్నీ విశదంగా వర్ణించబడ్డాయి మరాఠీలో వాస్తవమైన నవల అవిర్భావం కోసం జరిగిన ప్రయత్నంలో ఈ నవల ఒక ముందడుగు.

'శిరస్తేదార్' నవలాకారుడు తన నవలకు ఒక స్వీయ చరిత్ర రూపాన్ని కలిగించడం గమనింపదగింది కథా పురుషుని ఆత్మ వ్యక్తీకర ణకు ఈ ధోరణి సరిగ్గా అతుకుతుంది ఈ ధోరణిని అవలంబించడానికి రచయితకు గొప్ప నేర్పు, అంతర్దృష్టి, నిగ్రహం కావాలి 'శిరస్తేదార్' రచయిత స్వభావాన్ని బట్టి సిసలైన నవలాకారుడు కాకపోయినా, యీ ప్రయత్నంలో విజయాన్ని సాధించినందుకతడెంతో ప్రశంసార్హుడు

ఈ యిద్దఱు నవలాకారుల్లో ఒక్కరైనా తాము తర్వాత రాబోయే అసలైన నవలకు మార్గాన్ని యేర్పరుస్తున్నామని తలపోయనేలేదు.

మరాఠీ నవలా చరిత్రకారులు "యమునా పర్యటన్"ను నవలగా గుర్తించడమే కాకుండా మరాఠీ భాషలో అదే అసలైన మొదటి నవల అని కూడా అభివర్ణించారు "శిరస్తేదార్" నవలను గురించి వాళ్ళు పెద్దగా పట్టించుకోలేదు. నిజానికి, అంతంలో జ్ఞానోపదేశంతో నింపినప్పటికీ, 'యమునా పర్యటన్' కంటే "శిరస్తేదార్" కొన్ని విషయాల్లో మంచి రచనా శిల్పం కలిగిన నవల. 1857 – 1881ల మధ్య చిత్రవిచిత్రమైన నవల లెన్నో ప్రకటింపబడ్డవి. అందులో కొన్ని ప్రఖ్యాతమైనవి కూడా. 'శిరస్తే దార్' నవలకు తగిన గుర్తింపు రాకపోవడానికి కారణం అదే కావచ్చు. అంటే 'శిరస్తేదార్' నవల అది వ్రాయబడిన వెంటనే ప్రకటింపబడి ఉంటే, దానికి రాదగిన ఖ్యాతి వచ్చే ఉండేది.

ఇప్పుడు 1879 లో ప్రకటితమైన నారాయణ్‌రావ్ – గోదావరి అనే నవలను గురించి చెప్పబడుతుంది ఈ నవల రచయిత తానేం వ్రాస్తున్నాడో, ఎందుకు వ్రాస్తున్నాడో బాగా తెలిసి వ్రాసిన వ్యక్తి

ఈ నవల అంతవరకూ ప్రకటింపబడుతున్న అద్భుత కల్పితగాధల మీద ఒక ఆక్షేపణగానూ, ఒక మంచి సాహిత్య ప్రక్రియగా నవలను రూపొందించాలనే తపనతోనూ వ్రాయబడింది ఈ నవల మహారాష్ట్రలోని, మధ్యతరగతి ప్రజలకూ, పేద జనానికీ సంబంధించిందే కాని, ధనవంతులూ రాజకుటుంబీకుల వర్గాల వారికి సంబంధించింది కాదు. పైపెచ్చు తప్పని సరిగా మోదాంతంగా ముగింపబడే కాల్పనిక నవల లక్షణం ఇందులో కన బడదు పీఠికాభాగంలోనే రచయిత నవలారచనలోని తన అభి ప్రాయాన్ని. రచనా ప్రణాళికనూ ప్రస్ఫుటం చేస్తాడు. "నవలల ద్వారా దైనందిన సంఘటనల స్వరూపాన్ని చిత్రించాలంటే, మనమా సంఘటనల్ని యథాతథంగా ప్రదర్శించాలి". అంటాడాయన సజ్జనులే విధంగా ఆపదల నెదుర్కోవలసి వస్తుందో, అంతంలో అసత్యారోపణల వల్ల వాళ్ళే విధంగా నాశనమౌతారో చూపవలసి ఉంటుంది. ఈ దృక్పథంతోనే నేను నవల వ్రాశాను – ఇంకొక విశేషమేమంటే, మన నాటకాలూ, నవలలూ సాధారణంగా మోదాంతాలు అందుకు విరుద్ధంగా నేనీ నవలను విషాదాంతం చేశాను – నాకు తెలిసినంతవరకు మరాఠీలో ఇలాంటి నవలల్లో ఇదే మొదటిది."

ఈ నవలలోని కథా స్థలం బొంబాయి దగ్గరి వాసై. కథ నారాయణ రావు, గోదావరి అనే దంపతులకు సంబంధించింది వాళ్ళిద్దరూ పరస్ప రాంగీకారంతో సంతోష పూర్వకంగా పెండ్లి చేసుకొనవారే కానీ ఇద్దరు

దుర్జనుల కుతంత్రాలు కారణంగా ఆ పెండ్లి విషాదాంతంగా పరిణమిస్తుంది. వాళ్ళు వివాహితులైన కొద్ది కాలానికే ఆ విషాదగాథ ప్రారంభమవుతుంది.

ఒక దుర్మార్గుల గుంపు గోదావరి విషయంలో కొన్ని కుట్రలు పన్నుతుంది నారాయణరావు వాళ్ళదారి కడ్డుపడకుండా దూర ప్రాంతానికి మార్చబడతాడు. అక్కడుండగా అతని భార్య అతనిపట్ల ద్రోహిగా మాటినట్లు నమ్మేట్టు చేస్తారు అందులోని సత్యం స్వయంగా చూచి తెలుసుకొని గాని ఒక నిర్ణయానికి రాగూడదను కొంటాడతడు అందువల్ల అతణ్ణి మళ్ళీ వాసైకి తీసుకొస్తారు. తన భార్య దుశ్శీలం విషయంలో అతడి కెట్టి సందేహమూ కలుగనట్లుగా పరిస్థితులు రూపొందింప బడతాయి. ఆమెకు తెలియకుండా ఆహారంలో విషంపెట్టి చంపేస్తాడు. త్వరలోనే తానొక పరమ దుర్మార్గమైన పన్నుగడకు ఎరైనట్లు తెలుసుకొంటాడు. కడకు, ఆ దుర్మార్గులందరినీ చంపి తన జీవితాన్ని కూడా అంతం చేసుకొంటాడు

ఇందలి కథా ప్రణాళిక చాలా చిక్కుగా ఉంటుంది. కథలోని కొన్ని అతుకులు బలహీనమైనవి. దానిమీద ఆంగ్లనాటకమైన "ఒథెల్లో" ప్రభావం స్పష్టంగా కనబడుతుంది ఏమైనా, నవలా రచనలో ఇది రచయిత ప్రథమ ప్రయత్నమనే దృష్టితో చూస్తే, రచయిత నవలలో తానేం సాధించ దలచుకొన్నాడో దాన్ని సాధించాడని మాత్రం చెప్పక తప్పదు నవలలో మధ్య తరగతి వ్యక్తుల యథార్థ విషాదగాథ వ్రాయాలనుకొన్నాడు వ్రాశాడు. ఆవిధంగా అది సిసలైన మరాఠీ నవలా చరిత్రలో ఒక మైలురాయి అయింది.

ఈ కథయొక్క లక్షణాలు కొన్ని తరువాతి నవలల్లో స్పష్టాస్పష్టంగా పునరావృత్తాలై కనిపిస్తాయి హరిభావ్ నవలలు కూడా అందుకపవాదాలు కావు. విశేషించి ఆయన నాటకాలు కొన్నింటిలో కూడా యీ లక్షణాలు కనిపిస్తాయి ఒక బీద వ్యక్తికి అప్పుడప్పుడే వయస్సుకు రాబోతున్న, వెంటనే పెండ్లి చేయవలసిన అందమైన ఒక కూతురుంటుంది పేదతనం చేత (లేదా అత్యాశ చేతనో) తనకు మంచి మొత్తం చెల్లించగల వ్యక్తికోసం అతడు వెదుకుతుంటాడు. ఆ రోజుల్లో ఆడపిల్లలకు ఆరు, ఏడు సంవత్సరాల పసిప్రాయంలోనూ, మగవారికి పధ్నాలుగు, పదిహేను సంవత్సరాల ప్రాయంలోనూ పెండ్లిండ్లు చేసెయ్యడంవల్ల, అటువంటి యెదిగిన అమ్మాయికి ధనవంతుడైయుండి భార్యను కోల్పోయిన ఒక యువకుడో, ముదుసలో, ఒక జాగీర్దారో, లేదా, ధనవంతుడైయుండి మరణించిన ఒక లోభియొక్క కొడుకో తప్ప, తగిన వరులుండరు సాధారణంగా అలాంటి లోభి కొడుక్కి త్రాగుడు,

వ్యభిచారం అలవాటు చేసే ఒక స్నేహితుడుంటాడు వాడు ఆస్తిపరుడైన తన స్నేహితుణ్ణి ఒక అందమైన అమ్మాయిని పెండ్లి చేసుకొమ్మని ప్రేరేపిస్తాడు తరువాత అమ్మాయిని సొంతం చేసుకోవచ్చునని అతని విశ్వాసం. తార్పుడు కత్తెలుగా, లంచగొండులైన ప్రభుత్వాధికారిణులుగా, ప్రవర్తించే స్త్రీలెందరో సంఘంలో ఉన్నారు. సవతి కూతుళ్ళను బాధపెట్టి వాళ్ళు ఉరిపోసుకునేటట్లో, ముందువెనుకలు చూడకుండా తననిష్టపడినవాణ్ణి పెండ్లి చేసుకునేటట్లో లేదా, లేచిపోయి పెండ్లి చేసుకునేటట్లో చేయగలిగిన సవతి తల్లులున్నారు.

ఈ యధ్యాయం ముగించేముందు నవలారచన, అంటే చారిత్రక నవలా రచనలో మరొక ధోరణిని గురించి కొంత ఆలోచించడం మంచిది ఇంత వరకూ పేర్కొన్న నవలలు తరువాత హరిభావ్ వ్రాసిన సిసలైన నవలలకు మార్గదర్శకాలైనట్లు ఆయన వ్రాసిన చారిత్రక నవలలకు మార్గదర్శకమైన ఒక చారిత్రక నవల కూడా ఉన్నది అది ఆర్ బి గుంజికర్ వ్రాసిన "మోచాంగడ్". అది 1867 కూ 1870 కీ మధ్య అనుక్రమ కథగానూ, 1871 లో పుస్తకరూపంలోనూ ప్రకటింపబడింది

మోచాంగడ్, చారిత్రక నవలకొక ప్రమాణంగా భావింపబడింది. భారతీయ భాషల్లో చారిత్రక నవలలు అనేక కారణాలచేత రచింపబడ్డాయి. గత చరిత్రను కాల్పనిక ధోరణిలో ప్రదర్శించి వినోదం కల్పించడం అందులో ఒకటి. రాజకీయ కారణాలను పురస్కరించుకొని రచించడం మరొకటి రాజకీయంగా పరాధీనమైన దేశంలో పరితల దేశభక్తికీ, జాతీయతకూ సంబంధించిన భావాల నుద్బోధించి వాళ్ళు పరాధిక్యాన్ని ప్రతిఘటించేటట్లు చేయడానికి ఆధారంగా చరిత్ర ఉపయోగింప బడుతుంది గ్రాంట్‌డఫ్ వ్రాసిన "హిస్టరీ ఆఫ్ ది మరాఠాస్" అనే గ్రంథం ప్రకటింపబడడంతో మరాఠీ చరిత్ర మీద శ్రద్ధ పుట్టింది టాడ్ వ్రాసిన "అనల్స్ ఆఫ్ రాజస్థాన్" అనే గ్రంథం రాజపుట్‌ల చరిత్ర మీద అభిమానాన్ని కలిగించింది. మరాఠీ, రాజపుత్ర చరిత్రలలోని కొందరు వీరులు, కొన్ని సంఘటనలు ఇటువంటి పునరుపయోగానికి సరిగ్గా అతికిపోవడం జరిగింది గతాన్ని పునర్నిర్మించి, లభిస్తున్న చారిత్రక వస్తుసహాయంతో ఆ కాలపు వాతావరణాన్నీ, చైతన్యాన్నీ ప్రత్యక్షీకరించడం చారిత్రక నవలలు వ్రాయడంలోని మూడో ప్రయోజనం. మోచాంగడ్ యీ కోవకు చెందిన నవల. ఈ నవల శివాజీ కాలానికి సంబంధించింది శివాజీ, ఆయన సహచరులు కొందరూ ఇందులో స్మరింపబడ్డారు. శివాజీ వ్యక్తిత్వానికీ కార్యాలకూ సంబంధించిన ప్రజల

మనోభావాలు కూడా ఇందులో వర్ణింప బడ్డాయి కానీ, నవల శివాజీని గురించి వ్రాయబడింది కాదు. ఆ కాలపు వాతావరణాన్నీ, చైతన్యాన్నీ ప్రత్యక్షీకరించడంలో మాత్రం గ్రంధకర్త కృతకృత్యుడయ్యాడు

ఈ ధోరణి త్వరలోనే ప్రసిద్ధమై ఒకదాని తరువాత ఒకటిగా చారిత్రక నవలలు వెలువడసాగాయి హరిభావ్ సాహిత్య సృష్టిలో ఇంచు మించు సగభాగం చారిత్రక నవలలే మరాఠా చరిత్రను గురించి ఆ తరువాత అనుక్రమంగా నవలలు వ్రాయబడ్డాయంటే, ఈనాటికీ ఆవిధంగా వ్రాయబడుతున్నాయంటే అందుకాయన చారిత్రక నవలకు కలిగించిన ప్రఖ్యాతే కారణం

హరిభావ్ రచనా వ్యాసంగం ప్రారంభించిన నాటి మహారాష్ట్రలోని సాహితీ వాతావరణం ఇదే నవలా రచనలోని కాల్పనిక, యధార్ధ చారిత్రకాలనే ప్రధానమైన మూడు ధోరణుల్లో, హరిభావ్ చివరి రెంటి అభివృద్ధికీ తోడ్పడడమే కాకుండా వాటిని పరకోటి ముట్టిన ప్రక్రియలుగా రూపొందించాడు.

# 3. హరిభావ్ ఆప్టే నవలలు : సాంఘికం

హరిభావ్ తన మొదటి నవలను 1883 లో వ్రాయడం ప్రారంభించాడు. కడపటి దాన్ని 1917లో ముగించాడు ఈ ముప్ఫయి నాలుగు సంవత్సరాల్లో ఆయన ఇరవైరెండు నవలలు వ్రాశాడు. వీటిలో పదకొండు సాంఘిక నవలలు, పదకొండు చారిత్రక నవలలు సాంఘికాల్లో పది నవలలు మహారాష్ట్రలోని, ముఖ్యంగా పూనాలోని సమకాలీన సంఘజీవితానికి సంబంధించినవి ఒకటి ఫ్రెంచి నవల మాతృకగా గల ఆంగ్ల రచనకు భాషాంతరీకరణం చారిత్రక నవలలు పదకొండింటిలో కూడా ఒకటి కొలోనల్ మెడోస్ టేలర్ నవలకు భాషాంతరీకరణం. నాలుగు సాంఘిక నవలలూ, నాలుగు చారిత్రక నవలలూ అసంపూర్ణాలు

ఈ యధ్యాయం హరిభావ్ యొక్క సాంఘిక నవలలను గురించి నది ఈ నవలలన్నీ మహారాష్ట్రలోని విద్యావంతులు, కొంచెం చదువు కొన్నవాళ్ళు, విద్యావిహీనులూ అయిన మధ్యతరగతి ప్రజల జీవితాలు వస్తువుగా నడిచేవి. ఈ నవలల్లో విద్య ఉండడం, లేక అది కొఱవడడం - అనేవి తప్పనిసరిగా చెప్పబడ్డవి. ఆ రోజుల్లో ఏ కొందరో మాత్రమే విద్యావంతులు కావడం వల్ల, ఆంగ్ల విద్యకు అనుకూలురు, అననుకూలురు కూడా

ఆ విద్యాఫలితాల నెంతో శ్రద్ధతో గమనించేవారు అందువల్ల రచయిత ఏదైనా ఒక పాత్రను చిత్రించడంలో ఆ పాత్రవిద్యా విషయం ముఖ్యంగా స్మరణీయమయ్యేది భారతదేశంలోని కొన్ని ఇతర ప్రాంతాలలో వలె మహారాష్ట్రలో పెద్ద పెద్ద భూస్వాములుండే వాళ్ళుకారు ఈ నవలల్లో నిరూపింపబడిన సంఘ జీవితంలో ఋణదాతలు, న్యాయవాదులు, ప్రభుత్వాధి కారులు, ఛిదపడిపోయిన జాగీర్దారులు — వీళ్ళే మనకు ప్రధానంగా కనిపించేవాళ్ళు. పాలకులైన రాజకుమారులూ, ఆంగ్లేయాధికారులూ అప్పు డప్పుడూ కనిపిస్తారు కానీ, కథలో ప్రధాన పాత్ర వహించరు పారోపి త్యాన్నవలంబించే బీదబాపలూ, బంధువుల మీద ఆధారపడిన నిరుపేదలైన వితంతువులూ, చిల్లర పనులు చేసుకొంటూ బ్రతుకులీడ్చే వ్యక్తులూ సంఘం అట్టడుగున కనిపిస్తారు కొందఱు పోకిరీలు, మోసగాళ్ళూ కూడా కనిపిస్తారు హరిభావ్ తొలితటి నవలలు ఎక్కువగా నాటి హిందూ స్త్రీల పరిస్థితిని నిరూపించేవే. వాళ్ళకు బాలా బాల్యావస్థలోనే, కొన్నిసమ యాల్లో ఆఱు ఏడేండ్ల ప్రాయంలోనే పన్నెండు, పదమూడు సంవత్సరాల అబ్బాయిలతో వివాహాలు జరిగేవి (హరిభావ్ వివాహమే అతని పదిహేనవయేట జరిగింది ) వాళ్ళల్లో కొందఱు ఇరవై సంవత్సరాలు కూడా అందుకోని యెలప్రాయంలో వితంతువులయ్యే వాళ్ళు వాళ్ళు ఏ నాగ రకమైన కుటుంబంలోని వాళ్ళో కాకపోతే, వాళ్ళ జీవితం దురంతమైన దారిద్ర్యం, దుర్భరమైన కాయకష్టం, బానిసత్వాలకు గుఱయ్యేది మఱి కొందఱు, త్రాగుబోతులూ, వ్యభిచారులూ అయిన భర్తలచేత అవమానింపబడి, దెబ్బలుతిని తరిమికొట్టబడేవాళ్ళు. బాలికలను చదివించడం, మగవాళ్ళలో నాగరికతను పెంపొందించడమే యిందుకు నివారకంగా సూచించబడింది. స్త్రీల పరిస్థితులను మెఱుగుపఱచే విషయంలో గోవిందరావ్, ఆయన భార్య కాశీభాయ్ కనిత్కర్‌ల ఉదాత్తమైన స్నేహంచేతా, మిల్, స్పెన్సర్ రచనలను చదవడం చేతా ఎంతో ప్రభావితుడయ్యాడు హరిభావ్

హరిభావ్ ఆంగ్లంలోనూ, ఐరోపియ సాహిత్యంలోనూ మంచి పరి జ్ఞానం కలవాడని యిదివఱకే చెప్పబడింది ఆయన షేక్స్పియర్ రచన లను పునః పునః చదవడమే గాకుండా, మోలియర్, జోలా, థాకరే, డికెన్స్, స్కాట్, జేన్ ఆస్టిన్, జార్ ఇలియట్‌ల రచనలను బాగా అధ్యయనం చేశాడు కానీ ఆయన తన మొదటి నవలను జి డబ్ల్యు ఎమ్ రేనాల్డ్స్ చేత ప్రభావితుడై వ్రాయడం వింత ఆయన తన రచనా వ్యాసంగం ప్రారంభించిన నాటి సారస్వత స్థితిగతులే అందుకు దోహదం చేసి ఉండవచ్చు. విశ్వవిద్యాలయాల్లో చదివి, వ్యవధీ ఆసక్తీ ఉన్నవాళ్ళు సాధారణంగా

ఇంగ్లీషు నవలలు చదివేవాళ్ళు కేవలం వినోదం కోసం చదివే కొంచె పాటి విద్య కలిగినవాళ్ళూ, చదువుకొన్న స్త్రీలూ, తీరుబడి ఉన్నవాళ్ళూ. సమకాలిక సంఘ జీవితానికి సంబంధించని ప్రసిద్ధమైన కాల్పనిక మరాఠీ నవలలను చదివేవాళ్ళు పాఠకులకు ఉపదేశించి జ్ఞానాన్ని కలిగించడానికి ప్రయత్నించిన యధార్ధ నవలలైన యమునాపర్యటన్, శిరస్తేదార్‌లు తగిన వినోదాన్ని కలిగించలేని బలహీన రచనలయ్యాయి. హరిభావ్‌కు కొత్తరక మైన నవలనీ, కొత్తరకమైన పాఠకవర్గాన్నీ రూపొందించవలసివచ్చింది. అతడు ఉదాత్తమైన సంఘచైతన్యభావన కలిగిన కధా రచయిత ఆ కాలపు ప్రసిద్ధ నవలల కలవాటుపడిన పాఠకులను వాటినుండి మఱలించ డమేగాక, నవలకు అంతకంటె విద్యావంతులైన పాఠకులను సంపాదించడం కూడా అతని పనయింది ఇదంత సులభమయిన పనికాదు ఆనాటి అద్భుతావహమైన కాల్పనిక నవలలు పాఠకులకు గొప్ప ఉత్కంఠనూ, వినోదాన్నీ కలిగించేవి అందువల్లనే కాబోలు కొన్ని హరిభావ్ నవలల్లో సాధారణమైన యథార్ధ సాంఘిక నవలల్లో ఇముడని మార్మికతకూ, సాహస ప్రియత్వానికీ సంబందించిన ఒక తత్వం కనిపిస్తుంది. ధాకరే, డికెన్స్ తమ రచనల్ని ప్రకటించేనాటికి ఆంగ్ల నవలకు నూఱు సంవత్సరాలకు పైబడిన వయస్సు. హరిభావ్ రచనా ప్రారంభకాలానికి మరాఠీ నవల వయస్సు పాతిక సంవత్సరాలు మాత్రమే అందుచేత అతడు మధ్యతరగతి ప్రజల అతుకుల బతుకులను వర్ణిస్తూ, వాళ్ళ వర్తనాన్ని నిరూపించి, వాళ్ళకు వినోదాత్మకమైన పరిజ్ఞానాన్ని కల్గించడం బహుశః తన ప్రథమ ధర్మంగా భావించి ఉండవచ్చు అటువంటి వినోదాన్ని రేనాల్డ్స్ పుష్క లంగా కలిగించాడు గాబట్టే హరిభావ్ అతనితో తన రచనను ప్రారంభించాడు. ఆ కాలపు మహారాష్ట్రలోని ఆంగ్ల విద్యావంతులకు రేనాల్డ్స్ చాలా ఇష్టుడన్న సంగతిని కూడా మనం ఇక్కడ స్మరించవలసి ఉంది రేనాల్డ్స్‌ను ఆశ్రయించిన వ్యక్తి హరిభావ్ ఒక్కడేకాడు. అతడెంతో గౌరవించిన విష్ణుశాస్త్రి చిప్లంకర్ కూడా రేనాల్డ్స్ రచనల్ని ఎంతో ఆసక్తితో చదివేవాడు.

అందుచేత 1883లో అతడు తన "మధ్లిస్థితి" అనే మొదటి నవలను రచించాలని నిర్ణయించుకొన్నప్పుడు రేనాల్డ్స్ వ్రాసిన "The Mysteries of old London" ను అనుసరించాలన్నదే ఆయన ఆలోచన కాని, అందులోని మొదటి అధ్యాయం వ్రాసీ వ్రాయగానే ఏదైనా నవలను అనుసరించడం కంటే స్వతంత్ర నవల వ్రాయడమే మంచిదని అతనికి తోచింది ఒక నవలను అనుసరించడంలో, మూలమైన పరదేశీయ నవలలోని పాత్రల భావాలూ, ఆలోచనలూ, వాటి వర్తనం, ఆచారాలతో సహా భారతీయ పాత్రల భావాలూ,

ఆలోచనలూ, ఆచారవ్యవహారాలతో కలిసిపోయే అవకాశం ఉంది. ఇందు వల్ల నవల ఒక కలగలుపు రచన అయిపోతుంది. అందుచేత రేనాల్డ్స్‌ను అనుసరించాలనే అభిప్రాయం మాని ఆయన స్వతంత్రంగానే వ్రాయసాగాడు. కాని ఆయన నవల పీఠికలో చెప్పినట్లు మూల నవలను గురించి అప్పటికే ఆయన ప్రగాఢంగా భావించడంవల్ల "మధ్యస్థితి" నవలలోని మొదటి మూడు నాలుగు అధ్యాయాల మీద దాని ప్రభావచ్ఛాయలను మనం చూడవచ్చును. ఆ తరువాత "అజ్కాల్క్యా గోష్ఠి" (సమకాలిక జీవిత కథలు) అనే శీర్షిక క్రింద వరుసగా ప్రకటించబడనున్న అనేక నవలల్లో అది మొదటిదిగా ఉద్దేశించబడింది ఈ కథల్లో మహారాష్ట్రలోని సమకాలిక సంఘ జీవితాన్ని చిత్రించడమే అతని ఉద్దేశం నవలలోని వ్యక్తులూ, సంఘటనలూ యథార్థమైన సంఘ జీవితంమీద ఆధారపడినా, సంఘంలోని ఏ వ్యక్తినీ, సంఘటననూ ప్రత్యేకించి చిత్రించి చూపడానికవి ఉద్దేశించబడలేదు

ఈ నవల "పుణె వైభవ్"లో వరుసగా ప్రకటితమయింది ఆ నవల కొన్ని భాగాలు ప్రకటించబడేటప్పటికే, దాన్ని గురించిన విశేషమైన పొగడ్తలతో సంపాదకుని కార్యాలయానికి ఉత్తరాలు వచ్చి పడసాగాయి. ఉత్తరాలు వ్రాసిన వాళ్ళలో గొప్ప విద్యావంతులూ, ప్రసిద్ధులైన విమర్శకులూ ఉన్నారు ఆ నవల 1888లో పుస్తకరూపంలో ప్రకటించబడింది.

ఆ కాలంలో వ్రాయబడుతున్న నవలలకంటే అది యెంతో భిన్నంగా ఉండి ఒక కొత్తరకం నవలగా భావించబడింది అందులోని భాష సాఫీగా, సరళంగా సాగిన వ్యావహారికం పాఠకులు రోజూ మాట్లాడే భాష అది. అందులో సాహిత్యపు సొగసులుగానీ, ఆలంకారికశైలీశోభలుగానీ లేవు. ప్రదేశాలూ, వ్యక్తులూ పాఠకులకు కన్నులకు కట్టేటట్లు సూక్ష్మాతి సూక్ష్మమై వివరాలు కూడా అందులో ఎంతో శ్రద్ధతో, అవధానంతో వర్ణింపబడ్డాయి. అప్పటికి స్థిరపడిన ప్రమాణాల ననుసరించి వర్ణింపబడిన కథానాయకుడుగానీ, నాయికగానీ అందులో లేరు పాఠకుని జీవితానికి, వర్తనానికి ఆధారభూతమైన యీ ప్రపంచమే నవలలోని ప్రపంచం. ఈ నవలతో హరిభావ్, నవలకూ పాఠకుడికీ మధ్య ఒక సన్నిహితమైన సంబంధాన్ని నెలకొల్పాడు.

"మధ్యస్థితి" అనే శీర్షికను గురించి వివరించే ప్రయత్నాలు జరిగాయి. అవయవార్థాన్ని బట్టి మధ్యస్థితి అంటే, మధ్యస్థితి, లేదా "మధ్య అంతస్తు" అని గ్రంథకర్తే యిలా వివరిస్తున్నాడు "అజ్కాల్క్యా గోష్ఠి" అంటే సమకాలిక జీవితాన్ని వర్ణించే కథలు. ప్రస్తుతకథ మధ్యతరగతి వ్యక్తుల్ని

గుఱించింది అందువల్ల అది ''మధ్యస్థితి'' అని వ్యవహరింపబడింది. ''అజ్కాల్చ్యా గోష్టి'' లోని తరువాతి కథ గణ్‌పత్‌రావ్ అందులో విద్యార్జన వల్ల సంఘంలో ఉన్నతస్థితిని సాధించి, నిరంతరం మన సంఘాభివృద్ధిని గుఱించి ఆలోచించే వ్యక్తుల్ని గుఱించి వర్ణించబోతున్నాను. 'గణ్‌పత్‌రావ్' నవలలో గణపతిరావ్ యమునలు సద్విద్య ఫలితంగా ఉన్నత స్థితిని పొందినట్లూ, వాళ్ళ ఆలోచనలు కూడా ఉన్నతాలైనట్లూ చూపించాను

''ఆ తరువాత క్రింది తరగతికి సంబంధించిన వ్యక్తుల జీవితాలను వర్ణించే మూడో కథ వ్రాయాలనుకొంటున్నాను అందులో మధ్య తరగతికి సంబంధించిన గణయ నాన్యలు దుర్విద్య ఫలితంగా ఏవిధంగా క్రింది తరగతికి జాఱిపోయారో తెలపాలనుకొంటున్నాను క్రింది తరగతి అంటే, ఆ తరగతికి చెందిన వ్యక్తులు అని అర్థం మొత్తంమీద, ఇదీ నా ప్రణాళిక ''

హరిభావ్ గణయ నాన్యలను గుఱించిన నవల వ్రాయలేదు

ఇతరులు ఈ శీర్షికను మహారాష్ట్రంలోని ప్రజా సంఘం మీద ప్రసరించిన పాశ్చాత్య విద్యా ప్రభావం దృష్ట్యా వివరింప జూశారు మహారాష్ట్రంలో ఇంకా పాశ్చాత్య విద్య ప్రవేశపెట్టబడని స్థితి మొదటి దశ రెండవది, లేదా మధ్యదశ మహారాష్ట్ర ప్రజలు పాశ్చాత్య విద్యార్జన, ఫలితంగా వివేచన కోల్పోయిన స్థితి

ఈ రెండురకాల వివరణాలూ సత్య సమ్మతాలే మధ్యస్థితి ఆ కాలపు పూనాలోని మధ్య తరగతికి చెందిన ఒక వర్గం యొక్క జీవితాన్నీ, కార్యకలాపాలనూ చిత్రిస్తుంది. కద అంత విశాలమైనది కాదుగానీ అందులో అరడజను కుటుంబాలూ, ఏబదికి మించిన పాత్రలూ ఉన్నాయి. ఈ నవల ముగ్గురు వ్యక్తుల దుశ్చర్యలను గురించి వర్ణిస్తుంది వాళ్ళలో ప్రధాన దుర్మార్గుడు గోవిందరావ్ కడమ ఇద్దఱూ అతనికి సహాయకురాండ్రయిన కకుబాయ్, తామాబాయ్ - అనే యిద్దఱు స్త్రీలు. కొలది కాలం ముందే తన తండ్రిని కోల్పోయిన వినాయకరావనే ఒక ధనికుడైన ఋణదాత యొక్క ఏకైక పుత్రుడు గోవిందరావు చర్యలకు గురవుతాడు. తన తల్లితో, యౌవనవతీ, ఆదర్శవంతురాలూ అయిన సరస్వతి అనే తన భార్యతో కూడినదే వినాయకరావు కుటుంబం. వినాయకరావు ఎవరి మీదా ఆధారపడ నవసరంలేని స్వతంత్రుడని తెలియగానే గోవిందరావు అతని చుట్టూ వల పన్నుతాడు మధ్య తరగతి వాళ్ళైన విద్యావంతుల

విభాగానికి ప్రాతినిధ్యం వహించే కొందఱు వ్యక్తులు సభ్యులుగా ఉన్న ఒక "క్లబ్బు" తో అతనికి పరిచయం కలిగిస్తాడు సాయంకాలాల్లో అందఱూ కలిసి త్రాగడం, వాగడం ఆ క్లబ్బులో జరిగే ప్రధానమైన కార్యకలాపం. అప్పుడప్పుడూ పాటలు పాడడానికై వేశ్యలు ఆహ్వానింపబడే వాళ్ళు. వినాయకరావు తన యింటిని బాగుపఱచి, అన్నీ కొత్తగా అమర్చుకొంటాడు. అతని యింటిలో కూడా అప్పుడప్పుడు గానం, తాగుడు సమావేశాలు జరిగేవి.

కాలక్రమేణ వినాయకరావు తన తల్లిని వెళ్లగొట్టి, తన భార్యను బాధించడం ప్రారంభించి ఆమెను నిర్దయగా బావగొడతాడు. గోవింద రావు ఒకవైపు వినాయకరావు భార్య యొక్క సత్ప్రవర్తన విషయంగా అతని మనస్సులో సందేహ బీజాలు నాటి, మఱొకవైపు సరస్వతి కడ ఆమె భర్త తాగుబోతుతనాన్నీ, వ్యభిచారాన్నీ గుఱించి విమర్శించి ఆమె మనస్సు తనవైపు తిప్పుకోవాలని చూస్తాడు. ఆమె అతని తంత్రాలకు ఎర కాదు. ప్రార్థనలకూ లొంగదు. ఇక లాభంలేదని ఆమె భర్తనే ఎగదోలి ఇంకా ఆమెను హింసించేటట్లు చేస్తాడు. కడకు వినాయకరా వామెను దొంగగా సందేహించి ఇల్లు వెడలగొట్టేటట్లు చేస్తాడు

అప్పటికి గోవిందరావు వినాయకరావును పూర్తిగా దోచుకొంటాడు. మఱిదోచుకోవడానికేమీ ఉండదు. అందువల్ల కకుబాయ్, తమాబాయ్ లతో కలిసి, వాళ్ళు అపహరించి తెచ్చిన యిద్దఱమ్మాయిలతో సహా పాఱి పోవాలనుకొంటాడు కాని, ఆ ముగ్గుఱూ ఒక రైల్లో పూనా వదలి వెళ్ళే ముందు, గోవిందరావు గత చరిత్ర తెలిసి, అతన్ని గమనిస్తున్న ఒక వ్యక్తి పోలీసులతో సహా రైల్వే స్టేషనుకు వచ్చి వాళ్ళందర్నీ బంధింపజేస్తాడు. తరువాత ఒక మేజస్ట్రేటు వాళ్ళ నేరాలను విచారించి శిక్ష విధిస్తాడు. తన దగ్గర గోవిందరావు దోచుకొన్న ధనమంతా వినాయకరావు తిరిగి పొందు తాడు. తన భార్య అమాయకత్వం మీద అతనికి నమ్మకం కుదురుతుంది. అందుచేత ఆమెనూ, ఆమెతోపాటు తన తల్లినీ యింటికి తెచ్చుకొంటాడు

ఇంచు మించు ఐదువందల పుటల్లో చెప్పబడిన కథకిది తప్పని సరిగా కొంత అసంతృప్తికరమైన రేఖా మాత్రమైన కథనం. కథలో గోవిందరావు దుశ్చర్యలవల్ల బాధింపబడిన మఱి మూడు నాలుగు కుటుంబా లున్నాయి కానీ అంతా శుభాంతమవుతుంది.

మధ్యస్థితిలో కొన్ని దోషాలు స్పష్టంగా కనిపిస్తాయి. హరిభావ్ ఇంకా తన దారివెతుక్కొంటున్నాడు వర్ణనలూ విభజనలూ అనవసరంగా

పొడిగింపబడ్డవి కథలోని సంఘటనలు మధ్యలో వచ్చే అనేక అధ్యాయాల వల్ల విడిపోయి, వాటి సంబంధాన్ని గుఱించి పాఠకునికి గుర్తుచేయవలసివస్తుంది పాత్రలను, పాఠకులను ఉద్దేశించిన సంభాషణ ల్లో తటాలున వచ్చే మార్పులూ, ఎవరినీ ఉద్దేశించకుండా ఆశ్చర్యార్థకంగా ముగింపబడిన సంబోధనలూ ఎన్నో ఉన్నాయి నవల మధ్య తరగతి సంఘానికి సంబంధించిన గర్హణీయులూ, నీతిదూరులూ అయిన వ్యక్తుల జీవితాలనూ, కార్యకలాపాలనూ మాత్రమే వర్ణించి, మంచివారూ, నాగరకులైన వ్యక్తులను పూర్తిగా ఉజ్జగించడం లోపంగా ఎవరైనా భావించవచ్చు కాని, గ్రంధకర్త ఉద్దేశం అదే ఒక అపవాదం మాత్రమే ఉంది అది నరోపంత్, రాధాబాయ్, వాళ్ళమ్మాయి యమున, నరోపంత్ ఆదరించి చదివిస్తున్న విష్ణు అనే వ్యక్తులుగల కుటుంబానికి సంబంధించింది. హరిభావ్ తరువాతి నవల గణపతిరావ్‌లో ఈ కుటుంబం లోని విష్ణు యమునలు పెరిగి పెద్దయిన వ్యక్తులుగా కనిపిస్తారు గాబట్టి యీ కుటుంబం ప్రత్యేకించి యెన్నదగింది

ఇటువంటి లోపాలున్నప్పటికీ, ఈనాటికీ యీ నవలను చదవితే ఆసక్తికరంగా ఉంటుంది నవలపరిధి తక్కువైనా, సంఘంలోని ఒక భాగాన్ని మాత్రమే చిత్రించినా, ఆ కాలపు సంఘంలోని ఒక వర్గానికి సంబంధించిన స్పష్టమైన స్వరూపాన్ని అది ప్రదర్శిస్తుంది వ్యక్తుల యొక్క, ప్రదేశాల యొక్క వర్ణన నిర్దుష్టంగా, బలంగా ఉన్నది. భాష సరళం, ఋజుతమం, ఇక సంభాషణలు మునుపటి నవలల్లోవలె కాకుండా వ్యావహారిక ధోరణిలో స్వాభావికంగా, సమర్థంగా తీర్చి దిద్దబడ్డవి

మధ్లిసితి పుస్తక రూపంలో వెలువడకముందే, రెండవదై, అసంపూర్ణంగా మిగిలిపోయిన తన గణపతిరావ్ నవలను హరిభావ్ 1886లో ప్రకటించ నారంభించాడు, ఈ నవలలోని మనుష్యులు, మధ్లిస్థితిలోని వ్యక్తుల కంటే పూర్తిగా భిన్నమైన వర్గానికి చెందిన వాళ్ళు కథాప్రణాళిక ఉన్నత స్థాయికి చెందింది ఈ నవల గణపతిరావ్ పేరిట వ్యవహరించబడింది. గణపతిరావ్ ఒక ప్రభుత్వాధికారి కొడుకు పూనాలోని దక్కను కళాశాలలో బి.ఏ పరీక్ష కోసం చదువుతున్న విద్యార్థి అతని వయస్సు ఇరవయ్యేండ్లుండవచ్చు, వివాహితుడు. అతని స్నేహితుడు నానా అతని సహపాఠి సమవయస్కుడు కాని, అవివాహితుడు. నానా నాలుగేండ్ల ప్రాయంలోనే తండ్రిని పోగొట్టుకొన్నాడు తానూ తన తల్లీ పినతండ్రి పోషణలో ఉన్నారు. నానా సోదరి గోదావరి పెండ్లి ఒక పూజారి కొడుకుతో జరిగింది. గోదావరి పట్ల ఆమె భర్త, అత్త, చాలా క్రూరంగా ప్రవర్తించేవాళ్ళు

మనం "మధ్లిస్థితి" నవలలో చూచిన నరోపంత్, రాధాబాయ్ పాత్రలు ఈ నవలలో కూడా కనిపిస్తాయి వాళ్ళ కూతురైన యమునకు ఇప్పటికి 'విష్ణు'తో పెండ్లి జరుగుతుంది. ఆమెకు లక్ష్మి అనే మారుపేరు పెట్టబడుతుంది విష్ణు కూడా గణపతిరావ్. నానాలతో పాటు వాళ్ళకంటే ఒక తరగతి తక్కువగా కళాశాలలో చదువుతుంటాడు.

సంఘ సంస్కార విషయంలో గణపతిరావ్ ఓర్పులేని సున్నితమైన మనస్తత్వం కలవాడు. అతడు ఆంగ్ల సంస్కృత సాహిత్యాలలో మంచి పాండిత్యం ఉన్నవాడు. సంఘ సంస్కార విషయంలో మిల్, స్పెన్సర్ ఆయనకు ఆదర్శ పురుషులు. గణపతిరావ్, నానాలు ఒక మంచి సంస్కార వంతమైన కుటుంబంతో పరిచయం కలిగించుకొని తఱచుగా అక్కడికి వెళ్ళి వస్తుండేవారు. కృష్ణారావ్, ఆయన భార్య రమాబాయ్, వాళ్ళమ్మాయి ద్వారక ఆ కుటుంబ సభ్యులు భవిష్యత్తులో నానా, ద్వారక పెండ్లి చేసుకొంటారనే విషయం కథలో భావన కందుతుంది.

ఏమైనా, ఈ నవలలో పెద్దగా ఏమీ జరుగదు. నానా పినతండ్రి ధనాశతో నానాకు ఒక చదువులేని వికారమైన అమ్మాయితో పెండ్లి యేర్పాటు చేస్తాడు. నానా సమ్మతించడు ఆ కోపంతో పినతండ్రి నానా తల్లిని తఱిమి కొడతాడు దానితో నానాకు, అతని తల్లికి ఉన్న ఆశ్రయం పోతుంది. గోదావరి బాధలు మితిమీఱేటప్పటికి గణపతిరావూ, నానా ఆమెను తీసుకొచ్చేయాలని నిర్ణయించుకొంటారు. ఈ ఘట్టం దగ్గఱ నవల హఠాత్తుగా ఆగిపోతుంది అది 1893 లో జరిగింది అంత వరకూ అది వరుసగా ప్రకటింపబడుతున్న మాస పత్రిక ఆగిపోవడమే అది ఆగిపోవడానికి కారణం దాని తరువాత హరిభావ్ చాలా నవలలు వ్రాసినప్పటికీ దీన్ని మాత్రం పూర్తి చేయకుండానే వదిలిపెట్టాడు అది పూర్తి చేయబడి ఉంటే యేవిధంగా ముగింపబడి ఉండేదన్న విషయం మనం ఊహించుకోవలసిందే.

ఆ రోజుల్లోని హిందూ స్త్రీల పరిస్థితీ, దాన్ని మెఱుగుపరిచే తీరూ, ఇప్పుడున్న రూపంలో ఆ నవలలోని ప్రధానమైన యితివృత్తం. ఈ సమస్యకు సంబంధించిన చర్చలతో సంభాషణలతో ఈ నవల నిండి ఉంది. స్త్రీలను చదివించడం, వాళ్ళ వివాహ వయస్సును పెంచడం, వితంతు పునర్వివాహ నిషేధాన్ని తొలగించడం ఈ సమస్యా పరిష్కారానికి సూచింపబడిన మార్గాలు. గణపతిరావ్ తన ఉత్సాహంతో స్త్రీలు ఉన్నత

విద్య నేర్చి, సాహిత్యం చదివి ఆస్వాదించగలిగి, మగవారితో సమానంగా చర్చల్లో పాల్గొన గలిగిన ఒక సంఘాన్ని గుఱించి కలలు కంటాడు. ముఖ్యమైన సాంఘిక సమస్యలను గురించిన చర్చలతో నిండిన హరిభావ్ యొక్క మొదటి నవల యిదే. అతని తరువాతి నవలలో ఈ కల కొంత వరకు ఫలించడం మనం చూడవచ్చు

నవలా రచనకు సంబంధించినంతవఱకు హరిభావ్ ఇప్పటికి మఱికొంత పరిణతి పొందిన కళాకారుడయ్యాడు. 'మధ్లిస్థితి' లో అతడు తన మార్గాన్ని వెదుక్కోవడానికి ప్రయత్నిస్తున్నాడు. గణపతిరావు నవలలో అయన ఆ మార్గం కనుగొన్నాడు. అందులోని పాత్రలు బహుముఖాలై కొంత పరిపూర్ణతను పొందాయి. అతడు నానా పినతల్లిని గుఱించి చేసిన వర్ణనను గుఱించి ప్రత్యేకించి చెప్పవలసి ఉంది. ఆమె దౌర్జన్యంగా ప్రవర్తించే మూర్ఖమైన మనిషి. ఆ ధోరణితో ఆమె తన భర్తమీదకూడా అధికారం చెలాయించేది. కానీ, ఆమెది మనోహరమైన రూపం. ఆమె రంగు, నిర్దుష్టమైన ముఖలక్షణాలు, ముఖ్యంగా ఆమె కన్నులు, ఆమె మాటాడే ధోరణి అవతలివాళ్ళను తప్పకుండా ప్రభావితుల్ని చేస్తాయి ఈ విషయాలన్నింటినీ హరిభావ్ సమగ్రంగా వర్ణించాడు. ఆ నవలనతడు పూర్తి చేయకపోవడం శోచనీయం

గణపతిరావ్ నవల వ్రాసే కాలంలోనే ఆయన 1890 లో నెల కొల్పిన తన "కరమానుక్" అనే వారపత్రిక కోసం "పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో" ("అయితే ఎవరికి లెక్క") అనే నవలను వ్రాయడం ప్రారంభించాడు అది గణపతిరావ్ తర్వాతిదీ, మూడవదీ అయిన ఆయన నవల.

హరిభావ్ వ్రాసిన సాంఘిక నవలల్లో "పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో" అనేక విషయాలలో ఆయన సాంఘిక దృక్పథాన్ని గొప్పగా ప్రతిబింబించే నవల పాఠకుని మనస్సుమీద అది గాఢమైన ముద్రవేస్తుంది. మధ్య తరగతికి చెందిన పెద్దవైన సమష్టి కుటుంబాల జీవిత విధానాన్ని కూడా అది స్పష్టంగా చిత్రిస్తుంది ఆ కుటుంబాల్లోని ఆచారపరాయణుల, సంస్కరణ వాదుల దృక్పథాల సంఘర్షణనూ యువతరానికీ, పెద్ద తరంవారికీ మధ్య జరిగే సంఘర్షణనూ, ఆ కుటుంబాల్లోని స్త్రీల స్థితినీ కూడా ఈ నవల చిత్రిస్తుంది. వీటితో పాటు మఱికొన్ని కారణాలచేత ఈ నవల కొంత వివరంగా పరిశీలింప దగినదవుతున్నది.

ఈ నవల స్వీయచరిత్ర ధోరణిలో వ్రాయబడింది. కొంచెం చదువుకొన్న ఒక యువతి జీవిత చరిత్రలాగా ఉంటుందది ఈ పద్ధతి సాహిత్యంలో కొత్తకాదు. కాని, హరిభావ్ వాస్తవ ప్రపంచపు సరి హద్దులూ, భావనా ప్రపంచపు పొలిమేరలూ కలిసిపోయేంత చమత్కార ధోరణిలో మనకా కథను తెలుపుతాడు.

ఈ నవల సంగతి తెలిసిన తన స్నేహితుని మూలంగా దాని వ్రాత ప్రతిని గుఱించి తాను తెలుసుకొన్నట్లుగా హరిభావ్ మనకు చెపుతాడు. ఆ స్నేహితుడు హరిభావ్‌ను గణపతిరావుకు పరిచయం చేస్తాడు. గణపతి రావు మరణించిన యువతికి సోదరుడు. ఆ సోదరుడు ఆ నవల వ్రాత ప్రతిని హరిభావ్‌కు అప్పజెపుతాడు. హరిభావ్‌కు అది యెంతో నచ్చడం వల్ల తన కరమానుక్‌లో ప్రకటించాలనుకొంటాడు. కానీ, ఆ నవల్లోని కథ అసంపూర్ణంగా ఉంటుంది. హరిభావ్ దాన్ని పూర్తి చేయాలనుకొంటాడు. అందుచేత గణపతిరావును తుది అధ్యాయం వ్రాయమంటాడు. అతడు వ్రాస్తాడు. ఆ వ్రాతప్రతిలో లేనివిషయాలు కలిగిన కొన్ని కాగితాలు కూడా గణపతిరావు హరిభావ్ కిస్తాడు.

గణపతిరావు తెలిపిన విషయాలతో కూడి ఆ వ్రాతప్రతే "పణ్ లక్ష్యాన్ కోణ్ ఘేతో" నవల అని హరిభావ్ చెపుతాడు. అది ప్రధాన మైన రెండు కుటుంబాలకూ, అనుషంగికంగా వచ్చే మఱికొన్ని కుటుంబా లకూ సంబంధించిన కథ. అది 'యము' చేత చెప్పబడుతుంది. ఆమెకు ఎనిమిది తొమ్మిది సంవత్సరాల వయస్సున్నప్పటి నుండీ ఆ కథ చెప్పబడు తుంది పూనాలో నివసించే ఆమె కుటుంబంలో ఆమె తల్లిదండ్రులూ, పన్నెండేండ్ల అన్నదాదా, ఒక చెల్లెలు సుందరీ ఉన్నారు. ఆమె తండ్రికి తల్లిదండ్రులు కూడా జీవించే ఉన్నారు. కాని వాళ్ళు కొంతదూరంలో ఉన్న ఒక గ్రామంలో ఉన్నారు. అక్కడ వాళ్ళకొక యిల్లూ పొలమూ ఉన్నాయి. అది కలిగిన కుటుంబము. 'యము' తండ్రి కలెక్టరాఫీసులో హెడ్ గుమాస్తా. అతని కతని తండ్రితో అంత మంచి సంబంధాలు లేవు. అతని కుటుంబంలోనే అతని పిల్లలే తండ్రంటే భయపడుతూ వీలయినంత వఱకూ అతనికి దూరంగా ఉండడానికే ప్రయత్నిస్తారు తల్లి తెలివితేటలు, జాగరూకత, నేర్పరితనం కలది. పిల్లలకామె అంటే చాలా గౌరవం, ప్రేమ. వాళ్ళ గుణశీలాలను తీర్చిదిద్దింది ఆమె

కథ ప్రారంభమైనపుడు ఒక బొమ్మల పెండ్లి జరుగుతూ ఉంటుంది. యము, ఆమె సోదరుడు దాదా, అమె ప్రక్కింటి స్నేహితురాలు ఛాకి

కలిసి, అటువంటి సందర్భాల్లో పిల్లలకు సహజమైన ధోరణిలో గొడవ చేస్తూ, తమలో తాము కలహించుకొంటూ ఆడంబరంగా బొమ్మలపెండ్లి చెయ్యడంలో మునిగిపోయి ఉంటారు ఆ సమయంలో వాళ్ళనుకొనని విధంగా అప్పుడే ఆఫీసు నుండి వచ్చిన 'యము' తండ్రి కోపంతో వాళ్ళను కేక వేస్తాడు. బొమ్మలపెండ్లి కంతరాయం కలిగి పిల్లలు భయపడిన పక్షుల్లా వెల్లాచెదురై పాటిపోతారు. పిల్లలకు, ఇందులో కొత్తయేమీ లేకపోవచ్చు. ఎందుకంటే, ప్రతి కుటుంబంలోనూ అలాంటివి జరుగుతాయి. 'యము' కూడా ఈ సంఘటనను మామూలుగానే వర్ణించి చెపుతుంది. కాని, పారకుని దృష్ట్యా దీనికొక సాంకేతికమైన అర్థం ఉంది మనుష్యులు ఉత్సాహపూరితులై హాయిగా జీవితం గడిపేటప్పుడు విధివాళ్ళనే విధంగా దెబ్బ తీస్తుందో ఈ సంఘటన తెలుపుతుంది.

కొన్ని నెలల తరువాత 'యము' కు రఘునాథ్‌తో పెండ్లవుతుంది. రఘునాథ్ దాదా చదివే బడిలోనే అతని కంటే మూడు తరగతులెక్కువ చదువుతూ 'మెట్రిక్యులేషన్' పరీక్ష వ్రాయడానికి సిద్ధంగా ఉన్నాడు. అతడు చిన్నప్పుడే తన తండ్రిని పోగొట్టుకొని, తల్లితో సహా మేనమామ పోషణలో ఉన్నాడు. అతడు మంచి తెలివితేటలూ దయాగుణం, సహృదయత, ఋజుత్వం దృఢమైన బుద్ధీ ఉన్నవాడు.

ఆమె భర్త కుటుంబంలో ఆమె అత్తగారూ, మామ వరుస వారిద్దరూ వారి భార్యలూ, మామ తల్లి అయిన ఒక ముసలావిడా - అంతా ఇంచుమించు ఒక డజను మంది ఉన్నారు.

మామ వరుసైన వాళ్ళలో పెద్దతడైన శంకర్ మామాజీయే యీ నవలలోని అసలైన విలన్. నవల అంతంలో జరిగే ఘోరానికి కారకుడతడే అతడు వ్యభిచారి, తాగుబోతు. కాని చాలా పవిత్రుడైనట్లు నటించేవాడు. తన భార్యకు ద్రోహం చెయ్యడమే కాక ఆమెపట్ల చాలా క్రూరంగా కూడా ప్రవర్తించేవాడు తనపిల్లల యెదురుగా ఆమెను దూషించేవాడు వాళ్ళను కూడా అలాగే చెయ్యమని ప్రోత్సహించేవాడు.

ఆ కుటుంబంలో 'యము' అత్తగారు తప్ప, తక్కిన అందరూ ఆమెను నిరాదరించే వారు. సహజంగానే విధేయత కలిగిన ఆమె ఆ కుటుంబం మీద ఆధారపడింది కావడం చేత 'యము' అనుభవించే బాధను నిస్సహాయంగా, మూగగా చూస్తూ ఊరుకొనేది. ఆ బాధలో "యము" కు సహాయమై మన శ్శాంతి కలిగింపగలిగిన వాడు ఆమె భర్త ఒక్కడే. కానీ అతడు కుటు

వాడు కావడం చేత, భార్య వయసుకు వచ్చేదాకా భార్యభర్తలు ఏకాంతంలో కలుసుకోవడం, కనీసం మాట్లాడుకోవడం కూడా ఆ రోజుల్లో నిషిద్ధం కావడం చేత, అతడేమీ చెయ్యలేక పోయాడు. కాబట్టి 'యము' ఆ బాధంతా ఓపికతో భరించవలసి వచ్చింది.

తండ్రి యింట్లో, యము తల్లి నాలుగో ప్రసవం తరువాత క్రమంగా ఆరోగ్యం కోలుపోయి, 'యము' పెండ్లయిన ఒక నెలలోపలే మరణించింది యము తండ్రి త్వరలోనే మరో పెండ్లి చేసుకొన్నాడు ఆ రెండో భార్య తన సవతికొడుకు కంటే — అంటే 'యము' అన్న కంటే చిన్నది. కానీ చాలా క్రూరంగా ప్రవర్తించ సాగింది. ఆమె పొంచి పొంచి చూచే రకం. అంటే యము పుట్టింటికి వెళ్ళి కొన్నాళ్ళున్నప్పుడల్లా, యము, దాదాల ప్రతి కదలిక మీదా ఆమె నిఘావేసి ఉంచేది అందుచేత యము, దాదాలకు ఇచ్చ వచ్చినంత సేపు అంతరంగికంగా మాటాడుకోవడం కష్టమయ్యేది.

త్వరలోనే దాదాకు పెండ్లయింది ఆ అమ్మాయి తనకు నమ్మదగిన స్నేహితురాలు కాగలదని 'యము' భావించింది. కాని, ఆ విశ్వాసం నేల కేసి తొక్కినట్లు వమ్మయి పోయింది ఆ అమ్మాయి అవివేకి, చదువు లేనిది, నేర్చుకోవాలన్న అసక్తి లేనిది, అసూయాపరురాలు. మూర్ఖమైన పట్టుదల గలది. ఎప్పుడూ బాధ పడుతూ సణుగుకొంటూ ఉండేది. ఆమెతో స్నేహం చెయ్యడానికి యమున చేసిన ప్రయత్నాలన్నింటినీ ఆమె వమ్ము చేసింది. ఇది ఆమెను హతాశురాలిని చెయ్యడమే కాకుండా, తన సోదరునికి జీవితం దుర్భరంగా రూపొందడం కూడా ఆమె కనిపెట్టింది. అందువల్ల ఆమె బాధ ఇనుమడించింది.

కాలం గడవగా రఘునాద్ తన మొదటి డిగ్రీ పరీక్షలో ఉత్తీర్ణుడై, భార్యతో, తల్లితో కలిసి న్యాయశాస్త్రం చదవడానికై బొంబాయికి వెళ్ళాడు. అతని స్నేహితులైన విష్ణుపంత్, నానా సాహెబు అతని కంటె ముందే బొంబాయి చేరి ఒక బంగళాలో నివసిస్తున్నారు అందులోనే రఘునాధ్‌కూ అతని కుటుంబానికి వసతి యేర్పాటు చేశారు. యమున వచ్చీ రాగానే విష్ణుపంత్, నానా సాహెబుల భార్యలామెతో స్నేహంచేసి కొత్త లేకుండా చేశారు తక్కిన యిద్దరు స్త్రీలలాగా మగవాళ్ళతో కలిసి కూర్చోడానికి 'యము' మొదట్లో కొంత బిడియపడి అనిష్టాన్ని ప్రకటించేది. కాని, భర్త ప్రేమ పూర్వకమైన ప్రోత్సాహం చేత, ఆ యిద్దరు స్త్రీల బుజ్జగింపుల చేత ఆమె త్వరలోనే జంకు వదలి ఇష్టపూర్వకంగా వాళ్ళలో ఒకతెగా కలిసి పోయింది

యమున జీవితంలో ఆమె బొంబాయిలో గడపిన సంవత్సరాలే అత్యంత సమ్మోద దాయకాలు. కానీ, అంత మంచి జీవితం ఎక్కువ. కాలం ఉండదు. ఒకసారి వాళ్ళిద్దఱూ కలిసి విహారార్థం ఎలిఫెంటాగుహ లకు వెళ్ళాలని నిర్ణయించుకునేటప్పటికి రఘునాథ్‌కు హఠాత్తుగా జబ్బు చేసి ఇరవై నాలుగు గంటలలోపలే మరణించాడు. యమునకిది పిడుగుపాటై. సుఖజీవితానికి సంబంధించిన ఆమె కలలన్నీ ముక్కలైపోయాయి. ఈ ఘట్టంలో, నవల ప్రారంభంలో యమున తండ్రి సంతోషంగా జరుగుతున్న బొమ్మల పెండ్లిని చెడగొట్టిన విషయం పాఠకుడికి గుర్తు కొస్తుంది. కాని. అంతకంటె ఘోరమైనది జరుగుతుంది. ఒంటరిగా వదలి పెట్టబడి ఉంటే భర్త హఠాన్మరణం వల్ల కలిగిన దుఃఖాన్ని ఆమె తట్టుకోగలిగి ఉండేది. సోదరుని సహాయంతోనూ, భర్త స్నేహితుల ప్రోత్సాహంతోనూ, పూర్తిగా సంతోషప్రదమైన జీవితం కాకపోయినా, ప్రయోజనకరమైన జీవితాన్ని ఆమె గడపి ఉండేది.

కాని, ఆమె తిరిగి పూనాకు వెళ్ళవలసి వచ్చింది అక్కడ మోసం వల్ల బలవంతపు శిరోముండనానికి ఆమె గుఱయింది. అది ఆమెయొక్క. మృతుడైన ఆమె భర్తయొక్క, సోదరునియొక్క సిద్ధాంతానికి వ్యతిరేకం. దీనివల్ల ఆమెకు కలిగిన అఘాతం చాలా తీవ్రమయింది. ఆమె ఆరోగ్యం చెడసాగింది. అందుచేత ఆ బాధనుండి తప్పించుకునే సాధనంగా ఆమె తన జీవితాన్ని గుఱించిన రచన చేసేటట్లు పట్టుకొలుపబడింది. కాని. త్వరలోనే ఆరోగ్యం క్షీణించి, ఆమె మరణించింది

'యమున' కథతో సమాంతరంగా ఆమె స్నేహితురాలైన దుర్గి కథ నడుస్తుంది. దుర్గి భర్త ఒక దుర్మార్గుడు. బడి మానేసి, పొగతాగడం. దొంగిలించడం, జూదమాడడం ప్రారంభించాడు. తన కామాన్ని తీర్చుకో వడానికి మాత్రమే భార్యను వాడుకొనేవాడు. కోరినప్పుడామె తన తండ్రి దగ్గఱనుండి డబ్బు తేకపోతే ఆమెను కొట్టేవాడు. దుర్గి అతనికొక బిడ్డను కన్నది. కానీ, జీవితంతో విసుగుపుట్టి, నల్లమందు తీసుకొని తనబిడ్డ. తానూ చావాలనుకొన్నది "పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో"? కాపట్యం. కాఠిన్యం, మతావేశాలనే బలిపీఠం మీద త్యాగంచెయ్యబడిన విశ్వాసమూ. ముందుచూపూ కల ఒక యువజీవి యొక్క విషాదగాథ అనిపిస్తుంది. కానీ, విశాలదృష్టితో చూస్తే ఇది ఆ కాలపు స్త్రీలందఱకూ-సంబంధించిన కథ. ఒకచోట యమునే చెప్పినట్లు స్త్రీలు మచ్చిక చేయబడిన జంతువులలాగా చూడబడేవాళ్ళు. మగవాళ్ళు తమబుద్ధికి తోచినట్లు ఆడవాళ్ళను ముద్దు

చేయడమో, శిక్షించడమో, వాళ్ళకు తిండిపెట్టడమో, కడుపుమాడ్చడమో, వాళ్ళనుకొట్టడమో, కష్టపెట్టడమో చేసేవాళ్ళ వాళ్ళ ఉపయోగించుకో దగిన వస్తువులే కాని సమానంగా చూడదగిన వ్యక్తులుకారు. వాళ్ళభావా లను గురించి, కోరికలను గురించీ ఎవ్వరూ పట్టించుకోలేదు. "అయితే ఎవరికిలెక్క" అనే శీర్షికకు అర్థం అదే.

అదే సమయంలో స్త్రీలెంత కపటంగా, క్రూరంగా, స్తబ్ధంగా ఉండ గలరో కూడా యీ నవల చెపుతుంది. ఇతర స్త్రీల జీవితాలను వాళ్ళెట్లా నాశనం చేయగలరో, మగవాళ్ళకు కూడా అది దుస్సహమయ్యేటట్లు చెయ్య గలరో యీనవల తెలుపుతుంది. భర్తయింట్లోని అత్త వరుసవారు, వదినె, యమున సవితితల్లి, సోదరుని భార్య ఇందుకుదాహరణలు. ఈ భిన్న స్త్రీల పాత్రలను ఖచ్చితంగా, కమనీయంగా తీర్చిదిద్దగలిగిన హరిభావ్ పరిశీలనాశక్తి ఆశ్చర్యం కలిగిస్తుంది గమనింపదగిన మరొక అంశమే మంటే, ఆడవాళ్ళ భాషను వాడడంలో ఆయన ప్రదర్శించిన నేర్పు ఈ నవలలో ఎన్నోరకాల స్త్రీల పాత్రలున్నాయి ఒక్కొక్క పాత్రకూ సరిగ్గా ఆ పాత్రకు అతికే భాషవాడాడు హరిభావ్ - ఈ నవల అమాయకురాలూ, సున్నితమైన మనస్తత్వంకలదీ, సహజప్రేమమూర్తి అయిన ఒక యువతి చేత రచింపబడినట్లు భావింపబడింది ఆమె వాడే భాష ఆమె చిత్తవృత్తినీ, వ్యక్తిత్వాన్నీ పూర్తిగా పట్టియిస్తుంది.

ఈ నవలలో హరిభావ్ నవలా రచయితగా పరిపూర్ణసిద్ధిని పొందాడు. నవలలో మొత్తంమీద మూడు డజన్ల పాత్రలున్నాయి. ప్రతిపాత్రకూ ఒక ప్రత్యేకతఉంది అన్నీ సజీవంగా సాక్షాత్కరిస్తాయి. నవల కథ అంత పెద్దదేమీ కాదు కాని అందులోని విషయాలు చాలా గొప్పవి, వాటికి హరిభావ్ పూర్తిన్యాయం చేకూర్చాడు.

అతని తరువాతి నవల "యశ్వంతరావ్ ఖరే" (1892 - 95) గణపతిరావ్ వలె మరొక అసంపూర్ణనవల. కొన్ని విషయాల్లో మాత్రం అది చాలావరకు సంపూర్ణమని చెప్పవచ్చు ఇందులోని కథావస్తువు, ఆలోచనా ధోరణి గణపతిరావు నవలలోని వానికి పూర్తిగా విరుద్ధాలు. గణపతిరావు పెండ్లయి బి. ఏ. పరీక్షకు చదువుతున్న ఎదిగిన యువకుడు. అతనికి నిర్దిష్టమైన అభిప్రాయాలూ, నిశ్చితబుద్ధీ ఉన్నాయి. చదువు పూర్త యిన తరువాత తానేం చేయదలచుకొన్నదీ ఆయనకు తెలుసు. అదీగాక గణపతిరావు సంపన్నుడైన ఒక ప్రభుత్వోద్యోగి కొడుకు. యశ్వంతరావు పరిస్థితి వేరు అతడొక బీదకుటుంబం నుండి వచ్చినవాడు. నవల

ప్రారంభమయేటప్పటికి అతడు పన్నెండేండ్లవాడు తండ్రిని కోల్పోయాడు. అతని తల్లి తన కుటుంబాన్ని కాపాడుకోవడం కోసం తప్పని సరిగా తక్కువ జీతానికి ఒరుల ఇండ్లలో పనులు చేయవలసి వచ్చింది. యశ్వంత రావు తల్లితో పాటు, ఒక తమ్ముడు, ఒక చెల్లెలు అతని కుటుంబసభ్యులు.

గణపతిరావులో ప్రధానంగా బాలికలను చదివించడం, వాళ్ళ వివాహవయస్సును పొడిగించడం, వితంతువివాహాన్ని ప్రోత్సహించడంతో కూడిన సంఘ సంస్కారానికే ప్రాధాన్యం యశ్వంతరావ్‌ఖరే నవలలో అలా కాక సంఘసంస్కారానికి వ్యతిరేకమైన రాజకీయ సంస్కారానికి ప్రాధాన్యం నిజానికీ నవలలో సంఘసంస్కారం పరిహసింపబడింది. సంఘసంస్కారా భిలాషులు సంఘవిరోధులుగా వర్ణింపబడ్డారు.

పాఠశాలలో చదువుతున్న చిన్న వయసువాడైన యశ్వంతరావు తన చదువు కొనసాగించడం కోసం ధనికులైన పోషకుల ప్రాపు సంపాదించ వలసి వచ్చింది మొదట అతడు ఆంగ్లప్రభుత్వమంటే ఆదరం కలవాడై, తనను తానొక సంఘసంస్కర్తగా చాటుకొనే ఒక రావ్ బహదూర్ పోషణలో ఉండేవాడు. కాని ఆ రావ్ బహదూర్, అతని కుటుంబంలోని ఆడవాళ్ళూ, అతని కొడుకులూ వాళ్ళ అంతస్తుకూ, పరువు ప్రతిష్ఠలకూ గర్వించి కారిన్యంతో, దురభిమానంతో యశ్వంతరావును నిరాదరంగా చూసి అవమానించే వాళ్ళు సున్నితమైన మనస్తత్వం గల ఆ బాలుని హృదయం గాయపడుతుంది సంఘసంస్కార మంటే అయిష్టం ప్రబలి కడకు స్త్రీద్వేషి అవుతాడు తన తల్లి తనను ప్రేమించడంలేదని కూడా భావించడం మొదలు పెట్టి క్రమంగా ఆమెకూ, కుటుంబానికీ దూరమై తాను ఒంటరి అయిపోయినట్లు బాధపడతాడు

తన జీవితంలోని యీ విషమ పరిస్థితిలో అతడు బాగా చదువు కొన్న, పట్టుదల గల జాతీయతావాది అయిన శ్రీధర్ పంత్ అనే అతనిని కలుసుకోవడం తటస్థిస్తుంది యశ్వంతరావు త్వరలోనే తన యెడల యెంతో సానుభూతి గల ఆయన సంరక్షణలోకి వస్తాడు అప్పటి నుండి యశ్వంతరావు కాలేజి జీవితం ముగేసేదాకా అతనికి ఉపదేశకుడూ, మార్గదర్శకుడూ శ్రీధర్‌పంతే అతడే యశ్వంతరావు గుణశీలాలకు, వ్యక్తి త్వానికీ, అభిప్రాయాలకూ, ఒకరూపాన్ని ప్రసాదిస్తాడు యశ్వంతరావు శ్రీధర్‌పంత్ శిక్షణ ఫలితంగారూపొందిన వ్యక్తి. తన ఉపదేశకుని లాగానే యశ్వంతరావు తాను కూడా రాజకీయ సంస్కార వాదీ, సంఘ సంస్కారవిరోధీ అవుతాడు.

గణపతిరావ్ నవలలో గణపతిరావు మిల్ వ్రాసిన 'స్త్రీ దాస్యం' ప్రమాణంగా గ్రహిస్తే, 'యశ్వంతరావ్ ఖరే'లో యశ్వంతరావ్ 'మజ్జిని' అనే ఇటాలియన్ మహాకవిని ప్రమాణంగా గ్రహిస్తాడు.

నవల యిక్కడకు ఆగిపోతుంది. పన్నెండు నుండి ఇరవై సంవత్సరాల వయస్సు దాకా యశ్వంతరావు వ్యక్తిత్వం రూపొందిన ఎనిమిది సంవత్సరాల అతని జీవితం ఇందులో చిత్రింపబడింది. పాత్రనూ, వ్యక్తిత్వాన్నీ క్రమోన్మీలితం చెయ్యడంలో మునుపటి మూడు నవలల్లో కంటే యశ్వంతరావ్ ఖరేలో గొప్ప అభివృద్ధి కనిపిస్తుంది మొదటి నవల అయిన మధ్లిస్థితిలో పాత్రలంత పరిణత స్థితిలో కనిపించవు అవి ప్రాణరహితాలు కాకపోయినా స్థాణువుల్లా ఉంటాయి. గణపతిరావ్‌లో మధ్లిస్థితిలో కంటె పాత్రల రూపురేఖలు స్పష్టంగా కన్పిస్తాయి. కాశీనాథ్‌పంత్ భార్య సీతాబాయ్ పాత్ర చిత్రణం చాలా హృద్యంగా ఉంటుంది. "పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో" యీవిషయంలో ఒకడుగు ముందుకు వేసింది. అందులో ఒక మొగ్గ పువ్వుగా వికసించినట్లు 'యము' చిన్నఅమ్మాయిగా ఉండి క్రమంగా ఒక యువతిగా రూపొందడం మనం చూడగలం హరిభావ్ వాచ్యంగా ఏమీ చెప్పకుండా ఆ అభివృద్ధినంతా చూపుతాడు. కాని 'యశ్వంతరావ్ ఖరే' లో ఐదువందల పుటల నవలంతా ఒకేఒక వ్యక్తి యొక్క క్రమపరిణతి, వ్యక్తిత్వవికాసాలను వర్ణించడానికే వినియోగించబడుతుంది. ఒక పురుషుని వ్యక్తిత్వాభివృద్ధి ఒకవైపుసహజమైన అతని ఇష్టాలూ, శక్తి సంపన్నతల పరస్పరప్రభావం మీద ఏవిధంగా ఆధారపడేదీ, మఱొకవైపు అతడున్న పరిస్థితులూ, అప్పటి విశేషాలమీద ఏవిధంగా ఆధారపడేదీ యీ నవలలో సమగ్రంగా చూపబడింది కొన్ని అప్రధాన పాత్రల చిత్రణం కూడా శక్తిమంతంగా ఉంది

మహారాష్ట్రలోని సమకాలిక సంఘ జీవితంలోని ఒక ప్రత్యేకలక్షణమైన అభిప్రాయ సిద్ధాంతాల సంఘర్షణలకు సంబంధించిన వర్ణన యీ నవలలో మఱింత నిండుగా కనబడుతుంది. దీనికి సంబంధించిన వివరణం కొంత యీ గ్రంథంలోని మొదటి అధ్యాయంలో ఇవ్వబడింది రాజకీయ విషయాలకు ఎక్కువ విలువనిచ్చి, సంఘ సంస్కరణలను రెండవ స్థానానికి త్రోసివేసిన వారికి శ్రీధర్ పంత్ ప్రతినిధి. కొందఱు మఱికొంత ముందడుగువేసి అసలు సంస్కరణల ఆవశ్యకతే లేదన్నారు.

తన అభిప్రాయాలను ప్రచారం చెయ్యడానికి యశ్వంతరావు ఏంచేసి ఉండేవాడో, అతడు ఏరకమైన జీవితం గడిపి ఉండేవాడో, తన అభిప్రా

యాలను నిర్బంధంమీద మార్చుకుని ఉండేవాడో కాడో పాఠకుడు మాత్రమే ఊహించగలడు.

1893–1895 నాటి తన తరువాతి నవల "మీ" (నేను) లో హరిభావ్ తన రచనను స్వీయచరిత్ర రచనా ధోరణికి త్రిప్పుతాడు కాని, యిందలి రచయిత పేరు భావ్. అతడే తరువాత సన్యాసి అయి భావానంద్ అనే పేరు స్వీకరిస్తాడు. ఈ నవలకు అంతకు ముందున్న మూడునవలల తోనూ పోలికలూ, తేడాలూ చూపవచ్చు. స్త్రీలను విద్యావంతురాండ్రను చెయ్యడం, వాళ్ళ పరిస్థితులనూ, అంతస్తునూ మెరుగుపరచడమే గణ పతిరావ్, "పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో" లలోని ప్రధానేతి వృత్తం అందలి విషయం సాంఘికం యశ్వంతరావ్ ఖరేలో సంఘసంస్కారం కంటె మిన్నగా, రాజకీయ సంస్కారానికే ప్రాధాన్యం ఇవ్వబడింది "మీ" లో ఈ రెంటికీ సమప్రాధాన్యం కనిపిస్తుంది. తన యిష్టాన్నీ, సామర్థ్యాన్నీ పురస్కరించుకొని, ఏవ్యక్తయినా ఆయా రంగాల్లో పనిచెయ్యవచ్చు రెండు రంగాలలోనూ పనిచేయగల సామర్థ్యం తనకున్నదని ఏవ్యక్తయినా భావిస్తే, అతడావిధంగా కృషిచెయ్యాలి. గణపతిరావ్, యశ్వంతరావ్ఖరే రెండూ అసంపూర్ణ నవలలు అందుచేత గణపతిరావు, యశ్వంతరావ్ఖరే తమ అభిప్రాయాలను ప్రచారం చెయ్యడానికి ఏంచేసి ఉండేవారో మనకు తెలి యదు. ఆ తరువాత ఎప్పుడో వచ్చిన "కర్మయోగ" అనే నవలలో గణ పతిరావు పెద్దజీతగాడైన ప్రభుత్వోద్యోగి కావడం, తన సంస్కరణ దృక్ప థాన్ని కొనసాగించడం మాత్రం తెలుస్తుంది.

మరోవైపు 'మీ' లో కథకుడైన భావ్ కళల్లో మొదటి డిగ్రీ, న్యాయ శాస్త్రంలో రెండవ డిగ్రీ సంపాదించి చదువు పూర్తిచేసి, ప్రజాసేవలో తన జీవితం గడపాలని నిశ్చయించుకొంటాడు. అతడు ఉపన్యాసాలిస్తాడు, తన అభిప్రాయాలు ప్రచారం చెయ్యడానికై ఒక పత్రిక నడుపుతాడు. పురుషులూ, స్త్రీలూ శ్రద్ధకలిగి అంకితభావంతో పనిచేసే ఒక మఠం స్థాపి స్తాడు. తనశక్తినీ, కాలాన్నీ సంపూర్ణంగా తానుచేపట్టిన పనికై వినియో గించడానికి వీలుగా తాను సన్యాసి అవుతాడు. విపరీతంగా పనిచేసి, ఆ అలసటవల్ల అతడు మరణిస్తాడు. పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో ? లోలాగా ఈ కథను పూర్తి చెయ్యడానికి భావానందుని శిష్యుడైన రామానందుడు ఒక అధ్యాయాన్ని కలుపుతాడు.

యశ్వంతరావ్ ఖరేలో శ్రీధర్ పంత్ ప్రభావంతో యశ్వంతరావు పాత్ర, అతని వ్యక్తిత్వం బాల్యంనుండి యౌవనందాకా క్రమపరిణతం

కావడం గ్రంథకర్త చేత ప్రథమపురుషలో వర్ణింపబడింది. "మీ" లో ఇంచుమించు అదే జీవితకాలం చిత్రింపబడింది. కాని అది నవలలో ప్రధానపాత్ర అయిన భావ్‌చేత ఉత్తమ పురుషలో చెప్పబడుతుంది. యశ్వంతరావు, భావ్ - ఇద్దరికీ ఇద్దరు పెద్దవాళ్ళు మార్గదర్శకులవుతారు. పెద్దల ప్రభావం కూడా వీళ్ళమీద పడుతుంది యశ్వంతరావును ప్రభావితుణ్ణి చేసిన శ్రీధర్‌పంత్ రెచ్చగొట్టే గాఢస్వభావం కలవాడు. ఇతరులంటే, ముఖ్యంగా తన అభిప్రాయాల కంటే భిన్నమైన అభిప్రాయాలు కలిగిన వారంటే అతనికి గౌరవంలేదు అందుకు భిన్నంగా భావ్‌కు ఉపదేశకుడూ, మార్గదర్శకుడూ అయిన శివరామ్‌పంత్ శ్రీధర్‌పంత్‌లాగా తన ప్రభావాన్ని నెఱపగల వ్యక్తి కాడు. కానీ, ఉదారమైన బుద్ధీ, నిష్పాక్షికమైన అభిప్రాయాలూ ఉన్నవాడు అదే సమయంలో దృఢమైన అభిప్రాయం, దాన్ని ఆచరణలో పెట్టగలిగిన సంసిద్ధత ఉన్నవాడు అతడు సాంఘిక రాజకీయ సంస్కారాలు రెండూ సమమైన ప్రాధాన్యంకలవనీ, రెంటికీ ఆవశ్యకత ఉన్నదని భావించేవాడు అతడు తన కూతురైన సుందరికి చదువు చెప్పించడమేగాక, సంఘసేవ కోసం ఆమె అవివాహితగా ఉండిపోవడానికి కూడా అనుమతిస్తాడు హరిభావ్ పరిగణించే ఆదర్శవ్యక్తి చాలావఱకు శివరామ్‌పంత్ లాంటివాడని చెప్పవచ్చు.

పణ్ లక్ష్యాన్ కోణ్ ఘేతో ?లో యమున స్వయంగా చేసిన వర్ణనను బట్టి ఇద్దఱు వ్యక్తుల పాత్రలు అంటే యమున, సోదరుడు దాదా - క్రమోన్మీలితాలు కావడం మనం చూడవచ్చు 'మీ'లో భావ్‌తో పాటు అతని సోదరితాయ్, శివరామ్ పంత్ కూతురు సుందరి - అనే ముగ్గురు వ్యక్తుల పాత్రలు క్రమోన్మీలితాలు కావడం చూస్తాం. ఈ నవలలో కథకుడు భావ్. ఒక స్త్రీకి తెలిసిన ప్రపంచం పరిమితమైనది. అందుచేత ఆమె పరిశీలన, అనుభవాలకు సంబంధించిన పరిధి కూడా తక్కువే కాబట్టి ఆమె శ్రద్ధాభక్తులు కూడా సహజంగానే ఆమె కుటుంబానికి దగ్గఱి బంధువులకు మాత్రమే పరిమితమై ఉంటాయి. అందుకు భిన్నంగా ఒక పురుషునికి తెలిసిన ప్రపంచంగానీ, అతని పరిశీలన, అనుభవం, వాటితో పాటు అతని శ్రద్ధా భక్తులకు సంబంధించిన విషయాల పరిధిగానీ, చాలా విశాలమైనది. ఈ భేదం రెండు నవలల్లోనూ స్పష్టంగా ఉండి కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. ఇది జీవితాన్ని పరిశీలించడంలో హరిభావ్‌కున్న శక్తిని చాటడమే కాకుండా తన పాత్రలలో పరకాయ ప్రవేశం చేయగల ఆయన సామర్థ్యాన్ని కూడా తెలుపుతుంది.

యముతో పోలిస్తే 'మీ'లోని తాయ్ పూర్తిగా భిన్నమైన వ్యక్తి. యము ప్రేమపూరితమైన మనస్సు కలిగిన, ప్రేమింపదగిన యువతి. బొంబాయిలో భర్తతోడి ఆమె జీవితం కొంతకాలమే అయినా చాలా సంతోషంగా గడిచిపోయింది భర్త మరణానంతరం ఆమె ఎంతో కాలం జీవించి ఉండలేదు తాయ్ పూర్వ జీవితమంతా ప్రతికూలశక్తులతో పోరాటం కానీ ఆమె చాలా గట్టిపిండం ఉత్సాహమూ, అభిప్రాయదృఢత్వమూ, ఆత్మవిశ్వాసమూ ఉన్న వ్యక్తి కానీ ఆమెలో దయాదాక్షిణ్యాలు కొఱవడలేదు విధ్యుక్తధర్మమన్నా, బాధ్యతన్నా శ్రద్ధాసక్తులున్న మనిషి భావ్, తాయ్‌ల తండ్రి బాధ్యత తెలియని ఒక బడాయికోరు అతడు తన కుటుంబాన్ని తన భార్య సోదరుని పోషణకు వదలి ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు ఉన్నట్లుండి అప్పుడప్పుడూ రావడం, కొద్ది కాలం ఉండడం అందఱి జీవితాలూ దుర్భరం చేసి, చేదు అనుభవాలు మిగిల్చి మళ్ళీ వెళ్ళిపోవడం - చేసేవాడు తాయ్ తల్లి తన పిల్లలపట్ల చాలా కఠినంగా ప్రవర్తిస్తూ, తన చర్యల ఫలితాలెలా ఉంటాయో కూడా పట్టించుకోనంత స్వతంత్రబుద్ధీ, స్వేచ్ఛ, మూర్ఖమైన పట్టుదల కలిగి ఉండేది. తాయ్ ఇంకా చిన్న వయస్సులో ఉండగానే అరవైయేండ్ల ఒక వ్యక్తికిచ్చి మూడవ భార్యగా పెండ్లి చేస్తారు అతడు తాగుబోతు, వ్యభిచారి. అతనితో జీవితం దుర్భరం కాగా, పుట్టింటికి తిరిగివచ్చి సోదరుని ప్రోత్సాహంతో, శివరామ్‌పంత్ సహాయంతో చదువుకోవడం ప్రారంభిస్తుంది తన తల్లి మేనమామల యిష్టానికి వ్యతిరేకంగా ఆమె యిది చేయవలసివస్తుంది. ఆమెచేసిన పని అప్పటికి వారికేవిధంగానూ సమ్మతంకాదు గాబట్టి, విమర్శనూ, నిందాత్మకాలైన వదంతులనూ, పీడించే సంఘాన్నీ ఆమె యెదుర్కోవలసి వచ్చింది కాని అవేవీ, ఆమెను కదలించలేదు. పైగా తన భర్త జబ్బుతో మరణశయ్య మీద ఉన్నప్పుడు వెళ్ళి అతనికి సేవచేస్తుంది. చదువు పూర్తి చేసిన తరువాత తన సోదరుని మఠంలో చేరి సంఘసేవకు తన జీవితాన్ని అంకితంచేస్తుంది. మరాఠీ నవలలో ఇటువంటి స్త్రీ కనిపించడం ఇదే మొదటసారి రక్మాబాయ్, పండిత రమాబాయ్‌లవంటి స్త్రీలు లేకుంటే, తాయ్, ఒకఅవాస్తవిక పాత్రగా పరిగణింపబడి ఉండేది.

ఇటువంటి మఱొక అసాధారణపాత్ర సుందరి. ఆమె, భావ్ యిద్దఱూ ఆమె తండ్రి శివరామ్‌పంత్ యొక్క శాంతమైన పట్టుకొలిపే మార్గదర్శకత్వంలో పెరిగి అభివృద్ధి చెందుతారు. వాళ్ళు వయస్సుకొచ్చేటప్పటికి, పెరుగుతున్న వయసు కనుగుణంగా వాళ్ళ పరస్పర ప్రేమ, ఆకర్షణలు ఒక తీక్ష్ణమైన మార్పుకు లోనవుతాయి.

తాయ్‌లాగా సుందరి కూడా చదువుకొని, అవివాహితగా జీవిస్తూ, సంఘం కోసం పాటుపడాలన్నది శివరామ్‌పంత్ అభిప్రాయం. కాని స్వభావాన్ని బట్టి సుందరి తాయ్ వంటిదికాదు ఆమె బాలవలకు యము లాగా సున్నితమైన మనస్తత్వం కలది, మృదుహృదయ, ప్రేమమయి, ప్రేమింపదగిన వ్యక్తి శివరామ్‌పంత్‌కు కొంత నిరాశ కలుగుతుంది. కానీ తన అభిప్రాయాలను ప్రక్కకు నెట్టి, భావ్‌ను సుందరిని పెండ్లి చేసు కోవలసిందని కోరుతాడు ఆదర్శాలు కలిశాయి కాబట్టి, వాళ్ళిద్దఱూ ఒకరి కొకరు తగినవారు అ పెండ్లి సంతోషదాయకమవుతుంది కాని, ఆ ప్రస్తావన వచ్చేటప్పటికే భావ్ తాను ఒంటరిగా బ్రతుకుతూ తన జీవితాన్ని సంఘసేవకే అంకితం చేయాలని నిర్ణయించుకొంటాడు శివరామ్‌పంత్ రెండోసారి నిరాశకు గుఱవుతాడు కాని దయార్ద్రమైన స్వభావం కల వాడు కాబట్టి నేరమెంచకుండా సహిస్తాడు

గ్రంధకర్త కధ నీవిధంగా మలుపుత్రిప్పడం న్యాయమేనా? అని మనం చర్చించవచ్చు కాని కధలో వచ్చే యీ పరిణామాలన్నింటినీ, సున్నితమైన సందర్భాలన్నింటినీ ఆయన చాలా నైపుణ్యంతో సంబాళించాడని చెప్పడంలో సందేహం లేదు.

పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతోతో పోల్చి చూస్తే 'మీ' లోని ఆవేశధోరణి ఉగ్రమైనదీ, కఠినమైనదీ కూడా విధి నిర్వహణ బుద్ధి వినీతి, సున్నితమైన మనస్తత్వాన్నీ, ఆవేశాన్నీ వెనక్కు నెడతాయి. ఈ అంతరార్థం నవల కడదాకా ధ్వనించేటట్లు హరిభావ్ చెయ్యగలిగాడంటే, అది నవలా రచ యితగా ఎదగగల ఆయన సామర్థ్యం ఎంతటిదో చాటుతుంది ఇందులోని సాంఘిక విషయం కూడా అనేక అంశాలను తనలో ఇమిడించుకోగలిగినది. ఆ కాలంలో సాంఘిక స్పృహ కలిగిన విద్యావంతులైన మధ్యతరగతి ప్రజల మనసుల్ని ఆకట్టుకొన్న సమస్యలను ఇంచుమించు అన్నింటినీ - యీ నవల పరామర్శిస్తుంది.

ఇప్పుడు జగ్ హేఁ అసేఁ ఆహే (ప్రపంచం ఇలా ఉంది) 1897-99; భయంకర్ దివ్య (ఒక భయంకర కఠిన పరీక్ష) 1901-1903, మాయేచా బాజార్ (మాయాప్రపంచం) 1910-1912— అనే మూడు నవలల సంగతి చూద్దాం. ఈ మూటిని కలిపి పరిశీలించడంలో 1904 నాటి అజబ్‌ను వదలివేయడం జరిగింది అది తరువాత హరిభావ్ కడపటి సాంఘిక నవలైన 'కర్మయోగ' తో కలిపి పరిశీలింపబడుతుంది. ఎందుకంటే ఆ రెండూ ఒక కోవకు చెందిన అసంపూర్ణ నవలలు కావడంచేత

ఈ మూడు నవలలూ హరిభావ్ తక్కిన నవలల కంటే భిన్నమైనవే కాక అంత సంపూర్ణమైన తృప్తిని కలిగించేవికావు కూడా. జగ్ హే౹ అసే౹ అహే రాధాబాయ్, ఆమె కొడుకు సీతారాంల కధ రాధాబాయ్ వితంతు వవుతుంది భర్త మరణానంతరం ఆమె తన సవతి కొడుకుచేత (ఆమె భర్త యొక్క మొదటి భార్య కొడుకు). అతని భార్య చేత పీడింపబడుతుంది. నిర్లక్ష్యంగా చూడబడుతుంది. అవమానింపబడుతుంది. కడపటికి ఈ శవతికొడుకూ, కోడళ్ళ చేత తరిమి కొట్టబడి ఆమె తన తండ్రి యింటికి తిరిగి వెళ్ళవలసి వస్తుంది. ఆమె తండ్రి త్వరలోనే మరణిస్తాడు ఆమె తండ్రి యిల్లు మరణించిన తన భర్తకు—అంటే ఫలితంగా తన సవతి కొడుక్కి— కుదువ పెట్టబడినట్లు తెలిసి వస్తుంది. ఆమీద ఆమె తన సవతి కొడుకు, కోడలు, వాళ్ళ స్నేహితులు పెట్టే అన్ని రకాల బాధలకు గుఅవుతుంది. కానీ ఆమె, ఆమెలాగానే ఆమె కొడుకూ కషాలకు వెనుదీయకుండా ఆదర్శ వంతంగా జీవిస్తారు కడపట దుర్మార్గుల ఆటకట్టి, రాధాబాయ్, ఆమె కొడుకు తమకు రావలసినది పొంది సుఖపడతారు ఆవిధంగా చెడు వీగిపోయి మంచి జయిస్తుంది. నవలలోని సంఘటనలు రెండు భిన్న స్థలాల్లో జరుగుతాయి ప్రధమ భాగంలో హరిభావ్‌కు బాగా పరిచితమైన పూనాలోని సదాశివపేట్ ఆరంగం. నవల తరువాతి భాగంలో ఊహ కల్పితమైన దేశీయ రాష్ట్రం ఖుఖాబాద్ రంగమవుతుంది (పేరే లంచ గొండితనాన్ని సూచిస్తుంది) ఆ రాష్ట్రానికి రాధాబాయ్ సవతి కొడుకయిన చింతోపంత్ దివాన్‌గిరి సంపాదిస్తాడు. అక్కడ నుండే రాధాబాయ్‌కి, ఆమె కొడుక్కి విరోధంగా అనేక తంత్రాలు, పధకాలు కల్పింపబడతాయి హరి భావ్ అటువంటి వాతావరణానికి అలవాటుపడినవాడు కాకపోవడంచేత, ఆ వాతావరణ చిత్రణం అంత శక్తిమంతంగా లేదు కధలో రక్తి సన్న గిల్లుతుంది, పాత్రలు చర్విత చర్వణంగా రూపొందుతాయి, సందర్భాలు ఏదో యుక్తి చేసి కల్పించినట్లు ఉంటాయి. హఠాత్సంఘటనల మీద ఎక్కువ ఆధారపడడం కనిపిస్తుంది. నవల కేవలం ఒక నీతికథ అవుతుంది నవలలో ఒక కొన్ని పాత్రలు మాత్రమే శక్తిమంతంగా చిత్రింపబడ్డాయి

భయంకర్ దివ్య (1901 - 1903), మాయేచాబాజార్ (1910-1912) ల మధ్య కొన్ని అంశాలలో సామ్యముంది కాబట్టి ఆ రెంటినికలిపి ప్రస్తావించవచ్చు అవి మహారాష్ట్రలోని సంఘ సంస్కారోద్యమంలో కొంత అభివృద్ధిని సూచిస్తాయి కాని నవలారచయితగా హరిభావ్ చెందిన అభివృద్ధిని సూచించేవి కావవి.

'భయంకర్ దివ్య' బల్వంత్‌రావ్ ద్వారకాబాయ్‌ల కూతురైన కమల యొక్క కథ. బల్వంత్‌రావ్‌తో వివాహానికి ముందు ద్వారకాబాయ్ ఒక వితంతువు. ఈ విషయం బల్వంత్‌రావ్ ఒక సంఘసంస్కారి అనే విషయాన్ని తెలుపుతుంది అతడు తన కూతురైన కమలకు 14, 15 సంవత్సరాల వయస్సు వచ్చేదాకా ఆమె అవివాహితగా ఉండడానికి అనుమతించి ఆలోపల ఆమెకు మంచి చదువు చెప్పించాడు. విశేషించి ప్రభాకర్ పద్మాకర్ అనే ఇద్దరు యువకులు తన యింటికి రావడానికి, కమలను కలిసి స్వేచ్ఛగా మాట్లాడుకోడానికి అనుమతించాడు కాలక్రమేణ పద్మాకర్ కమలను పెండ్లాడగోరి అందుకు బల్వంత్‌రావ్ అనుమతి పొందుతాడు. పద్మాకర్ తండ్రి దాదాసాహెబ్ ఉద్యోగవిరమణ చేసిన ఒక ప్రభుత్వాధికారి. ఆయన సంఘ సంస్కరణకు విరోధి ఈ పెండ్లిని అంగీకరించడు. కాని ఆయన వ్యతిరేకించినప్పటికీ ఆ పెండ్లి జరుగుతుంది. ఆయన కొడుకును వదులుకొంటాడు

తొందరలోనే కష్టాలు ప్రారంభమవుతాయి. వాళ్ళిద్దఱూ సంఘ సంస్కరణ, సంస్కరణ వ్యతిరేకదృక్పథాలను అధిగమిస్తారని ఎవరైనా అనుకొంటారు. కాని, నవలా పరిణామం ఈ మార్గంలో జరగలేదు. నవల ఒక మర్మగాథగా మాఱిపోతుంది. తరువాత వచ్చే కష్టాలకంతా కారకుడు రాజారామ్ అనే వ్యక్తి. వాడొక పోకిరీ, మోసగాడు, దొంగ సంతకాలు చేసేవాడు. వాడు ప్రభాకర్ కమలల మీద లేనివీ పోనివీ చెప్పి పద్మాకర్ మనస్సు విషపూరితంచేసి, కమల అతనికి ద్రోహం చేసినట్లు నమ్మేటట్లు చేస్తాడు వాడు పద్మాకర్ వ్రాతననుకరిస్తూ కమలకు దూషణలతో నిండిన ఉత్తరాలువ్రాసి ఆమెకు బాధకలిగిస్తాడు. అయినా, కడపటి కతడు చిక్కులోపడి తన దుర్మార్గాలన్నింటినీ ఒప్పుకొంటాడు మేఘాల్లా ముసిరిన సంశయాలూ, కుశంకలన్నీ పటాపంచలైపోయి, పరిస్థితులు చక్కబడి మంచివాళ్ళందఱూ సమాధానపడి సుఖంగా ఉంటారు అది ముఖ్యంగా ఒక కథా ప్రధానమైన నవల. కాని, ఓర్పులేని, సులభంగా మోసపోయే పద్మాకర్ స్వభావమూ, అమాయకమూ, పరిశుద్ధమూ — అయిన కమల పాత్ర అనేక సంఘటనలద్వారా ఎంతో చక్కగా చిత్రింపబడ్డవి కమల పట్ల దాదాసాహెబు వైఖరి క్రమంగా మార్పు చెందడం కూడా ఎంతో బాగా చిత్రింపబడింది ఈ విషయం దాదా సాహెబు స్వాభావికంగా మంచి మనిషి — అని తెలుపుతుంది

ప్రసక్తమైన యీ రెండు నవలల లాగానే, మాయేచాబాజార్ (1910-1912) ఒక సంపూర్ణ నవల. పైపెచ్చు ఆ రెంటి కంటె మానవతాదృష్టి

ఎక్కువ కలిగింది కావచ్చు. కాని, అంత సమర్థంగా నిర్వహింపబడిన రచన కాదు— అనే కొఱత దీనికీ ఉన్నది ఈ నవలలో రెండు భిన్న కథలు కలిసి నడవడం ఉంది గానీ, వాటి కలయిక ఉచితరీతిలో సాధింప బడలేదు.

నవల మూడు విభిన్న సమూహాల వ్యక్తుల జీవిత సంఘటనలను చిత్రిస్తుంది గానీ ముఖ్యంగా వాటిలో రెండు సమూహాలతో మాత్రమే అది ముడివడి ఉంది. అబాసాహెబ్ అనే ఒక సంఘ సంస్కారి యొక్క కూతురు పద్మావతి అతడామెకు కొంత చదువు చెప్పించి, పధ్నాలుగు పదిహేనేండ్ల వయస్సులో ఆమెను బాలాసాహెబ్ - అనే ఒక బీద యువకుని కిచ్చి పెండ్లి చేశాడు పద్మావతి కిద్దఱు సోదరులున్నారు కాని, అబాసాహెబ్ వాళ్ళను నిష్కరుణంగా చూడడంవల్ల వాళ్ళు ఇల్లు వదలి పెట్టి వెళ్ళిపోయారు అబాసాహెబ్ పద్మావతిని మాత్రమే వాత్సల్యంతో అభిమానంతో చూచి, కొడుకుల్ని నిర్లక్ష్యంచేసి అవమానించాడని తల్లి భావిస్తుంది అందువల్ల పద్మావతి యెడల ఆమె సానుభూతి చూపదు పెండ్లయిన తరువాత బాలాసాహెబ్ అబాసాహెబ్ కుటుంబంతో కలిసి జీవించడం ప్రారంభించి, న్యాయశాస్త్రం చదవడంకోసం ఇంగ్లండుకు పంపబడతాడు అతడు తనకు మోసంతో పెండ్లి జరిపినట్లుభావించి, పగతీర్చుకోవాలనుకొంటాడు అతడు కూడా స్వాభావికంగానే దుష్టుడు, సందేహశీలి, తంత్రశాలి

దాదాసాహెబ్, అతనిభార్య, అతని కొడుకు వసంతరావు, కూతురు మాలతిలతో కూడిన కుటుంబం మఱొకటి మాలతికూడా చదువుకొన్నది మధుకర్ అనే వ్యక్తితో ఆమె వివాహం జరుగుతుంది వివాహానంతరం ఐ.సి ఎస్ పరీక్షకు చదవడం కోసమై అతడు ఇంగ్లాండుకు వెడతాడు. బాలాసాహెబ్ వెళ్ళిన సమయంలోనే అతడు కూడా ఇంగ్లాండుకు వెడతాడు

ఈ రెండు కుటుంబాలవారూ చాలా స్నేహంగా ఉంటారు ఒకరింటికొకరు తఱచుగా రాకపోకలు సాగిస్తుంటారు వసంతరావు, పద్మావతి బాల్యంనుండీ స్నేహితులు వాళ్ళమధ్యగాఢమైన పరస్పరాకర్షణ ఉన్నది వసంతరావు కామెపట్ల యెంతగాఢమైన అభిమానమంటే, ఆమెను పొందలేని కారణంచేత అవివాహితుడుగానే ఉండిపోవాలనుకొంటాడు. పద్మావతి యుక్తాయుక్తాలు తెలిసి తెలివిగా ప్రవర్తిస్తుంది బాలాసాహెబ్ ఇంగ్లాండులో లేనప్పుడు, మునపటిలాగానే వసంతరావు పద్మావతి కడకు వచ్చిపోతుంటాడు. బాలాసాహెబ్ పద్మావతి పాతివ్రత్యాన్ని శంకించ డానికిదే కారణమవుతుంది అతడు పద్మావతిని అవమానిస్తూ, పొగడుతూ మార్చి మార్చి ఇంగ్లండు నుండి ఉత్తరాలు వ్రాస్తాడు.

నవలలో కొద్దిపాటి కథ జరుగగానే అబాసాహెబ్ మరణిస్తాడు ఇంగ్లండు నుండి తిరిగిరాగానే బాలాసాహెబ్ అబాసాహెబ్ ఇనప్పెట్టెతాళం చెవీ, ఆస్తిపంపకంచేస్తూ అతడు వ్రాయించిన 'వీలునామా' కావాలని పద్మావతిని అడుగుతాడు. పద్మావతి అతని కోరికను తిరస్కరిస్తుంది. ఆమె ఉత్సాహమూ, నిశ్చితాభిప్రాయమూ ఉన్నస్త్రీ. ఆమె అతన్ని భర్తగా గౌరవిస్తుంది, విశ్వసనీయగా నడుచుకొంటుంది కాని, ఒక మనిషిగా అతడంటే ఆమెకు గౌరవంలేదు

తరువాత వచ్చేకథ యీ నెపంమీద ఈ యిద్దరి మధ్యా సుదీర్ఘంగా సాగే ఉత్కంఠ, ఘర్షణలతో కూడిన కథ. బాలాసాహెబ్ తాగుడు కలవాటు పడతాడు. ఒక వంచకుల గుంపుతో కలుస్తాడు పద్మావతిని సాధ్యమైనన్ని విధాలుగా పీడిస్తాడు హరిభావ్ వంటి నవలాకారునికి ఇది ఉత్తమమైన కథావస్తువు ఈ రెండుపాత్రలూ బాలా క్లిష్టమైనవి వాటి సంబంధమంతా వట్టి చిక్కు. కాని, కథ బాలా సుదీర్ఘంగా పెంచబడింది. సాంఘిక, మనస్తత్వ సంబంధమైన విషయాలకు బాధకాలైన కుతంత్రాల చిత్రణలో ఎంతో శ్రద్ధ చూపబడింది ఏమైనా హరిభావ్ ఈ రెండు పాత్రలనూ బాలా విజయవంతంగా చిత్రించాడు కథా సందర్భాల నెపంతో నేర్పుతో సంబాళించాడు

నవలలోని మూడవ కథాంశం మథురాబాయ్ అనే ఒక వితంతు యువతి జీవితానికి సంబంధించింది. ఆమె తన భర్తనూ తల్లిదండ్రులనూ పోగొట్టుకొంటుంది తమ్ముళ్ళనూ, చెల్లెళ్ళనూ తానే కాపాడవలసివస్తుంది ఒక పాఠశాలలో ఉపాధ్యాయినిగా ఉద్యోగం చేస్తూ ఆమె యీ పనిచేస్తుంది

ఆమె పొరుగున ఉన్న దిగంబర్ పంత్ కీర్తి శేషుడైన ఆమె తండ్రి స్నేహితుణ్ణని చెప్పుకొని, ఆమెకు బుద్ధి చెప్పడం, కాపాడడమనే నెపంతో ఆచారహీనమై మతసమ్మతం కాని ఆమె ప్రవర్తనను విమర్శిస్తాడు ఆమె తనను లెక్కపెట్టడం, తన పద్ధతుల్ని మార్చుకొనడం లేదని తెలిసి ఆమెను పీడించడం, ఆమెను గురించి నిందా ప్రచారం చెయ్యడం ప్రారంభిస్తాడు కడకు భరింపరాని ఆగ్రహంతో ఆమె ఆ యిల్లు వదిలి మరో యింటికి వెడుతుంది. అది పద్మావతి యింటికి పొరుగిల్లవుతుంది. వాళ్లు త్వరలోనే స్నేహితులవుతారు మథురాబాయ్‌కి ఎంతో సంతోషమవుతుంది. చాలా కాలంగా జబ్బుతో ఉన్న పద్మావతి, తన ఆస్తినంతా మథురాబాయ్ పేరిట వ్రాసి, తన కొడుకునామె పెంపకాని కప్పగించి మరణిస్తుంది.

మధుకర్ ఇండియాకు తిరిగి వచ్చిన తరువాత మధుకర్, మాలతులు కథలో మఱుగున పడిపోతారు. ఆ విధంగా నవల ప్రధానంగా పద్మావతి జీవితానికీ, ఆ మీాద మధురాబాయ్ జీవితానికీ సంబంధించిందవుతుంది.

నిజానికి పద్మావతి జీవితం వ్యక్తిగత సంబంధాలకు, ప్రయాసలకూ, సంబంధించిందైతే మధురాబాయ్ జీవితం సాంఘిక సమస్యలకు సంబంధించింది మధురాబాయ్ భరించవలసి వచ్చిన కష్టాలూ, ఆమె యెదుర్కొవ వలసి వచ్చిన ప్రతికూల చర్యలూ, నిందా ప్రచారమూ ఆ కాలంలో మధ్య తరగతి హిందూ సంఘం ఎటువంటి సంకట స్థితిని దాటి వస్తున్నదో తెలుపు తాయి కొందఱు వితంతువులు చదువుకొని స్వతంత్రులవుతున్నారు. కాని, సంప్రదాయ పరిరక్షకం మన్యులైనవాళ్ళు దాన్ని గర్హించి అడ్డుపడ్డారు. ఆవిధంగా సాంఘిక దృక్పథంతో చూస్తే, మధురాబాయ్ కథ ఎక్కువ ప్రాధాన్యం కలదవుతుంది వీలైనంతవఱకూ అది సక్రమంగానే నిర్వహింపబడింది కాని, మొత్తంమీాద, నవలలో పద్మావతి కథకే స్థానం ఇవ్వపడింది. ఆ రెండు కథలూ బాగా సంధానింపబడలేదు. కుతంత్రాలకు సంబంధించిన విషయం చాలాఉండి, నవలా సౌష్ఠవాన్ని చెడగొట్టుతున్నది

1904 - 1906 నాటి ఆజచ్ (ఈరోజే), 1913 – 1917 నాటి కర్మయోగ - రెండూ అసంపూర్ణాలే. కథాదృష్ట్యా అవి గణ్‌పత్‌రావ్, యశ్వంతరావ్‌ఖరే, మీా లతో సమానమైనవేగాక, వాటికంటె కొంత మెరుగైనవని కూడా చెప్పవచ్చు. గణ్‌పత్‌రావ్‌లో స్త్రీలకు విముక్తి కలిగించడం, వాళ్ళను చదివించడం, వాళ్ళ వివాహవయస్సును పొడిగించడం, వాళ్ళను మగవాళ్ళతో సమానంగా పరిగణించడం - అనే వాటికే ప్రాధాన్యం. యశ్వంతరావ్‌ఖరేలో రాజకీయ సంస్కారానికే ప్రాధాన్యం. 'మీా' లో ఈ రెండురకాల సమస్యలకూ సమప్రాధాన్యం ఇవ్వబడింది. ఆజచ్‌లో ఎక్కువ విషయాలు కలుపబడ్డాయి. 1901లో కలకత్తాలో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసు సభకు వెళ్ళివస్తున్న నలుగురు వ్యక్తులు పాల్గొన్న ఒక చర్చతో ఈ నవల ప్రారంభమవుతుంది. వాళ్ళలో కొందఱు అంతకు మునుపటి నవలలలోనే ప్రత్యక్షమవుతారు. వాళ్ళలో సంఘ సంస్కారాన్ని కాంక్షించే గణపతిరావొకడు, మఱొకడు రాజకీయ సంస్కారాన్ని కోరే యశ్వంతరావు. 'యశ్వంతరావ్ ఖరే'లో కృష్ణబాపుగా కనిపించిన కృష్ణారావు మూడవవాడు. హిందువులమైనమనం పరిశ్రమలను ప్రారంభిస్తేనేకాని మనకు భవిష్యత్తులేదని అతని అభిప్రాయం. నాలుగవవ్యక్తి యీా నవలలో మొట్టమొదటిసారిగా సాక్షాత్కరించే నారాయణరావు, మనకు

పరిపూర్ణమైన రాజకీయ స్వాతంత్ర్యం ఉంటేనేకాని మనం అభివృద్ధి చెంద లేమని అతని అభిప్రాయం.

వాళ్ళు ప్రయాణంచేస్తున్న రైల్లో ప్రారంభమైన యీ చర్చ నవలలో అనేక అధ్యాయాలలో జరుగుతుంది ఒక స్టేషన్‌లో అద్వైతానంద అనే స్వామీజీ ఒకరు వాళ్ళున్న పెట్టెలోకివచ్చి, వాళ్ళ చర్చల్లో పాల్గొని తన అభిప్రాయాలు గూడా కొన్ని తెలుపుతాడు. ఏ ఉద్యమమైనా భగవద్వి శ్వాసం, మతాలమీద ఆధారపడకపోతే అది అర్థరహితమని, విజయవంతం కాదనీ అతని తీర్పు నవల రెండువందలపైై చిలుకుపుటలకు పెరుగుతుంది కానీ కథనంలో మెఱుగు కనిపించదు ముగింపు ఎలా ఉండి యుండవచ్చో తెలిపే సూచనేలేదు ఎవరైనా దాన్ని ఊహించుకోవలసిందే. నవల చర్చల, వాదాల బురదలో కూరుకుపోయింది.

అజబ్‌లాగా, కర్మయోగ (1913-1917) కూడా అసంపూర్ణమే ఇందలి కథానాయకుడు చంద్రశేఖర్ గణపతిరావు, (గణ్‌పత్‌రావ్ నవల కథానాయకుడు) సరస్వతీబాయ్‌ల కొడుకు సరస్వతీబాయ్ గణపతిరావు రెండవ భార్య ఆమే నానా సోదరి గోదావరి గణపతిరావును వివాహ మాడడానికిముందు ఆమె వితంతువు. నానా, అతని భార్య యశోదాబాయ్, వాళ్ళమ్మాయి లీలావతి కూడా యీ నవలలో ఉన్నారు

చంద్రశేఖర్ ఎం.ఏ పరీక్ష ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడవుతాడు. అతడు తన జీవితాన్ని సంఘసేవకే అంకితం చేస్తాడని అందఱూ ఎన్నో ఆశలు పెట్టుకొంటారు

కాని, తానేంచేయాలో చంద్రశేఖర్ నిశ్చయించుకోలేకపోతాడు. కొంతకాలం హాయిగా విశ్రాంతి తీసుకొని, బాగా ఆలోచించి తాను చేయ వలసినదాన్ని గుఱించి నిర్ణయించుకోవాలనుకొంటాడు. తన తండ్రిలాగా, అతడుకూడా ఏదీ నమ్మేవాడుకాడు. ఆ విధంగా తన కార్యాచరణాన్ని గుఱించి, ఒక పథకం తర్వాత మఱొక పథకం వేసుకొంటూ అనిశ్చిత పరిస్థితిలో ఉన్న అతడు ఒక "స్వామి"ని కలుసుకోవడం జరుగుతుంది. ఆ స్వామి వ్యక్తిత్వం, ఆయన గంభీరమైన ధోరణి, వాగ్ధాటి అతడిని ప్రభావితుణ్ణి చేస్తాయి ఆ స్వామి చంద్రశేఖర్ అనిశ్చిత ధోరణికీ, కార్యా చరణ విషయంలో ఒక మంచి పథకాన్ని చేపట్టలేని అతని అసమర్థతకూ అతడిని నిందిస్తాడు దైవం మీద విశ్వాసం లేనప్పుడు కార్యాచరణంలో (కర్మ) విశ్వాసం అర్థంలేనిదని నొక్కిచెబుతాడు. ఈ విశ్వాన్ని సృష్టించి,

పాలించే ఒకశక్తి ఉన్నదనీ, ఆ శక్తి యేంచేసినా అది విశ్వశ్రేయస్సుకే అనీ ప్రతి వ్యక్తీ పరిపూర్ణంగా నమ్మవలసి ఉంది అతని ఆలోచనలు ఈ ధోరణిలో ఉండగా అతని మేనమామ అయిన నానాతో కొన్నాళ్ళు గడిపి రావాలని వెడతాడు. అక్కడతడు బాహవ్ ('మీా' సంబంధి) చేత స్థాపింప బడిన ఆశ్రమాన్ని నడుపుతున్న తాయ్ ('మీా' సంబంధే) ని కలుస్తాడు. ఆమె వ్యక్తిత్వంచేతా, ఆమె ఆశ్రమాన్నీ, అందలి అనేక శాఖలనూనడిపే వాకచక్యంచేతా, ఎంతగానో ప్రభావితుడై తన కార్యాచరణరంగాన్ని కనుగొన్నానని భావిస్తాడు. ఈ దశలో నవల అసంపూర్ణంగా విడిచిపెట్ట బడింది

ఇప్పటికి ఎన్నో అధ్యాయాలు గడిచినా నవలలో చలనం రాలేదు. మఱింతచైతన్యం, కార్యగతి కలిగిన మఱొక కథ ఉన్నది. అది భావ్ సాహెబ్ అనే అతని కుటుంబానికి సంబంధించింది అతడు కళాశాలలో గణపతిరావుకు సమకాలికుడు అతడు సంస్కృతభాషలో తనకున్న పాండిత్యానికి గర్విస్తాడు అతడు సంస్కరణ విరోధి, బడాయికోరు. కుటుంబ నిర్వహణలో నిరంకుశుడు కానీ, పొగడ్తలకు సులభంగా లొంగి పోయేవాడు కూడా. అతడు తనకు నాటక రంగానికి సంబంధించిన ప్రజ్ఞ ఉన్నట్లు భావిస్తాడు. విక్రంశీల్ అనే వ్యర్థుడు, తిరుగుబోతు అయిన ఒక వ్యక్తిచేత గొప్పగా ప్రభావితుడై, అతని సహాయంతో ఒక నాటక ప్రదర్శనను నిర్వహించడంలో వ్యగ్రంగా ఉంటాడు నాటకానికి సంబంధించిన ఒద్దిక లన్నీ భావ్ సాహెబ్ ఇంట్లో జరుగుతాయి ఆయన నాశ్రయించి ఉన్న శిష్యురాలు నర్మద విక్రంశీల్ ప్రభావానికి లోనవుతుంది ఒక సమయంలో ఒకానొక సాయంకాలపు మసక చీకటిలో విక్రంశీల్‌తో కలసిఉన్న నర్మదను చంద్రశేఖర్ చూస్తాడు ఆమెను దుర్మార్గుడైన విక్రంశీల్ బారినుండి కాపాడడం తన విధిగా భావిస్తాడు.

ఇది తన కార్యాచరణంలో చంద్రశేఖర్ అవలంబించిన మరోమార్గం కావచ్చు కాని, నవల అక్కడకు ఆగిపోవడం చేత, అతడు నిజంగా ఏం చేసి ఉండేవాడో మనకు తెలియదు

భావ్ సాహెబ్ కుటుంబం విషయాల్లో మనుషులాడిన నాటకం ఎంతో ఉంది. కాని, యింతవఱకూ, ఈకథా భాగం ప్రధాన కథతో ఏదో ఆకస్మిక సంబంధం కలిగిన దాని లాగానే కనిపిస్తుంది అది అసలు కథతో ఎంతవఱకు కలుపబడి ఉండేదో మనకు తెలియదు కాబట్టి, యీకడపటి సాంఘికనవల ముగింపును కూడా మనమే ఊహించుకోవలసి ఉంటుంది.

ఈనవల లన్నింటినీ ఒక సాధారణ దృక్పధంతో చూచినప్పుడు మహారాష్ట్రలోని మధ్యతరగతి, క్రింది మధ్యతరగతులకు సంబంధించిన పదుల కొలది పాత్రలు గలిగి ముప్పయి అయిదు సంవత్సరాల మీద విస్తరించిన అరడజను కుటుంబాల జీవితగాథా చక్రాన్ని తన రచనలో వ్యక్తం చేసి, ఆవిధంగా మహారాష్ట్ర సాంఘిక చరిత్రను విశదం చేయాలని హరిభావ్ పథకం వేసుకొన్నట్లు మన కవగత మవుతుంది. ఈకాలంలో నవలనుండి నవలకు, స్త్రీల పరిస్థితి అభ్యుదయకరంగా మారడం మనం చూడగలం వాళ్ళకు చదువు చెప్పించడం, వాళ్ళ వివాహవయస్సు మెల్లగా పెరగడం, వితంతు వివాహాలు జరగడం, వితంతువులు పెండ్లాడ నప్పుడు వాళ్ళలో కొందఱు కనీసం ఉద్యోగమో, లేదా సంఘసేవనో చెయ్యగలగడం ఈ నవలల్ని బట్టి మనకు స్పష్టమవుతుంది ఇదంతా యధారాలను దృష్టిలో ఉంచుకొన్న చిత్రణం

సాంఘిక - రాజకీయ రంగంలో సాంఘిక, రాజకీయ సంస్కారాలకు సంబంధించిన విపరీత పరిస్థితులు వదలిపెట్ట బడకపోయినా, సవరించుకోబడి, జాతీయ జీవనానికి సంబంధించిన ఆర్థిక, పారిశ్రామిక విషయాలకు గూడా సమప్రాధాన్యం ఇవ్వబడింది

పారమార్థిక విషయాల మీదా, సాంఘిక రాజకీయ కార్యకలాపాలను పారమార్థిక చింతనతో మిళాయించడం మీదా శ్రద్ధ చూపబడింది.

కాని, యిది నవలలలోని సంఘప్రవృత్తికి సంబంధించింది కాని, నవలా రచయితగా హరిభావ్ సాదించిందేమి? మరాఠీ నవల కతని తోడ్పాటు ఎట్టిది? అనేదే మనకు ప్రసక్తమైన విషయం హరిభావ్ నవలలను అతని కాలానికి ముందు ప్రకటింప బడుతుండిన నవలలతోనూ, లేదా, అతని రచనావ్యాసంగం సాగుతున్న కాలంలో ప్రకటింపబడిన వాటితోనూ పోల్చి చూస్తే, అతనినవలలే జీవితానికి చాలా సన్నిహితంగా కనిపిస్తాయి వాటినతడే 'ఆజ్ కల్చ్యా గోష్టి' (సమకాలీన జీవిత కథలు) అని వ్యవహరించాడు. అతని నవలలు కొన్నింటిలో కనిపించే ఆదర్శవాదమూ, కాల్పనిక వాదమూ వాటిలోని పాత్రల ఆశయాలూ, కోరికల నుండి పుట్టినవేగానీ, ఎక్కడనో బైటనుండి రుద్దబడినవికావు. ఇది మళ్ళీ యథార్థంతో కూడినదే అతడు వాడే భాష కూడా దైనందిన జీవితంలోని భాషే దాన్ని హరిభావ్ ఎంతో పాత్రోచితంగా వాడాడు ప్రధాన

పాత్రలన్నీ వ్యక్తిత్వం ఉన్నవి స్థాణువుల వంటివికావు. పాత్రలను ఉత్తరోత్తరాభివృద్ధిగా క్రమోన్మీలితాలను చెయ్యడంలో ఎంతో నేర్పు ప్రదర్శించబడింది ఈనేర్పు ముఖ్యంగా యము, భావ్, తాయ్, యశ్వంత రావుల పాత్రల్ని చిత్రించడంలో బాగా విశదమవుతుంది

పాత్రల ఆలోచనలూ, వేదనలూ కొన్ని సందర్భాలలో చాలా సూక్ష్మంగా వింగడింపబడి, వివరింపబడ్డాయి. పాత్రలు జీవించి, పెరిగి, ప్రవర్తించిన పరిసరాలూ, దృశ్యాలు కూడా జీవితంతో సంవదిస్తూ ఎంతో సన్నిహితంగా ఉన్నాయి. "పణ్ లక్ష్యాన్ త కోణ్ ఘేతో" దీనికి ఉత్తమమైన ఉదాహరణం. కానీ, 'మీ' లోనూ, యశ్వంతరావ్ ఖరే లోనూ కూడా మనం దీన్ని చూడవచ్చు. యశ్వంతరావ్ ఖరే పూర్తి చేయ బడే ఉంటే, అది చాలావఱకు పణ్ లక్ష్యాన్ త కోణ్ ఘేతోను పోలి ఉండేది ఆ నవలలోని ప్రాతలు మఱింత నైపుణ్యంతో చిత్రింపబడ్డవి. యశ్వంతరావు పాత్రను మలిచిన శక్తులు మఱింత స్పష్టంగా నిర్ధారించ బడినవి.

హరిభావ్ నవలలు కొన్ని అసంపూర్ణంగా వదలి పెట్టబడినప్పటికీ, కొన్ని సంపూర్ణనవలలు అవి ఉండదగినంత సంతృప్తికరంగా ఉండక పోయినప్పటికీ, హరిభావ్ తరువాత మరాఠీనవల అంతకు ముందున్నటు వంటిదేమాత్రం కాదనీ, అందుకు మరాఠీ నవలారచనపై హరిభావ్ నవలలు ప్రసరింపజేసిన ప్రభావమే కారణమనీ చెప్పడానికేమాత్రం సందేహింప నక్కఱలేదు ఒకవైపు తరువాతికాలంలో వి ఎం. జోషి మొదలైన వారు వ్రాసిన చర్చానవలలకతడు దారియేర్పరచడమేగాక మఱొకవైపు తరువాత వచ్చిన వాస్తవిక నవలలు కూడా అతని కృషిచేత ప్రభావితాలు కావడం జరిగింది వ్యక్తిగతపాత్ర చిత్రణచేస్తూనే, ఆవ్యక్తుల కుటుంబాన్నొక సంఘభాగంగా నిరూపించడం సాంఘికనవలకతడు సమర్పించిన గొప్ప కానుక ఆధునిక నవలలెన్నింటిలోనో ఆయావ్యక్తులొక కుటుంబానికి సంబంధించిన వాళ్ళుగా కనిపించరు హరిభావ్ నవలల్లో వ్యక్తిగత పాత్ర కుటుంబంలోని ఒక భాగంగా, ఆకుటుంబంలో పుట్టిన వ్యక్తిగా కనబడుతుంది. అతడుగానీ, ఆమెగానీ కుటుంబపరిస్థితులచేత, (ఐశ్వర్యంచేత) ప్రభావితు లవుతారు ఈ కుటుంబంద్వారా మనకు సువిశాలమైన సంఘంమెఱుపులాగా కనిపిస్తుంటుంది. కుటుంబమనేది నిబిడమైన సంఘంలో ఒకభాగం. హరిభావ్ నవలల్లోని కుటుంబాలు తప్పనిసరిగా సంఘానికి సంబంధించిన క్షీణదశకు చెందినవిగానీ, మార్పులేనివిగానీ, చైతన్యయుతములైనవిగానీ

అయిన అంశాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అంతేగాక ఆ కుటుంబాలలో ఒకదాని ప్రభావం మఱొకదానిమీద పడుతుంటుంది. ఈదృక్పథంతో చూచినప్పుడు హరిభావ్ నవలలు నిజమైన సాంఘిక నవలలు.

---

# 4. హరిభావ్ ఆప్టే నవలలు - చారిత్రకం

హరిభావ్ సాంఘిక నవలలు పదకొండు వ్రాసినట్లే, చారిత్రకేతి వృత్తాలను స్వీకరించి కూడా పదకొండు నవలలు వ్రాశాడు. అది అనుకొన కుండా జరిగిన చిత్రమైన సంఘటన మఱి! ఇతరమైన విచిత్ర సంఘటనలు కూడా ఉన్నాయి. ఆయన సాంఘిక నవలల పరిగణన జరిగేటప్పుడు "చాణాక్షపణాచాకళస" (1889-90) అనే నవల - అది ఒక ఫ్రెంచి నవ లకు అనువాదమయిన ఆంగ్లరచనకు తర్జుమా కాబట్టి వదలి పెట్టబడింది.

మైయ్ సూర్చావాఘ్ - (మైసూరు పులి) అనే హరిభావ్ యొక్క మొదటి చారిత్రక నవలను కూడా వదలి వేయవచ్చు అది కొలోనల్ మెడోస్ టేలర్ వ్రాసిన టిప్పు సుల్తాన్‌కు అనువాదం కావడమే అందుకు మొదటి కారణం. అది మూలానికి సంగ్రహరూపం కావడం, అదికూడా డొంక తిరుగుళ్ళతో అసంపూర్ణంగా ఉండడం రెండవకారణం.

మిగిలిన పది నవలల్లో ఆఱు నవలలు మరారా చరిత్ర నుండి గ్రహింపబడిన విషయాలతో నడిచేవి. అందువల్ల ఆయన్నింటినీ కలిపి పరామర్శించడం మంచిది ఈ పరామర్శలో ఆనవలల ప్రకటన క్రమం కాకుండా, వాటిలోని చారిత్రక సంఘటనల కాలానుక్రమం మాత్రమే పరిగణింపబడుతుంది ఆ చారిత్రక నవలలివి ! (1) ఉషఃకాల్ (2) సూర్యో దయ (3) సూర్య గ్రహణ్ (4) గడ్ ఆలాపణ్ సింహా గేలా (5) కేవల్ స్వరాజ్యా సాఠీ (6) మధ్యాహ్న. ఈ ఆఱింటిలో సూర్యగ్రహణ్ మధ్యాహ్న - అసంపూర్ణాలు

మహారాష్ట్రంలో మొత్తం మీద మరారా చరిత్రలోనూ, ప్రత్యేకించి శివాజీ మీద పందొమ్మిదవ శతాబ్దపు రెండవ భాగంలో శ్రద్ధ ప్రబలింది. ముఖ్యంగా గ్రాంట్ డఫ్ వ్రాసిన 'హిస్టరీ ఆఫ్ మరారాస్' అనే గ్రంథం,

దానిని గురించి జనార్దన్ కీర్తనే వ్రాసిన విమర్శ ప్రకటింపబడిన తరువాత ఆ విధమైన శ్రద్ధ పుట్టడం జరిగింది అనాడు దేశవ్యాప్తంగా కలిగిన జాతీయతా భావ జాగృతికి అనుషంగికంగా కలిగిన ఫలితమిది బ్రిటిష్ ప్రభుత్వ ప్రశంసకు సంబంధించిన మొదటి ఉద్ధృతి కొంత తగ్గిన తరువాత, ఆలోచనా పరులైన నాయకులు మన రాజకీయ దాస్యానికైన కారణాలను గురించీ, రాజకీయ స్వాతంత్ర్యాన్ని మరలా సంపాదించుకోవడానికి తగిన సాధనాలను గురించీ అన్వేషించ నారంభించారు అందుకు సాంఘిక రాజకీయ సంస్కారం, స్త్రీ పురుష విద్యావ్యాప్తి, పరిశ్రమలు నెలకొల్పడం, రాజకీయాధికారం కోసం పోరాడడం వంటి అనేక పరిష్కార మార్గాలు సూచింపబడ్డాయి అటువంటి సాధనాలలో ప్రజల్లో జాతీయమైన ఆత్మ గౌరవాన్ని కలిగించడం, హిందూదేశ చరిత్ర నుండి అందుకు తగిన ప్రోత్సాహాన్ని పొందడం కూడా ఉన్నాయి

1895 ఏప్రిల్ నెలలో తిలక్ గారి 'కేసరి' పత్రికలో శివాజీని గురించిన వ్యాసాలు రాసాగాయి అయన ప్రోత్సాహంతో మొదటిసారిగా 1896లో రాయ్‌గడ్ మీద ఎంతో ఉత్సాహంతో శివాజీ జన్మదినోత్సవం జరుపబడింది అవిధంగా శివాజీపట్ల, మరాఠా చరిత్రలోనూ శ్రద్ధచూపే ఒక కొత్తశకం ప్రారంభింపబడింది. ఈనాటికీ అశ్రద్ధ కొనసాగుతూనే ఉన్నది ఈశక్తులే శివాజీ జీవితాన్నీ, ప్రవర్తనను గురించి నవలలు వ్రాయడానికి హరిభావ్‌ను ప్రేరేపించాయని నమ్మకంగా చెప్పవచ్చు 1895 - 97లలో హరిభావ్ వ్రాసిన మొదటి చారిత్రకనవలైన 'ఉషఃకాల్' అయన శివాజీని గురించి వ్రాసిన నవలల్లో మొట్టమొదటిది

శివాజీ కాలం వరకు, మూడు శతాబ్దాల కాలం మరాఠా ప్రభువులు తమ జాగీరు భూములతో, తమ ఆజ్ఞలో ఉన్న సైన్య సమూహాలతోనూ తమ భూములూ, హక్కులూ తమకు దక్కనిచ్చినంత వరకు ఇష్టపూర్వకంగా మహమ్మదీయ పాలనకు లోబడి, ఏమాత్రం పశ్చాత్తాపం లేకుండా సుల్తానునుండి సుల్తానుకు తమ రాజభక్తిని మార్చుకోవడానికి సిద్ధంగా ఉండేవాళ్ళు ఈభూమికి ఒకప్పటి పరిపాలకులైన హిందూ ప్రభువులు ఇతరుల ఆధిక్యానికి గురికావడం వాళ్ళకు బాధగా అనిపించలేదు హిందువులు, హిందూమతమూ అవమానింప బడడం వాళ్ళకు తెలియక కాదు; కాని అందువల్ల వాళ్ళు తలక్రిందులు కాలేదు శివాజీ తండ్రి శహాజీయే యిందుకు తగిన ఉదాహరణం వీరయోధుడూ, సేనానాయకుడూ, సమర్థుడైన పరిపాలకుడూ అయిన అతడు అహమ్మద్ నగర్, బిజాపూర్ సుల్తా

నులకు అవసరమైనప్పుడు తన సహాయాన్ని అందిచ్చాడు. అయినా ఉత్సాహ పూరితులైన ఆనాటి వారిలో ఆయనా ఉన్నాడు

కాని, శివాజీ భిన్నమైన వ్యక్తి. అతడు తన తల్లి, దాదాజీ కొండేవ్‌ల శిక్షణలో స్వతంత్రంగా పెరిగాడు క్రమంగా హిందువులు ఆత్మ గౌరవంతో, నిర్భయంగా జీవించగల ఒక స్వతంత్ర రాజ్యాన్ని తానే స్థాపించుకోవాలన్న కోరికను పెంపొందించుకొన్నాడు అది తన విధిగా భావించసాగాడు తాను పెరుగుతున్నకొలదీ తనవంటి ఆలోచనలున్న యువకులను, బీదలైన బెదరులేని సహ్యాద్రి పర్వతాల్లోనివసించే మావలులతోసహా పోగుచేయ నారంభించాడు తన కార్యానికనుకూలంగా పెద్దలైన మరాఠాప్రభువుల సానుభూతి సహాయాలు సంపాదించడానికి ప్రయత్నించాడు. కాని అతని అభిప్రాయాలను, తిరుగుబాటు పథకాలను వాళ్ళు ఆదరించలేదు తమ స్థానాలనుండి తమ్మకదల్చవద్దన్నారు. ఇది స్వాతంత్ర్యప్రియులూ, తిరుగుబాటుదారులూ అయిన యువకులకూ తమ స్థానాల్లో స్థిరపడిఉన్న పెద్దతరంవారికీ మధ్య ఘర్షణలకు దారి తీసింది. ఈ రెండు తరాలవారి ఘర్షణలను చిత్రీకరించేదే ఉషఃకాల్ నవల

1647లో తన పదిహేడేండ్ల వయస్సులోనే టోర్నాకోటను సాధించిన శివాజీ మొదటిసాహసకార్యానికి సంబంధించిన వర్ణనను ఈనవల వివరించి చెబుతుంది నవలలో కోటపేరు సుల్తాన్‌గఢ్‌గా మార్చబడింది. శివాజీ, తానాజీ, ఎశాజీ, బిజాపూర్ సుల్తాన్, రణదుల్లాఖాన్‌ల పాత్రలు తప్ప కడమ పాత్రలన్నీ యించుమించు కల్పితాలే

సుల్తాన్‌గఢ్‌కు రంగారావ్ అప్పాఖిల్లేదారు బిజాపూర్ సుల్తాను తరఫున అతని ప్రతినిధిగా అతడు దానికాధిపత్యం వహిస్తాడు అతని కొడుకు నానాసాహెబ్ శివాజీపట్ల సానుభూతి చూపుతాడు నవల సుల్తాన్ గఢ్‌లో జరిగిన ఒక నాటకీయ సంఘటనతో ప్రారంభమవుతుంది. బిజాపూరు నుండి గౌరవార్థం పంపబడిన దుస్తులొక శుభసమయంలో నానా సాహెబుకు బహుకరించవలసి ఉంటుంది నానాసాహెబు వాటిని స్వీకరించ డానికి తిరస్కరిస్తాడు. తండ్రి, కొడుకుల మధ్య తీవ్రమైన వాగ్వాదం జరుగుతుంది కొడుకైన నానాసాహెబు శివాజీ మిత్రకోటిలో చేరడానికై కోట విడిచి పెడతాడు ఆతరువాత తానాజీతో కలిసి ఒక పనిమీద బిజాపూరు వెడతాడు.అక్కడతడు ఖైదు చేయబడతాడు. కానీ, బిజాపూరు ఆస్థానానికి చెందిన రణదుల్లాఖాన్ కూతురైన మెహెర్ జాన్ పలుకుబడివల్ల విముక్తుడవుతాడు. తరువాత శివాజీ ఒక దండయాత్ర సాగించి, తానాజీ,

ఎకాజీ, నానా సాహెబ్ మావలుల సాయంతో సుల్తాన్ గఢ్ కోటను సాధి స్తాడు  ఈ విజయంతో కథ ముగిసిపోతుంది

ఇది కథ యొక్క అస్థిపంజరం మాత్రమే  ఈ రెండు సంఘటన లకూ మధ్య నవలా విషయాన్ని సమకూర్చి, దానికి రక్తమాంసాలు కలిగిన రూపాన్నీ, ఆత్మనూ ప్రసాదించేవెన్నో జరుగుతాయి.

భూగృహాలలో జరిగిన సమాలోచనలూ, సొరంగమార్గాల్లో ప్రయా ణాలూ, సమాచార సేకరణకై గూఢచారులు మాఱువేషాలలో తిరగడం, శివాజీ ధ్యాన సమాధిలో భవానీదేవిని దర్శించడం, ఆమె నుండి సందేశాలు పొందడం మొదలైనవెన్నో యిందులో ఉన్నాయి. వీటితోపాటు ఆడ వాళ్ళ నెత్తుకుపోవడం, లేదా క్లిష్టపరిస్థితుల్లో త్రోయడం, వాటినుండి వాళ్ళు తప్పింపబడడం, లేక వాళ్ళంతట వాళ్ళే తప్పుకోవడం, ఎట్టి పరి స్థితుల్లోనూ తమ శీలానికి భంగం కలగనివ్వకపోవడాలు కూడా ఉన్నాయి. వాళ్ళ మహోత్సాహం, ఉపాయశాలిత ఉన్నవాళ్ళు.  ఇదంతా ఆ కాలపు పరిస్థితులకూ, మనః ప్రకృతికీ అనుగుణమైన కథనం.  అన్ని సంఘటనలూ, మనో వ్యాపారాలూ భూతకాలాన్ని సజీవంగా సాక్షాత్కరింప జేయగలంత సమర్థంగా చిత్రింపబడ్డాయి

పెద్దతరం వారికీ, యువతరం వారికీ మధ్యగల వ్యత్యాసంలాగానే. వ్యక్తిగత పాత్రల మధ్యగల వ్యత్యాసం గూడా సువ్యక్తం చెయ్యబడింది, ఉదాహరణకు శివాజీ ఒక అజన్మ నాయకుడు  ప్రజలకు ఆత్మవిశ్వాసాన్ని కలిగించి, వాళ్ళందఱనూ సంఘటిత పఱచగలిగిన కార్యనిర్వహణశక్తి ఆయనకున్నది. తన స్నేహితుల యొక్క, అనుయాయుల యొక్క దృఢాభి మానాన్ని పొందగలిగాడు. ధైర్యవంతుడు. రానున్న ఏ ఆపద నెదుర్కోవడానికైనా సంసిద్ధుడు.  మనుష్యులనూ, పరిస్థితులనూ చక్కగా అంచనా వేయగలడు.  గంభీర స్వభావుడు.

నవలలో కొన్ని దోషాలున్నాయి.  అవి సాంఘిక చారిత్రకాలైన హరిభావ్ ఇతర నవలల్లో కూడా కనిపిస్తాయి.  పాఠకులకు తెలియకుండా, వ్యక్తుల పేర్లను మర్మంగా ఉంచడమంటే అతనికి చాల యిష్టం.  అదే విధంగా, లఘుపాత్రలకూ, అప్రధాన సంఘటనలకూ, ఉపకథలకూ లేని పోని ప్రాధాన్యాన్నిచ్చే మొగ్గుకొంత ఆయనలో కనిపిస్తుంది.  సాధారణంగా ఒకానొక సంఘటనకు సంబంధించిన కథనాన్ని మధ్యలో ఆపివేసి, అనేక అధ్యాయాల తరువాత మళ్ళీ ఆ కథా సూత్రాన్ని అందుకొంటుంటాడు.

పాఠకులను మఱీ ఎక్కువసేపు నిరీక్షింపజేశానన్న సంగతినాయన తఱచుగా మఱచిపోతుంటాడు ఒక్కొక్కప్పుడు పునరుక్తికి పాల్పడతాడు. విసుగు పుట్టిస్తాడు.

కానీ, యీ దోషాలున్నప్పటికీ నవల దానిలోని జీవలక్షణం చేత మెప్పిస్తుంది తృప్తి కలిగిస్తుంది పాత్రలు వాస్తవికమైనవైనా, కల్పిత మైనవైనా, ప్రాణవంతాలై అయా నమూనాలకు సరిగ్గా సరిపోతాయి. నవలలో ఆ కాలపు వాతావరణం, పరిస్థితులు, ఉత్సాహధోరణులకు సంబం ధించిన యధార్థత ఉంది 'పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో?' ఆనాటి సంఘ జీవితానికి సంబంధించిన ఆయన ఉత్తమ నవల అయినట్లుగా, మరాఠా చరిత్రకు సంబంధించి, ఉషఃకాల్ ఆయన ఉత్తమ నవలగా అభివర్ణించ వచ్చు.

శివాజీ జీవిత సంఘటనలతో వెలసిన నవలలన్నింటికీ ఆధారభూత మైన రచన కాబట్టి "ఉషఃకాల్" నవలకు సంబంధించిన నేపథ్యం వివరణ చాలా విపులంగా సాగింది. దీని తరువాత మనం గ్రహింపదగిన నవల సూర్యోదయ (1905 - 1906) శివాజీ చేతిలో అఫ్‌జల్ ఖాన్ మర ణించడం ఇందులోని విషయం శీర్షిక గమనింపదగింది ఉషఃకాల మంటే వేకువ సూర్యోదయమంటే వేబోక తరువాతి వేవెలుగు ఉదయం. పెద్దతరానికి చెందిన మరాఠా ప్రభువులూ, సుల్తానులూ అనుకొన్నట్లు ఇప్పుడు శివాజీ వాళ్ళకు కేవలం కష్టాలు కల్పించేవాడు మాత్రమే కాదు. అతని పలుకుబడి పెరిగింది. విజయవంతంగా ఎన్నో ముట్టడులు కొన సాగించాడు. మఱెందఱో అనుయాయుల్ని, సైన్యాన్ని, యుద్ధ సాధనా లను సంపాదించి, కొంత ప్రదేశాన్ని తన అధికారం క్రిందికి తెచ్చు కొన్నాడు అందుచేత బిజాపూర్ సుల్తాను దృష్టికి అతడు ప్రబల విరోధిగా కన్పడ్డాడు అందుచేత, శివాజీని ప్రాణంతో పట్టిగాని, చంపిగానీ తీసుకు రావడం కోసమై అఫ్‌జల్‌ఖాన్ నియోగింపబడ్డాడు అఫ్‌జల్‌ఖాన్ ఉద్దేశం తెలిసి, పరిస్థితి నెదుర్కోవడానికి శివాజీ సిద్ధంగా ఉన్నాడు. వాళ్ళిద్దఱి మధ్యా ఒక సమావేశం ఏర్పాటు చేయబడింది. ప్రతాప్ గఢ్ మొగదలలో మట్టమధ్యాహ్నం వాళ్ళిద్దఱూ కలిశారు. అఫ్‌జల్‌ఖాన్‌ను శివాజీ హత మార్చాడు.

మొదట శివాజీ తలను తన యెడమ చంకలో ఇఱికించి శివాజీ వీపు మీద కత్తి గ్రుచ్చినవాడు అఫ్‌జల్ ఖానే. కాని, సంగతి ముందే తెలిసిన శివాజీ అటువంటి హత్యా ప్రయత్నం నుండి లాఘవంగా తప్పించుకొని,

వెంటనే వెన్నుతాకేటట్టుగా అఫ్జల్ ఖాన్ కడుపులో కత్తితో పొడిచి, ఆ పిదప అతని శిరస్సు ఖండించి పారేశాడు

ఈ సంఘటన గొప్ప చారిత్రక ప్రాధాన్యం కలిగింది కావచ్చు కాని, అది చిన్న సంఘటన మాత్రమే. అందుచేత కథకు కొంత పుష్టి చేకూర్చడం కోసం అసలు కథకు సమాంతరంగా నడిచే ఉపకథనొక దానిని హరిభావ్ సృష్టించాడు నాలుగు సంవత్సరాలకు మునుపు 1655లో చంద్రారావ్ మోరే అనే ఒక పలుకుబడిగల మరాఠీని ప్రతాప్ గఢ్ పరిసరాల్లో శివాజీ మనుషుల్లో ఒకరు అంతమొందించారు. రాజకీయ కారణాలవల్ల అది జరిగింది ఈ నవలలో హరిభావ్ చంద్రారావ్ మోరే కూతురయిన తారా బాయ్ - అనే కల్పిత పాత్ర తన తండ్రి చావుకు శివాజీ మీద పగ తీర్చుకోవడానికై పథకం వేసేటట్లు చేశాడు కాని యీ పథకాన్ని గురించిన కథనం ఈ నవల్లో చాలా భాగాన్ని ఆక్రమించేసి, ప్రధాన కథను మింగేసింది ప్రధానమైన కథా కథనాన్ని అడ్డగించి, విసుగు పుట్టించే సుదీర్ఘమైన వ్యవధి తర్వాత మళ్ళీ కథలోకి వచ్చే హరిభావ్ ధోరణికి ఉదాహరణం ఈ నవలలో చూడవచ్చు

అఫ్జల్‌ఖాన్ పాత్ర చిత్రణం, శివాజీ దూతఅయిన గోపీనాథ్ పంత్ చూపిననేర్పు - సమావేశానికి ముందు వర్ణింపబడిన శివాజీ యొక్క, అతని తల్లి జిజాబాయ్ యొక్క భావాలూ, శివాజీ అఫ్జల్‌ఖాన్‌ను కలుసుకోవలసిన నాటి ముందటి రాత్రి శివాజీకి అతని తల్లికి కలిగిన వ్యాకులపాటు ఎంతో గొప్పగా వర్ణింపబడినవి ఆ కలిగే విసుగు నుండి మన్ని తప్పించి కాపాడే లక్షణాలివే.

1908 - 1909 నాటి సూర్యగ్రహణ్ నవల (సూర్య గ్రహణము) 1666 లో శివాజీ ఆగ్రాకు వెళ్ళడం, అక్కడ ఖైదుకావడం, ఖైదునుండి, తప్పించుకొని మహారాష్ట్ర చేరడం అనే విషయాలకు సంబంధించింది. నవల అసంపూర్ణం జైసింగ్ 1665లో తన మీద బలవంతంగా రుద్దిన సంధిని వేటే దారిలేక శివాజీ అంగీకరించ వలసివచ్చింది. ఆ సమయంలో శివాజీ యెంతో అశాంతి పాలైయుండాలి. హరిభావ్‌కు శివాజీ మనస్సులో జరుగుతున్న అంతర్యుద్ధాన్ని గొప్పగా వర్ణించి చూపదగిన మంచి అవకాశమిది. కాని, అతడా అవకాశాన్ని వినియోగించుకోలేదు. బదులుగా ఎత్తుకు పోబడుతున్న ముగ్గురు యువకులను శివాజీ ఆపదనుండి తప్పించిన మూడు సంఘటనలను వర్ణించాడు శివాజీ పాత్రకు సంబంధించిన అనే

కాంశాలు అభివ్యక్తమయ్యే నాటకీయ సంఘటనలతో నిండిన యితివృత్తాన్ని హరిభావ్ తగినట్లుగా వాడుకోలేదని ఎవరికైనా చెప్పక తప్పదు.

గడ్ ఆలా పణ్ సింహ్‌గేలా (1903) అనే రచన 1670లో తానాజీ సింహగఢ్‌ను పట్టిన విషయానికి సంబంధించిన నవలిక సింహగఢ్ శివాజీ జాగీరు లోపలి భూభాగమే కాని, అది యెన్నోసార్లు చేతులు మారి, శివాజీ కాలానికి మొగలుల చేతికి వచ్చింది సింహగఢ్‌లోని అప్పటి మొగలుల ప్రతినిధి 'ఉదయభాను' అనే రాజపుత్రుడు జిజాబాయ్, శివాజీ లిద్దఋా ఆ కోట శత్రువు అధీనంలో ఉన్నందు కెంతో బాధపడ్డారు. అందువల్ల శివాజీ ఆ కోటను మళ్ళీ సంపాదించాలని నిర్ణయించుకొన్నాడు. 1670 ఫిబ్రవరి 4 రాత్రి తానాజీ, మూడువందలమంది మావలులు ఒక త్రాటి సాయంతో ఎత్తైన కొండమీదికి చేరి, అందఋా కొండకొన చేరిన వెనుక ఆ త్రాటిని కత్తిరించేశారు మూడు గంటలపాటు సాగినముమ్మర మైన యుద్ధంలో కడకు కోట మరారాలవశమయింది యుద్ధంలో తానాజీ, ఉదయభాను - ఇద్దఋా మరణించారు. అఫ్‌జల్ ఖాను విషయం లాగానే యిది కూడా చిన్నకథ ఒకనవలకు సరిపడినంత విషయం కాదు దాన్ని బలపఅచడం కోసం హరిభావ్ దానికొక కాల్పనికాంశాన్ని జోడించాడు అదే కమలకుమారి కథ కమలకుమారి ఒక రాజపుత్ర వితంతుయువతి ఉదయభాను ఆమె నెత్తుకుపోయి సింహగఢంలో ఉంచు తాడు. సహగమనం చెయ్యడానికి సిద్ధంగా ఉన్న ఆమెను తానాజీ వచ్చి కాపాడతాడు

ఈ కథయొక్క పరిధి చిన్నది కథపట్టనన్ని సంఘటనలు లేవు. అద్భుత సాహసాంశాలు చక్కగా సమ్మిశ్రితమై ఉన్నాయి. కథాసంఘటనలు రూపుతీరి ప్రముఖంగా కనిపిస్తాయి శివాజీ, తానాజీ వంటి ప్రధాన పాత్రల చిత్రణం గొప్పగా ఉంది. కథ మొదటి నుండీ పాఠకుణ్ణి ఆకర్షిస్తుంది జారి పోనీకుండా అతని శ్రద్ధను కాపాడి అది ప్రారంభమైన చోటనే భిన్నమైన ఒక ఉన్నత స్థాయిలో అంతమవుతుంది. మొత్తంమీద, హరిభావ్ వ్రాసిన నవలల్లో ఉత్తమమైన వాటిలో ఇదొకటి మరాఠీలో అతడు వ్రాసిన చారిత్రక నవలల్లో దీన్ని మించగలిగింది ఉషఃకాల్ ఒక్కటే

శివాజీ జీవిత ప్రవృత్తికి సంబంధించిన యీనాలుగు నవలల్నీ కలిపి పరిశీలిస్తే మనకు కొన్ని విషయా లెఱుకపడతాయి. శివాజీ గొప్పనాయ కుడుగా, పరప్రభుత్వధాటి నుండి ప్రజలను తప్పించిన వీరుడుగా చిత్రింప బడాడే కాని, దైవంగా రూపొందించ బడలేదు. ఆకాలపు వాతావరణాన్ని,

చైతన్యాన్ని పునస్సృష్టించి చూపే ప్రయత్నం విజయవంతంగా చెయ్యబడింది. లభ్యమౌతున్న చారిత్రకాధారాలతో మృతమై పోయిన భూతకాలం మళ్ళీ సజీవంగా ప్రత్యక్షం వేయబడింది శివాజీకి అనుకూలంగా గానీ, ప్రతికూలంగా గానీ కల్పింపబడిన పాత్రలు గాని, సన్నివేశాలు గానీ, ఆ కాలపు సాంఘిక చైతన్యాన్ని దృష్టిలో ఉంచుకొని సృష్టింప బడినవే

కేవల్ స్వరాజ్యా సాఠీ (1898 - 1899) 1689 లో మొగలులు శంభాజీని బంధించి క్రూరంగా చంపినప్పుడు కలిగిన గందరగోళాన్ని చిత్రించే రచన ఆయన భార్య ఏసుబాయ్‌నీ, కొడుకు షాహును మొగలులు ఖైదు చేశారు. ఫలితంగా మరాఠాకు సంబంధించిన విషయాలన్నీ తాఱుమారయ్యాయి శివాజీ రెండవ కొడుకు రాజారాం అప్పటికి పందొమ్మిదేండ్లవాడు. అతడు మంచి నిజాయితీ పరుడేగానీ, సమర్థుడుకాడు మనుష్యుల్ని అంచనా వెయ్యడం చేతకాని వాడు అతని చుట్టూ ఉన్న మనుష్యుల్లో చాలామంది వట్టిచెత్తరకం రాజారాం రాయగఢ్ విడిచి, దక్షిణాదిని మద్రాసుకు సమీపానగల జింజికి పాఱిపోయాడు. కాని రాయగఢ్‌లో మిగిలిన వాళ్ళలో కొందఱు శివాజీ రాజ్యం ఛిన్నాభిన్నం కాకుండా కాపాడడానికి వీరోచితమైన ప్రయత్నాలు చేశారు

ఈనవలలో ఇంతకంటె యథార్థమైన చారిత్రక సంఘటనలున్నవి. నిజమైన చారిత్రక పురుషులున్నారు శంభాజీనిపట్టి బంధించడం, చంపడం, శంభాజీ భార్యా పుత్రుల ఖైదు చెయ్యడం మరాఠాలను సవాలుచేసే విషయాలు. మరాఠీలు కూడా తమ మీదికి నేరంరాకుండా ఆసవాలు నెదుర్కొని మెచ్చుకోదగినట్లుగా తమ సత్తాను ఋజువు చేసుకొన్నారు రాజ్యరక్షణ కోసం చాలామంది మరాఠీ స్త్రీలు పరదాత్యజించి బయటి ప్రపంచంలోకి వచ్చారు ఆవిధంగా గ్రంథకర్త సత్ప్రయోజనాలకు వినియోగించుకోదగిన సంఘటనలెన్నో జరిగాయి కాని రచయిత వాటి నుపయోగించుకోలేదు. నవలలో మూడు సందర్భాలున్నాయి (1) శంభాజీ పట్టుపడడం, క్రూరమైన దైనా వీరోచితమైన అతని మృత్యువు (2) రాయగఢ్ ముట్టడి, దాని పతనం (3) రాజారాం జింజికి పాఱిపోవడం అక్కడనుండి మరాఠా రాజ్యాన్ని కాపాడడానికై అతడు చేసిన ప్రయత్నాలు వ్యక్తిగతంగా ప్రత్యేకించి చూస్తే ఈ సంఘటనలన్నీ బాగానే సంబాళింప బడినవి. నేర్పు ఉట్టిపడేటట్లు వర్ణింపబడినవి కాని, భిన్న భాగాలు సరిగా కలుప బడియుండి, ఒక యేకతా భావాన్ని కలిగించడంలేదు.

మొత్తంమీద శంభాజీ, రాజారాంల పాత్రలు బాగానే చిత్రింపబడినవి. శంభాజీ ఆత్మగౌరవం, వీరోత్సాహం, అతడు మృత్యువునెదుర్కొన్నతీరు, కలగుండుపడిన రాజారాం మనఃస్థితి విశదంగా వర్ణింపబడినవి. ఈ నవలలో గుణవిశేషాలుగా చెప్పుకోదగినవివే

మధ్యాహ్న (1906 - 1907) మరాఠా చరిత్రలోని సంఘటనలకు సంబంధించిన హరిభావ్ యొక్క ఆఖరి నవల ఈనవల. పద్దెనిమిదవ శతాబ్దంలోని చతుర్థపాదంలో ఇంచుమించు ఇరవైసంవత్సరాల చరిత్రను ప్రదర్శిస్తుంది! మధ్యాహ్నం అంటే సూర్యుడు నడునెత్తిమీది కొచ్చిన సమయం. (పట్టపగలు పంౘ్రెండు గంటల సమయం.) ఇది 1773 లో పీష్వా నారాయణరావ్ హత్యతో ప్రారంభమై 1795 లో ఖార్డా యుద్ధంలో సంఘటిత మరాఠా బలాలు నిజామునోడించి విజయాన్ని చేపట్టిన దశతో ముగిసే పీష్వాల చరిత్రలోని అతిక్లిష్టమైనకాలాన్ని సూచిస్తుంది. నవల అసంపూర్ణం. నవలకీపేరు పెట్టడంలో హరిభావ్ ఉద్దేశమేమిటో చెప్పడంకష్టం. ఈ పేరు పెట్టడంలో, ఆకాలంలో పీష్వాల అధికారం, గొప్పదనం తారస్థాయి నందుకొన్నట్లు హరిభావ్ అభిప్రాయమా, లేక 1795 లో నిజాముమీద విజయం సాధించిన తర్వాత ఆస్థితియేర్పడిందన్న అభిప్రాయమా? అని ప్రశ్నించవచ్చు ఈదశలో నవల అసంపూర్ణంగా వదలిపెట్టబడింది ఈ విషయాన్ని గురించి హరిభావ్ ఏమీ చెప్పలేదు, నవలకూడా ముందుకు సాగలేదు నవలలో కడపటి అధ్యాయం పూర్తయిందో లేదోకూడా మనం చెప్పలేం

నవలా నిర్మాణంలో మూడుభాగాలు కనబడతవి నిజానికి ఎడతెగకుండా సాగే ఒక కార్యక్రమంలో అవి మూడుదశలు. ప్రామాణికమైన యెన్నో వివరాలు దొరుకుతున్నప్పటికీ, నవల పాఠకుని మనస్సుమీద ఎటువంటి శాశ్వతముద్రనూ వేయదు. అలవాటు ప్రకారం హరిభావ్ లఘు పాత్రలకు, సంఘటనలకూ ప్రాధాన్యం ఇస్తాడు ఈసన్నివేశాల్లూ, పాత్రలూ ఆకర్షకంగా చిత్రింపబడిన సంగతితప్ప, ఈనవలను గురించి చెప్పుకోదగిన మరో విశేషంలేదు

1761 లో పానిపట్టు యుద్ధంలో కలిగిన ఓటమి మొత్తంమీద మరాఠాల అధికారానికీ, ప్రత్యేకించి పీష్వా ప్రభుతకూ చావుదెబ్బ 1761 లో నానాసాహెబు వారసుడుగా రాజ్యానికి వచ్చిన మొదటి మాధవరావు ఆత్మశక్తి కలిగిన వ్యక్తికాబట్టి, రాజ్యవిషయాలలో కొంత సామరస్యాన్ని సాధించ గలిగాడు. కానీ, అతడు 1772 లో క్షయరోగంతో మరణించాడు.

తరువాత రాజ్యానికి వచ్చిన అతని తమ్ముడైన నారాయణరావు 1773 లో దారుణంగా హత్య చేయబడ్డాడు అతని భార్య గంగాబాయ్ అప్పుడు గర్భవతి మగశిశువు పుట్టడం జరిగితే అతడే పీష్వాసింహాసనానికి నిజమైన వారసుడు. కాని, నారాయణరావు మరణం తర్వాత అతని పినతండ్రి రఘునాథరావు పీష్వా కావడానికి ప్రయత్నించసాగాడు సంస్థానంలోని రాజనీతి వేత్తలందరూ రఘునాథరావు పథకాలను భగ్నం చెయ్యాలని తమలో తాము ఒక ఒడంబడికను కుదుర్చుకొన్నారు కాని, త్వరలోనే వాళ్ళల్లో విభేదాలు తలెత్తాయి ఈలోపల నారాయణరావు భార్య అయిన గంగాబాయికి కొడుకు పుట్టడం, ఆతడు పీష్వాగా ప్రకటింప బడడం జరిగింది. ఇతడే రెండవ మాధవరావు కానీ, అసలైన అధికారం నెఱపినవాడు నానా ఫడ్నవీస్ అతని జీవితంలోని ఉచ్చదశ ఖార్డా యుద్ధంలో పొందిన విజయమే అని చెప్పవచ్చు.

ఆవిధంగా, మరాఠా చారిత్రకేతివృత్తం కలిగిన ఆ నవలల్లో ఉషఃకాల్, గడ్ ఆలా పణ్ సింహ్‌గేలా - అనే రెండు నవలలు మాత్రమే నిజంగా విజయవంతమైన నవలలయ్యాయి. వీటినే యీ నాటికీ బాల బాలికలూ, పెద్దలూ శ్రద్ధతో చదువుతారు

హరిభావ్ వ్రాసిన తక్కిన నాలుగు చారిత్రక నవలలూ హిందూదేశ చరిత్రలోని భిన్నకాలాల సంఘటనల మీద ఆధారపడినవి. అవి ఒక రాశికి చెందినవి కావు కాబట్టి, అవి వ్రాయబడిన కాలక్రమాన్ని బట్టి వాటిని పరిశీలింపవచ్చు. అవి రూప్ నగర్చీ రాజకన్యా (1900 - 1902), చంద్రగుప్త (1902 - 1904), కాలకూట్ (1909 - 1911) (అసంపూర్ణం), వజ్రాఘాత్ అనేవి.

## రూప్‌నగర్చీ రాజకన్యా (1900 - 1902)

ఈ నవల ఔరంగజేబు జీవితకాలంలో జరిగిన రూప్‌నగర్ ముట్టడికి సంబంధించిన ఒక కథ మీద ఆధారపడింది దీనికాధారం హరిభావ్‌కు టాడ్ వ్రాసిన "అనాల్స్ ఆఫ్ రాజస్థాన్" లో లభించింది నవలలో చాలా భాగం ఔరంగజేబు జనానాలోని కుతంత్రాల వివరణకే సరిపోయింది. మొగలుల పరిపాలనా కాలంలో ఇండియాకు వచ్చిన "మానుచ్చి" అనే ఇటాలియన్ యాత్రికుని రచనల్లో హరిభావ్‌కు ఇందుకు కావలసిన వివరాలు దొరికాయి ముఖ్యమైన వ్యక్తులు చారిత్రక పురుషులు, సంఘటనలు చారిత్రకాలు తక్కినవన్నీ ఊహ కల్పితాలు.

రాజకన్య రూపామతి, రూప్‌నగర్ ప్రభువైన రాజా విజయ సింగ్ కూతురైన రాజకుమారి. ఆమె పెండ్లీడు కొచ్చిన గొప్ప అందగత్తె. కానీ, ఆమెకు తల్లిలేక పోవడంవల్ల ఎక్కువకాలం తనతండ్రితోనే గడిపేది. అతడా మెను దర్బారుకు కూడా వెంటబెట్టుకొని వెళ్ళేవాడు రూప్ నగర్ రక్త సంబంధాన్ని బట్టి జోధ్‌పూర్‌కు చెందినదైనా, ఉదయ్‌పూర్ రాజ్యానికి సామంతరాష్ట్రం. విజయసింగ్ భార్య కూడా ఉదయపూర్ రాజకుటుంబం నుండి వచ్చిందే. ఉదయపూర్ ప్రభువైన రాజ్‌సింగ్ యువకుడు అంద గాడు తక్కిన అందఱు ఉత్తమ రాజ్‌పుట్ రాకుమారుల లాగానే, ధైర్య వంతుడు, ఉత్సాహశాలి, సాహస ప్రియుడు రూపామతిని, విజయసింగునూ ఢిల్లీకి తీసుకురావలసిందనీ, రామంటూ ఎదురు తిరిగితే, రూప్‌నగర్ కోటను ధ్వంసం చేయవలసిందనీ చెప్పి ఔరంగజేబు తన సేనానుల్లో ఒకడైన సాదత్‌ఖాన్‌ను పంపించాడు ఇందుకు కారణం, నవలనుండి మనం తెలుసు కోగలిగినంతవఱకూ రాజకీయమూకాదు, మతసంబంధీకాదు తనకిష్టు రాలైన ఉదయపూర్ బేగం రూపామతి ఉత్తరంలోని ఒక ప్రసక్తివల్ల అవ మానింపబడినట్లు భావించినందువల్ల, ఆమెను శాంతపఱచాలనే కోరికతోనే ఔరంగజేబిలా చేశాడు ఔరంగజేబు మనుషులు అడ్డపడి పట్టుకొని అతని కడకు తెచ్చిన ఉత్తరమది అందుచేత, ఇక్కడి ఔరంగజేబు కోపానికి పెద్ద కారణమేమీలేదు

పేరును బట్టి చూస్తే, నవల ప్రధానంగా రూపామతికి సంబంధించిందే అనిపిస్తుంది కాని, ఆవిడ నవలలో మూడు నాలుగు సార్లు మాత్రమే కనిపిస్తుంది. నవలలో కథాగతికి తోడ్పడే ముఖ్యమైన పాత్రగా ఆమె గోచరించదు చక్రవర్తి అంతఃపురంలోని స్పర్ధలూ, కుతంత్రాలూ, కష్టాలలో తగుల్కొని, తప్పించుకొని తమ ప్రకృతిని బట్టి మంచి గుణాలనో, చెడ్డగుణాలనో చాటుకొనే తెగువగల తక్కువరకం పాత్రలూ ఈ నవలలో చాలా భాగాన్ని ఆక్రమించాయి.

రూప్‌నగర్ దుర్గం చాలా బలమైనది. రాజపుత్రులు విజయసింగ్ సహాయార్థం వచ్చి పడగలరనీ సాదత్ ఖానుకు తెలుసు అందువల్ల అతడు ఎక్కువ సహాయం కావాలని ఢిల్లీకి వ్రాసాడు అప్పుడు ఔరంగజేబు పెద్ద సైన్యంతో స్వయంగా దక్షిణాదికి వెళ్ళాడు అతడు మౌంట్ అబూ దగ్గఱకు వచ్చేసరికి అతని సైన్యాన్ని ఒకయిఱుకు కనుమలోనికి ప్రవేశించే టట్లు చేసి, అన్నివైపుల నుండీ ముట్టడించి చావగొట్టారు.

ఈలోపల, రూప్‌నగర్‌ను సాదత్ ఖాన్ ముట్టడించియుండగా, రూపామతి రాజ్‌సింగుకు ఎలాగో ఒక ఉత్తరం పంపగలిగింది. ఆపద నుండి తనను తప్పించి, కోటను కాపాడగలిగితే, తానతనిని వివాహమాడ దలచినట్లు అందులో ఆవిడ తెలిపింది రాజ్‌సింగ్ రూప్‌నగర్‌కు వచ్చి సాదత్‌ఖాను నోడించి రూపామతి విజయసింగులను విడిపించాడు. ఆ విధంగా ఔరంగజేబు ద్వివిధాలుగా ఓడిపోయి రాజ్‌సింగ్ విధించిన నియమాలననుసరించి అతనితో సంధికొడంబడక తప్పిందికాదు

దీనితో కలగలుపుగా నడిచిన మఱొక కధ ఉంది జోధ్‌పూరుకు చెందిన రాజా జస్వంత్‌సింగును ఔరంగజేబు దండయాత్ర కోసం కాబూలుకు పంపాడు. జస్వంత్ సింగ్ తన కొడుకు పృథ్వీ సింగ్‌ను చక్రవర్తి ఆస్థానంలో వదలివెళ్ళాడు విషలిప్తమైన వస్త్రాలు ధరింపజేసి ఔరంగజేబు అతన్ని చంపాడు ఈ వార్త విన్న జస్వంత్‌సింగ్ ఆ ఘోరాన్ని తట్టుకోలేక మరణించాడు ఆ సమయంలో అతని భార్య చంద్రావతి గర్భవతి. కొద్ది కాలాని కామెకొక కొడుకు పుట్టాడు అతనికి అజిత్‌సింగని పేరుపెట్టారు ఇది తెలిసి ఔరంగజేబు ఆ తల్లీ బిడ్డలను ఢిల్లీకి తీసుకురావడానికై నయన్‌పాల్ అనే ఒకణ్ణి పంపాడు. (ఈ నయన్‌పాల్ జోద్‌పూర్ రాజకుటుంబానికి చెందినవాడు కాని మొగలుల ఆస్థానంలో కొలువుకు కుదిరాడు ) అపాయాన్ని పసికట్టిన జస్వంత్‌సింగ్ నమ్మినబంట్లు, దుర్గాదాస్, ఇందిర - అనే యిద్దఱు చంద్రావతిని, అజిత్ సింగ్‌ను రహస్యంగా రాజపుటానాకు, పంపివేయ గలిగారు. ఈ విషయం తెలిసిన నయన్‌పాల్ దురాగ్రహంతో దుర్గాదాస్, ఇందిరలను బంధించి ఖైదీలుగా ఢిల్లీకి తీసుకువెళ్ళాడు కానీ ఆ యిద్దఱి ధైర్యం, విశ్వాసపాత్రత, ఉపాయశాలితలకేకాక, ఇందిర అందానికి కూడా ముగ్ధుడై అతడామెను ప్రేమిస్తాడు.

ఢిల్లీ చేరిన తరువాత, చెప్పిన పని చెయ్యలేక పోయినందుకు ఔరంగజేబు నయన్‌పాల్‌ను తక్కువ చేసి మాటాడతాడు దుర్గాదాసును ఖైదు చేసి, ఇందిరను జనానాకు పంపుతాడు ఆ తరువాత ఈ ముగ్గురూ కలిసి రాజపుటానాకు పాఱిపోయి రాజపుట్ల ప్రయత్నాలలో సహాయపడాలని పథకం వేస్తారు

నవలలో ఎక్కువ భాగం ఢిల్లీలోని వాళ్ళ సాహసగాధలకూ, కార్యకలాపాలకూ, కడకు వాళ్ళు రాజపుటానాకు తప్పించుకొని పోయిన విషయానికీ సరిపోయింది. ఔరంగజేబునూ, అతని బలాలనూ మౌంట్

అబూ దగ్గఱ ఇఱుకు కనుమలోనికి మళ్ళించిన వాడు ఈ నయన్‌పాలే. కథలో మన్నియెక్కువ ఆకట్టుకునేవి యీ అద్భుత సాహసగాధలే.

ఈ నవలకు నాయిక రూపామతి అయినప్పటికీ, మన్ని ఉదయపురి బేగం, ఇందిర - ఎక్కువ మెప్పిస్తారు వాళ్ళపాత్రలు బహుముఖాలుగా కనిపిస్తాయి. ఏమైనా, నవల చాలినంత కార్యదీక్ష, ఉత్కంఠలతో కూడి శ్రద్ధతో చదువదగి ఉంటుంది

## చంద్రగుప్త (1902 - 1904)

శీర్షికను బట్టే నవల చంద్రగుప్తమౌర్యునికి సంబంధించినదనేది సువిదితం కాని శీర్షిక 'చాణక్య' అని ఉండి ఉంటే సముచితంగా ఉండేది. ఈ నవల ముఖ్యంగా చాణక్యుడు నందరాజును, అతని కొడుకుల్ని చంపి చంద్రగుప్తుణ్ణి మగధసింహాసన మెక్కించడానికై పన్నిన తాంత్రికమైన పన్నాగాలకు సంబంధించింది. నవలలో చంద్రగుప్తుని తల్లిమురకు కూడా అంత ప్రముఖపాత్ర ఉన్నది.

ఇందుకు కావలసిన వివరాలు తానెక్కడ నుండి సంపాదించాడో హరిభావ్ ఒకచిన్న ఉపోద్ఘాతంలో చెబుతాడు అవి (1) నందరాజుల్ని గుఱించీ, చంద్రగుప్తుణ్ణి గుఱించీ స్మరించిన పురాణాలు, (2) ఇండియాకు వచ్చి వెళ్ళిన గ్రీకుల రచనలు - వాటిలోని పాటలీపుత్ర (ఇప్పటి పాట్నా) నగరం, మగధరాజ్య స్థితిగతులవర్ణనలూ, (3) ముద్రా రాక్షస - సంస్కృత నాటకం చంద్రగుప్తుడు పాటలీపుత్ర సింహాసనాన్ని అధిరోహించడానికి ముందే గ్రీకులతో యుద్ధం చేసి వాళ్ళనోడించాడా ? లేక సింహాసన మెక్కిన తరువాతనా ? అనే విషయం చారిత్రకాధారాలను పురస్కరించుకొని చెప్పడానికి వీలుకాదు కాని, యీ సంఘటన చంద్రగుప్తుడు రాజ్యానికి వచ్చిన తరువాత జరిగినట్లు హరిభావ్ వ్రాశాడు. అది తన నవల యొక్క రచనా ప్రణాళికకు అనుకూలం కావడమే అందుకు కారణం.

చాణక్యుడి అసలు పేరు విష్ణుగుప్తుడు. పంజాబులోని తక్షశిలలో అతడు నివసించేవాడు గ్రీకులు పంజాబును దాటివస్తూ పశువులనూ, తఱచుగా స్త్రీలనూ ఎత్తుకుపోతూ ప్రజల్ని పీడిస్తూండేవాళ్ళు. విష్ణుగుప్తుడు గొప్ప విద్వాంసుడైన బ్రాహ్మణుడు యుద్ధవిద్యల్లో ఆఱితేరినవాడు అతడిది చాలా సున్నితమైన మనస్తత్వం. గర్వి, తంత్రశాలి ఆకాలంలో మగధరాజ్యం చాలాపటిష్ఠంగా ఉండేది. అందుచేత విష్ణుగుప్తుడు పాటలీ

పుత్రానికి వెళ్ళి గ్రీకుల్నెదిరించి ఇండియానుండి పాఉదోలేటట్లు నందరాజైన ధనానందుడికి బోధించి ఒప్పించాలని నిర్ణయించుకొన్నాడు

ధనానందుడాయన్ని సాదరంగా ఆహ్వానించాడు కాని, అతని ఆస్థానంలోని బ్రాహ్మణులు అసూయాపరులై విష్ణుగుప్తుడు విషయసేకరణ కోసం వచ్చిన గ్రీకుల గూఢచారి కావచ్చునని చెప్పారు. అది విన్న విష్ణు గుప్తుడు రెచ్చిపోయి, వెంటనే లేచి నందరాజుల్ని హతమార్చి తనకు నచ్చిన వ్యక్తిని సింహాసనం మీద కూర్చుండ బెట్టేదాకా నిద్రపోననీ, అతని సహాయంతో గ్రీకులను ఇండియా నుండి వెళ్ళగొట్టగలననీ ప్రతిజ్ఞచేసి, వెంటనే ఆస్థానం విడిచి వెళ్ళిపోయాడు.

కాని, అతడు తక్షశిలకు తిరిగివెళ్ళలేదు. హిమలయాల దిక్కుగా ఉత్తరంగా వెళ్ళాడు. దారిలో అతడు ఆడుకొంటున్న ఒక బాలకుల గుంపును చూశాడు. అందులో ఒకడు చూపులను బట్టికానీ, ప్రవర్తనను బట్టి కానీ అసాధారణంగా కనిపించాడు చూడగానే ఆ బాలకుడు తాను ఆడుకొంటున్న బాలుర సమూహానికి సంబంధించిన వాడు కాడని విష్ణు గుప్తుడు అర్థం చేసుకొన్నాడు వెంటనే విచారణ జరిపి ఆ కుఱ్ఱవాడు ఒక పసులకాపరితో ఉంటున్నాడనీ, అతనికా కుఱ్ఱవాడు పదిహేను సంవత్స రాలకు మునుపు ఒక తెల్లటి బట్టతో చుట్టబడి అడవిలో వదలిపెట్టబడిన శిశువుగా దొరికాడనీ తెలుసుకొన్నాడు ఆ బిడ్డ దొరికినప్పుడొక చేతి కంకణం తప్ప ఆశిశువు శరీరం మీద వేఱేమీలేదని కూడా తెలిసింది ఆశిశువే యీ కుఱ్ఱవాడు. పసులకాపరి ఆ కంకణాన్ని తెచ్చి విష్ణుగుప్తుడికి చూపిం చాడు విష్ణుగుప్తుడు దానిమీద నందుల కుటుంబానికి సంబంధించిన రాజచిహ్నాల ముద్రలు చూశాడు. అతనికి చాలా సంతోషమయింది తనకాబాలుడు కనిపించిన వేళ ఒక వెన్నెలరాత్రి కావడంచేత విష్ణుగుప్తు డతనికి చంద్రగుప్తుడని నామకరణం చేశాడు ఆ బాలుడి జీవితం చాలా గొప్పగా రూపొందేశిక్షణ నివ్వడం కోసం అతన్ని తనతో తీసుకుపోవడానికి అనుమతించవలసిందని విష్ణుగుప్తుడు ఆ పసులకాపరి నడిగాడు.

విష్ణుగుప్తుడా బాలుణ్ణి ఇంకా ఉత్తరంగా హిమాలయ పర్వత పాదాల వద్దకు తీసుకెళ్ళాడు. అక్కడ, ఆటవిక జాతుల అబ్బాయిలు కొందఱతో కలిపి చంద్రగుప్తుడికి యుద్ధ విద్యల్లో శిక్షణ యివ్వడం ప్రారంభించాడు. తన పేరు కూడా చాణక్యుడని మార్చుకొన్నాడు చంద్రగుప్తుడు యుద్ధ విద్యలన్నింటినీ అవలీలగా నేర్చుకొని, కొన్ని సంవత్సరాలలోనే ఆ విద్యల్లో ప్రవీణుడయ్యాడు. చంద్రగుప్తుణ్ణి పాటలీపుత్రానికి తీసుకు వెళ్ళడాని

కది తగిన సమయమని చాణక్యుడు భావించాడు కాని, ఆ పని చేయడానికి ముందు పాటలీపుత్రానికి వెళ్ళి అక్కడి పరిస్థితులను పరిశీలించి అంచనా కట్టాలనుకున్నాడు.

ఆ సమయానికి పాటలీపుత్రం మహోత్సాహంతో కోలాహలంగా ఉంది అప్పుడే ధనానందుడి పెద్ద కొడుకు ఆచారాన్ననుసరించి యువరాజుగా ప్రకటింపబడడం, యుద్ధంలో గెలిచి తెచ్చుకొన్న ఒక రాజకుమారితో అతని కప్పుడే పెండ్లి అయి ఉండడం అందుకు కారణాలు ఆ సంతోష సమయంలో రాజు చాలామంది ఖైదీలను విడుదల చేశాడు వాళ్ళలో అంతకు పదహారు సంవత్సరాలకు ముందు ఖైదు చేయబడిన అతని రాణి 'మురి' కూడా ఉంది.

మురి ఒక కిరాట ప్రభువు కూతురు ఆమెను ధనానందుడి సేనానాయకుడైన భాగురాయణుడు ఒక యుద్ధంలో పట్టితెచ్చి ప్రభువుకు కానుకగా సమర్పించాడు ఆమెను రాజు గాంధర్వవిధి ననుసరించి పెండ్లాడాడు. త్వరలోనే ఆమె ఒక బిడ్డను కన్నది. ధనానందుడి ఇతర భార్యలకు పిల్లలు లేరు అందువల్ల మురకొక కొడుకే పుట్టడం జరిగితే, అతడే యువరాజవుతాడని భావించారు అలా జరగడం వాళ్ళ కిష్టం లేదు అందువల్ల 'మురి' అసలైన కిరాట రాజకుమారి కాదనీ, కిరాట రాజు కొక శూద్ర కన్యవల్ల పుట్టిన కూతురనీ, అదీగాక ఆమె కనబోయే బిడ్డ ధనానందుని బిడ్డ కాకపోవచ్చుననీ, వదంతులు లేవదీశారు మనోదార్ఢ్యం లేని రాజు ఆ వదంతులు నమ్మి, మురను ఖైదు చేసి, ఆమెకు పుట్టిన బిడ్డను - మగైనా, ఆడయినా - చంపి వేయవలసిందని ఆజ్ఞాపించాడు. ఆ తరువాత మురకు మగబిడ్డ పుట్టాడు ఆ బిడ్డను చంపవలసిందిగా అజ్ఞ అయింది. కాని అలా చంపడానికి నియోగింపబడిన మనుషులు జాలిపడి ఆ బిడ్డను చంపకుండా అడవిలో వదలి వెళ్ళిపోయారు. ఆ బిడ్డడే చంద్రగుప్తుడు.

పాటలీపుత్రానికి వచ్చిన చాణక్యుడు మురచరిత్రను తెలుసుకొన్నాడు తాను బోధించి, శిక్షణ యిచ్చి పెంచిన చంద్రగుప్తుడు మురాదేవి కొడుకేనని ఆయన ధ్రువపఱచుకొన్నాడు. మురి కారాగారం నుండి విముక్తి పొందినప్పటికీ ఆమెకు సంతోషమే లేకపోయింది పైపెచ్చు తన కపకారం చేసిన రాజు మీద పగ తీర్చుకోవాలన్న పట్టుదలతో తన నమ్మిన సేవకురాలికావిషయం తెలిపింది.

కాని, తెలివయింది కావడంవల్ల ఆమె తన పనిని నెఱవేర్చు కోవ డానికై చాలా తాంత్రికమైన పద్ధతి నవలంబించింది ఆమె రాజును తన భవనానికాహ్వానిస్తూ ఒక ఉత్తరం వ్రాసింది తియ్యని మాటల్తో. ముప్ఫయి సంవత్సరాలు వచ్చినా సడలిపోని తన దేహసౌందర్యంతో ఆమె అతడిని ఆకట్టుకొని, తనమీద అతనికి దయకలిగేలా చేసుకొంది.

రాజు గతంలోని తన ప్రవర్తన కెంత పశ్చాత్తాప పడి ఆమె మాట లకూ, హృద్యమైన ప్రవర్తనకూ ఎంతగా లొంగిపోయాడంటే — తాను ఆమె భవనం వదలకుండా ఆమెతోనే ఉండిపోతానని తన నిర్ణయాన్ని ప్రకటించాడు. ఇది అతని యితర రాణులకు కోప కారణమయింది. కానీ, వాళ్ళ విషయంలో రాజు మనస్సు విషపూరితం చేసి, మురఅతనిని తన ధగ్గఱే నిలుపుకోగలిగింది

చాణక్యుడు పాటలీపుత్రానికి వచ్చి విషయసేకరణ ప్రారంభించే టప్పటికి, మురరాజు మీాద పగతీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లు అతనికి తెలిసింది. పైపైకి అక్కడి పరిస్థితులు బాగానే ఉన్నట్లనిపించినా, లోలోపల ఒక అసహ్యత ప్రబలుతున్నట్లు కూడా అతను కనిపెట్టాడు రాజువైఖరి అతని మంత్రిమండలికిగానీ. ప్రజలకుగానీ నచ్చలేదు. ముఖ్యమంత్రి రాక్షసుడూ, సేనానిమాత్రం నందవంశం వారికి విశ్వాస పాత్రులై మిగిలారు.

తన పథకం నెఱవేరడానికి పరిస్థితులనుకూలంగా ఉన్నాయని భావించి, చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి తీసుకురావాలని నిర్ణయించుకొన్నాడు. అతడొకసారి మురను చూచి మాటాడగలిగాడు కూడా. ఆమె తల్లి మాయాదేవి, సోదరుడు ప్రద్యుమ్నదేవ్ ఆమెకు తమ శుభాకాంక్షలు తెలి పారని చెప్పి, ప్రద్యుమ్నదేవ్ తన కొడుకైన పదహారేండ్ల చంద్రగుప్తుని పాటలీపుత్రానికి పంపగోరుతున్నాడనీ, ఆబాలుడామెతో కొన్నాళ్ళు గడ పడమేగాక కొంత ప్రాపంచిక పరిజ్ఞానాన్ని కూడా సంపాదించుకోగల డన్నదే అతని కోరిక అనీ చాణక్యుడామెతో చెప్పాడు. అందువల్ల చంద్ర గుప్తుడు పాటలీపుత్రానికి వచ్చి తనయింట ఉండటానికి మురఅంగీ కరించింది.

చాణక్యుడు హిమాలయాలలోని తన ఆశ్రమానికి వెళ్ళి, చంద్ర గుప్తుడితో తిరిగి వచ్చి అతడిని మురకు అప్పజెప్పాడు.

చంద్రగుప్తుణ్ణి రాజభవనంలో వదలి చాణక్యుడు తన పథకాలను నెఱవేర్చడం కోసం ముమ్మరంగా ప్రయత్నించసాగాడు నవలంతా ఆయన కుతంత్రాలతో నిండిపోయింది భాగురాయణుడిని అతడు తన పక్షానికి త్రిప్పుకోగలిగాడు అలాగే రాక్షసుడి నమ్మినబంటయిన హిరణ్యగుప్తుణ్ణి తనవాణ్ణి చేసుకొన్నాడు మురయొక్క అంతరంగిక పరిచారికనూ తన పక్షానికి త్రిప్పుకొన్నాడు అప్పుడప్పుడూ మురను, ఆమె అనుమతితో కలుసుకొంటూ, రాజును హతమార్చడానికై ఆమె వేసుకొన్న పథకాన్ని బలపఱచసాగాడు

ఆ వచ్చిపోయే రోజుల్లో ఒకసారి చాణక్యుడు రాజముద్రాంకితమైన కంకణాన్ని ఆమెకు చూపి, చంద్రగుప్తుడు ఆమె సోదరుని కుమారుడు కాడనీ, మరణించాడని భావింపబడుతున్న ఆమె కొడుకేననీ నిరూపింపగలిగాడు సహజంగానే ఆమె చాలా సంతోషించింది

విధ్యుక్తధర్మాలను నెఱవేర్చడంలో ధనానందుడు రాక్షసుడే నొచ్చుకునేటంత నిర్లక్ష్యం చూపాడు మురధనానందుణ్ణి ఆస్థానానికి వెళ్ళమనేది కానీ, అతడు తిరస్కరించేవాడు కడకు కొన్ని గంటలు మాత్రమే సభకు వెళ్ళడానికి సమ్మతించాడు ఒకరోజు నిర్ణయింపబడింది. అదొక గొప్ప ఉత్సవదినం కావలసి ఉంది. అదే సమయాన్నే చాణక్యుడు రాజును హతమార్చడానికి కూడా ముహూర్తం చేసుకొన్నాడు. రాజప్రాసాద ద్వారానికి ముందు ఒక పెద్ద గొయ్యి త్రవ్వించాడు పైకి అక్కడినేల చెక్కుచెదరనట్లు కనిపిస్తుందేకానీ, లోపల మాత్రం గొయ్యి ఉంటుంది రాజుగారి పట్టపుటేనుగు అడుగుపెట్టగానే అక్కడ పల్లంపడి రాజూ, అతని కొడుకులూ అందఱూ గోతిలో పడిపోతారు అక్కడ చాణక్యుని మనుష్యులచేత వాళ్ళు చంపబడతారు

మురరాజును చంపడానికి పథకాలు వేస్తున్నప్పటికీ, అలా చేయడం తగిన పనేనా ? అని ఆమె సందేహపడుతూనే ఉన్నది ఆమె ద్వైధీభావంతో కొట్టుకులాడ సాగింది. కడకు రాజు సభాభవనానికి వెళ్ళవలసిన రోజొచ్చేటప్పటికి, రాజును వెళ్ళవద్దని ఆమె ప్రార్థించింది వెడితే అతడు మృత్యుకూపానికి బలవుతాడని ఆమెకు తెలుసు. కానీ, రాజు వెళ్ళడానికే నిశ్చయించుకొన్నాడు ఆమె మనస్సులో పోరాటం తీవ్రతరమయింది కొడుకా, మగడా ? ఎవరు మిగలాలి ? కడకు భర్తను కాపాడడానికే నిర్ణయించుకొని ఒకపల్లకీ తెమ్మని ఆజ్ఞాపించి, అందులో కూర్చుండి ఆమె సభకు వెడుతున్న ఆయన్ని అనుసరించి, వెళ్ళసాగింది అపాయం

తెలియచెప్పి అతన్ని కాపాడాలని ఆమె అభిప్రాయం కానీ, ఆమె అతన్ని అందుకోలేకపోయింది

రాజూ, అతని కొడుకులూ గోతిలోపడి, ముందే అక్కడుంచబడిన చాణక్యుని మనుషులైన భిల్లులచేత చంపబడ్డారు ముర వెనుకనే వెళ్ళి చాణక్యుడు వారిస్తున్నా వినక గోతిలోదూకి భిల్లులచేతిలో మరణించింది.

చంద్రగుప్తుడు రాజయ్యాడు రాక్షసుడు చంద్రగుప్తుని మంత్రిత్వాన్ని అంగీకరించేటట్లు చేయడంకోసం చాణక్యుడతడినెన్నో విధాల పట్టు కొలిపి చూశాడు కానీ, రాక్షసుడు ఒకనందుణ్ణి తప్ప వేఱెవ్వరినీ కొలవనని తిరస్కరించేసరికి చాణక్యుడతనికి మళ్ళీ ముంజేతి కంకణాన్ని చూపి, చంద్రగుప్తుడెవరో కాదనీ, నిజానికతడు నందవంశానికి సంబంధించినవాడే ననీ నిరూపించాడు. అప్పుడు చంద్రగుప్తుని ముఖ్యమంత్రి కావడానికి రాక్షసుడు అంగీకరించాడు ఆవిధంగా తాను చేసిన ప్రతిజ్ఞను చాణక్యుడు నెఱవేర్చుకొన్నాడు.

స్వల్పమైన చారిత్రకాధారాలను పురస్కరించుకొని, హరిభావ్ ఒక ఆసక్తికరమైన నవలను వ్రాశాడు అందులోని కథకూ, పాత్రలకూ సరిపోయే భాషనే వాడాడు నవలనిండా చాణక్యుని మాయోపాయాలే కాని, అతిసులభంగానూ, అతి వేగంగానూ అతడు ప్రతివ్యక్తినీ యిష్టానుసారం తన పక్షానికి లాక్కోవడం, ప్రతిపనీ సాధించడం నమ్మలేనంత విడ్డూరంగా ఉంది నవలలో ఉత్తమమైన భాగం మురపాత్రకు సంబంధించిందే. చిక్కైన ఆమె పాత్ర, నేర్పుగల ఆమె తంత్రాలూ, కడకామె మనస్సులో నీత్యవినీతులకు జరిగిన సంఘర్షణా చాలా గొప్పగా చిత్రింపబడ్డాయి. విశ్వాసపాత్రుడైన మంత్రిగా రాక్షసుని పాత్ర కూడా అంతే ఒకరకంగా, చాణక్యుడు తన కుటిలతంత్రాలతో విజయం పొందినా, కడకు కపట తంత్రాలు అన్నివేళలా, అందునా విశ్వాసపాత్రులైన దృఢచిత్తుల విషయంలో - పని చేయవని కూడా గ్రహిస్తాడు. నవలకు చంద్రగుప్తుడి పేరు పెట్టబడినప్పటికీ, చంద్రగుప్తుడు వట్టి బొమ్మలాంటి కథానాయకుడు. కథలో అతడు చేసేదేమీ లేదు అభివర్ణించదగినంత పాత్రత్వమే లేదు.

మొత్తంమీద ఇది బాగా వ్రాయబడిన హరిభావ్ నవలల్లో ఒకటి.

**కాలకూట్ (1909 - 1911) :**

ఒక అసంపూర్ణ నవల మొదటి సంపుటం, రెండో సంపుటంలో మొదటి అధ్యాయం మాత్రమే వ్రాయబడినవి పృధ్వీరాజ్ చౌహాన్,

జయచంద్ రథోల జీవితాలకు సంబంధించిన తొలిఘట్టాలను కొన్నింటిని అది చిత్రిస్తుంది. కాని, అసంపూర్ణం కాబట్టి అది ఏవిధంగా పరిణతి చెంది ఉండేదో, ఏయే సంఘటనలను చిత్రించి ఉండేదో చెప్పడానికి వీలులేదు.

హస్తినాపుర - ఢిల్లీ ప్రభువైన అనంగపాలుడికి విమల, కమల - అని యిద్దరు కూతుళ్ళు. విమలకు కనూజ్ పాలకుడైన విజయపాల్‌తోనూ, కమలకు అజ్మీరు పాలకుడైన సోమేశ్వరునితోనూ వివాహాలు జరిగాయి. విమల కొడుకు జయచంద్ కమల కొడుకు పృధ్వీరాజ్. కమలకు ధనంజయుడనే తమ్ముడున్నాడు అతడు మరణించినందువల్ల విమల కమల లిద్దఱూ తమ అనుతాపాన్ని తెలిపి రావడానికై ఢిల్లీకి వెడతారు. నవల అక్కడ ప్రారంభమవుతుంది విమల కమలలలో విమల అసూయా పరురాలు, సంకుచితబుద్ధి కలిగిన జగడగొండి, కమల అలాకాక ప్రేమ, దయ, నిష్కళంకమైన మనస్సు ఉన్నది ఒకనాడు వాళ్ళందఱూ ఒక చోట కూర్చున్నప్పుడు తాతగారి యేతొడపై ఎవరు కూర్చోవాలంటూ దాయాదులైన పృధ్వీరాజ్ జయచంద్రు లిరువురూ కీచులాడు కోసాగారు. అనంగపాలుడు ఇద్దఱు మనుమళ్ళనీ ప్రేమించినా, పృథ్వీరాజ్ అంటే అతని కెక్కువ యిష్టం అక్కడ తప్పేమీ జరక్కపోయినా విమల కమలతో కలహించసాగింది. కమల, ఇతరులూ ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించేకొలదీ రెచ్చిపోయి ఏవేవో లేనిపోని నిందలు మోపడం ప్రారంభించింది. ఆదెబ్బతో వృద్ధుడైన అనంగపాలుడి కెంతవిరక్తి కలిగిం దంటే, ఆమెను కనూజ్‌కు వెళ్ళి పొమ్మన్నాడు ఆమె అలాగే వెళ్ళి పోయింది. కమల కూడా పృధ్వీరాజ్‌ను ఢిల్లీలో వదలిపెట్టి అజ్మీర్‌కు వెళ్ళిపోయింది. అనంగపాలుడతనికి రాజకుమారుడికి తగిన క్షత్రియోచిత మైన విద్యల్లో శిక్షణ యిప్పించాలనుకొన్నాడు.

విమల మనస్సులో సోదరిపట్ల తన దుర్భావాన్ని పెంచుకోసాగింది. ఆకోపంతో ఒకసారి తనతో జయచంద్‌ను తీసుకొని హిమాలయాలలోని తన కాపాలిక గురువునడిగి తన కొడుకైన జయచంద్రుడు ఢిల్లీ రాజ్యాన్ని పొందడానికి సాహాయ్యపడగల తాయెత్తుగానీ, లేక వరంగానీ సంపాదించ డానికై వెళ్ళింది అక్కడామె చాలారోజులు నిరీక్షించింది కానీ యెటు వంటి బహుమతి అందకపోయేసరికి ఓర్పు కోల్పోసాగింది కొన్నాళ్ళ తరువాత ఆమె ఒక విషమపరిస్థితిలో చిక్కుకొనగా, ఆమెను వెదుక్కొంటూ వచ్చిన అనంగపాల్, విజయపాల్ అనే వ్యక్తులామెనాపదనుండి తప్పిం చారు ఆ తరువాత వాళ్ళందఱూ ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెళ్ళారు. మొదటి సంపుటం ఇక్కడి కయిపోతుంది

రెండవ సంపుటంలోని మొదటి అధ్యాయం జరిగిన దాన్నిబట్టి విమల తాను పరాజితురాలైనట్లు, అవమానితురాలైనట్లు కూడా భావించినట్లు తెలుపుతుంది అమె యెవరినీ కలుసుకోదు ఎవరితోనూ మాటాడదు

కొన్ని నెలల తరువాత పృథ్వీరాజ్ పట్టాభిషేకోత్సవానికి రావలసిందిగా విమలకూ, అమె కుటుంబానికీ అనంగపాల్ ఒక అహ్వానం పంపాడు విమలభర్త తన యిద్దఱు కొడుకులతో కూడా వెళ్ళదలచుకొన్నాడు విమల ఏం చేయదలచుకొన్నదీ కూడా అతడు అడగలేదు. విమల తాను వెళ్ళాలా, మానెయ్యాలా అన్న ఒక నిర్ణయానికి రాలేదు కడకు మానెయ్యడానికే నిశ్చయించుకొని జయచంద్‌ను కూడా వెళ్ళవద్దనీ, తనకడకు రావలసిందనీ చెప్పి పంపింది కాని, అతడు తాను ఢిల్లీకి వెళ్ళి ఉత్సవాన్ని చూడదలచుకొన్నట్లు అమెకు చెప్పి పంపాడు అది అమె తన పరాజయంగా భావించి, ఇంక తాను కనూజ్‌లో ఉండడంలో అర్థం లేదనుకొన్నది. అమె యెవరికీ, జయచంద్‌కు కూడా అక్కఱలేదు అందువల్ల అమె హిమాలయాలకు వెళ్ళిపోవాలనుకొన్నది

అధ్యాయం ఇక్కడితో అయిపోతుంది తరువాత యేం జరిగిందో వేచి చూడుడని గ్రంథకర్త మనకు చెబుతాడు కాని, ఆ మీాద గ్రంథమే లేదు 'కాలకూట్' అంటే "ప్రాణాంతకమైన విషం" అని అర్థం విషపూరితమైన కుంభంలాంటి విమల మనస్సును వర్ణించడానికి యీపదం వాడబడింది నవల పూర్తయి ఉంటే జయచంద్, మహమ్మద్ ఘోరీలు పన్నిన కుట్రను గుఱించీ, పృథ్వీరాజ్ ఓటమిని గుఱించీ మనకు తెలిసి ఉండేది. కానీ, యిది వట్టి ఊహ మాత్రమే.

నవల వ్రాయబడినంత వఱకూ పరిశీలిస్తే అందులో విమల కమల పాత్రల మధ్యగల తారతమ్యం స్పష్టంగా చూపబడిందని చెప్పవచ్చు 'కాపాలికుని' ఆశ్రమం, ప్రధాన కాపాలికుని శిష్యుల అసూయలూ, స్పర్ధలూ వాళ్ళ అమానుషాలైన అచారాలు కూడా ఎంతో బాగా వర్ణింప బడ్డాయి.

**వజ్రాఘాత్ : (1913 - 1915)**

వజ్రాఘాత్ హరిభావ్ యొక్క కడపటి చారిత్రక నవల. అతని ఉత్తమ రచనల్లో ఒకటి. "విజయనగరపు తుదిరోజులు" అనేది నవల యొక్క ఉపశీర్షిక. సీవెల్ వ్రాసిన "ఎ ఫర్గాటన్ ఎంపైర్" నుండి, ఫరిస్తా నుండి యీ నవలకు కావలసిన చారిత్రక వస్తువు గ్రహింపబడింది. బ్రిగ్ 'ఫరిస్తా'లో వ్రాయబడిన ఒక విషయాన్నతడు పేర్కొంటాడు. అది

యిలా ఉంది "రామరాజు సైన్యంలోని యిద్దఱు మహమ్మదీయ సేనానాయకుల విద్రోహకరచర్యల వల్ల హిందువులు యుద్ధంలో పరాజయం పొందారని సీజర్ ఫ్రెడరిక్ అంటాడు ఆ సంఘటనను పరిస్తా చెప్పకుండా వదలిపెట్టాడు సీజర్ ఫ్రెడరిక్ ఒక ఇటాలియన్ యాత్రికుడు తళ్ళికోట యుద్ధం జరిగి, రామరాజు పరాజయం పొందిన రెండు సంవత్సరాల అనంతరం 1567లో అతడు విజయనగరానికి వచ్చాడు ఈ చారిత్రకమైన వృత్తాంతానికి ఒక దక్షిణాది రచయిత "హిందూస్థాన్ రివ్యూ" లో, కొన్ని సంవత్సరాల క్రితం ఇచ్చిన ఒక కద కూడా కలుపబడింది ఆ కథ యిది. రామరాజు వయస్సులో ఉండగా ఒక మహమ్మదీయ యువతిని ప్రేమించాడు. ఆమెకతనివల్ల ఒక కొడుకు పుట్టాడు తరువాత ఆమె కొడుకుతోపాటు అదృశ్యమై పోయింది సంవత్సరాల తరువాత ఆ కుఱ్ఱవాడు పెరిగి యువకుడై రామరాజు ఆస్థానానికి వచ్చి యేదైనా ఉద్యోగం కావాలని అడిగాడు. రాజు అతడు తనకొడుకని తెలుసుకొని అతడిని తన అంగరక్షకుడుగా నియమించుకొన్నాడు ఆ తరువాత ఒకరోజున రామరాజు కొలువు దీరి ఉన్నప్పుడు అతని మనుష్యులొక మహమ్మదీయ కన్యనక్కడికి తీసుకొచ్చారు రామరాజు ఆజ్ఞాపించి ఆమె మేలిముసుగు తీయించాడు. ఆ యువకుడందుకు కోపగించి, తన ఆక్షేపణను రాజుకు తెలియజేశాడు రామరాజు ఆమె తన కొడుకుకు తగిన భార్య కాగలదని భావించి, ఆమెనతనికి అప్పజెప్పాడు. ఆ యువకుడు తన్ను పెండ్లాడవలసిందిగా ఆమెను ఎన్నో విధాల ప్రార్ధించాడు. కానీ, తనను అవమానించిన హిందూ రాజు యొక్క రాజ్యం నాశనమయ్యేదాకా తాను పెండ్లాడననీ, పైపెచ్చు హిందూ రాజ్యవినాశకుడైన వాణ్ణే తాను పెండ్లాడుతాననీ భీష్మించింది. ఆ యువకుడామె కోరినపని చేయగలనని ప్రతిజ్ఞచేసి, కార్యసాధనకు పూనుకొంటాడు. నిజానికీ కథ పొందిన పెంపే యీ నవల.

రామరాజు చారిత్రక పురుషుడు. తళ్ళికోట యుద్ధం, విజయనగర సైన్య పరాజయం, రామరాజు శిరఃఖండనం చారిత్రకాంశాలు. ఈ చారిత్రకాంశాలూ, ఆ కథా హరిభావ్ నవలకాధారాలు. అస్థిపంజరమైన యీ కథా శరీరాన్ని కొత్త పాత్రలనూ, సంఘటనలనూ సృష్టించి, రక్తమాంసాలతో కూడిన సజీవమూర్తిగా రూపొందించాడతడు

రామరాజు ప్రేమించిన స్త్రీ పేరు మెహెర్‌జాన్ వాళ్ళిద్దఱకూ పుట్టిన కొడుకు రణ్మస్త్ హిందూ రాజ్య వినాశనాన్ని కోరిన యువతి నూర్జహాన్. ధనమల్లుడు ఇందులోని నాలుగవ పాత్ర నల్లగా ఎత్తుగా,

భీకరంగా ఉంటాడు ఎప్పుడూ మెహర్‌జాన్ చుట్టూ తిరుగుతుంటాడు నాలుక కదిపి మాటాడడు ఈ పాత్రల వర్తనం ఫలితంగా రూపొందిన నవల నామమాత్ర రాజకీయ స్పర్శ కలిగిన ప్రేమగాథ, విషాదగాథ కూడా అవుతుంది దీనికి ముందే వెలువడిన హరిభావ్ చారిత్రక నవలల్లో కార్యాచరణానికి ప్రాధాన్యం ఇవ్వబడింది ఇందుకు అపవాదాలుగా వేరే పాత్రలు కూడా కొన్ని ఉన్నాయన్నమాట నిజం కోపాన్ని ప్రదర్శించడం, పర ప్రభుత్వాన్ని ఆక్షేపించడాల మీద కూడా దృష్టి ఉంది ఇది 'చంద్రగుప్త' నవలలో రాక్షసుడు పరాయిసైన్యంతో సహకరించనని తిరస్కరించినప్పుడు కూడా కనబడుతుంది. వజ్రాఘాత్‌లో విజయనగర సైన్యాలకూ, సమైక్య బహమనీ సుల్తానుల సైన్యాలకూ, మధ్య జరిగిన సమరం హిందూ మహమ్మదీయులకు మధ్య జరిగిన సమరమే. కాని అది మహమ్మదీయ ప్రాబల్యాన్ని నిరసించేదిగా చిత్రింపబడలేదు. హిందూ ముసల్మానుల వైమనస్యం ఈ విషాదగాథలోని భావ తీవ్రతను పెంచడానికి మాత్రమే ఉపయోగింపబడింది ముఖ్యంగా కథను రక్తి కట్టించడానికై అంతంలో ఇది ప్రవేశపెట్టబడింది వ్యక్తుల మధ్యగల సంబంధాలలో వాటిల్లే వైరుధ్యం, ఉత్కంఠలను వ్యక్తిగత పాత్రల మనస్సుల్లో జరిగే అంతర్ఘర్షణనూ పురస్కరించుకొనే ప్రధానంగా ఈ నవల నడుస్తుంది ఇంచుమించు ముప్ఫయి అయిదు సంవత్సరాల వయస్సు గల రామరాజు మెహెర్‌జాన్‌ను ఒక యాత్రికుల గుంపునుండి తీసుకొచ్చి, విజయనగరానికి అనతిదూరంలో ఉన్న ఉద్యానవనంలోని ఒక గృహంలో ఉంచాడు మార్జియానా అనే నమ్మిన సేవకురాలొక్కతే ఆమె సహచరి రామరాజు, మెహెర్జాన్ పరస్పరం గాఢంగా ప్రేమించుకొన్నారు. ఆ ప్రేమ వాళ్ళకెంతో ఆనందదాయకమయింది తోట సురక్షితమైన ఒక ఆవరణంలో ఉన్నది దానిలో ఒక అందమైన జలాశయం జలాశయంలో ఒక పడవ అన్ని వైపులా పొదరిండ్లు. అదొక మనోహరమైన ప్రదేశం ఈ ఉద్యానవనంలో ఒక వెన్నెలరాత్రిలో ఈ నవలలోని కథ ప్రారంభమవుతుంది. రామరాజు, మెహర్జాన్ చాలా సంతోషంగా ఉన్నారు మెహెర్జాన్ శాస్త్రీయ పద్ధతిలో ఒక పాట పాడుతుంది బదులుగా రామరాజు జయదేవుని గీత గోవింద శ్లోకాలను ఆలపిస్తాడు. ముఖ్యంగా తమ సమాగమం ఫలవంతం కాబోతున్నదన్న విషయం మెహెర్జాన్‌కు సంతోష కారణమవుతుంది కాని, లోలోపల ఒక ఉత్కంఠ రేగుతూ ఉంటుంది బహుశః ఇంత సుఖం ఎక్కువ కాలం నిలువదేమో! జలాశయంలో వాళ్ళిద్దఱూ ఒక పడవలో విహరిస్తుంటారు. ఉన్నట్టుండి మెహెరాన్ తామిద్దఱూ కలిసి మునిగిపోవలసివస్తే తమ ప్రేమ

కంతకంటే పరిపూర్ణత, సంతోషదాయకమైన ముగింపు ఉంటుందా? అని ప్రశ్నిస్తుంది రామరాజు ఆమెను తమాషా చేసి, అటువంటి బాధాకరమైన భావాలేవీ పెట్టుకోవద్దన్నాడు ఆమెకు మళ్ళీ నమ్మకం చెప్పాడు కాని, మఱునాటి ఉదయమే ఒక రాజకుమారిని వివాహమాడడం కోసం ఆమెను వదలిపెట్టాడు రాజకుమారిని పెండ్లాడంవల్ల తాను స్థానికంగా బలపడి రాజకీయంగా ఔన్నత్యం పొందగలగడమే అందుకు కారణం త్వరలోనే అతడు రాజప్రతినిధి కావడమేకాక తనదైన ప్రభుతను నెఱపసాగాడు. ప్రణయం, రాజకీయధికారాల మధ్య, రెండోదాన్నే ఆయన యెన్ను కొన్నాడు మెహెర్జాన్ ఈ ద్రోహాన్ని సహించలేకపోయింది ఉద్యాన వనంలోని గృహాన్ని వదలి ఉత్తర హిందూదేశానికి వెళ్ళింది తరువాత చాలా సంవత్సరాల వఱకూ ఆమె జాడే తెలియలేదు కాని ఆమె రామ రాజు మీద పకతీర్చుకోవాలని నిశ్చయించుకొంది తరువాత ఆమె ఒక మగబిడ్డను కన్నది అతడు రామరాజు కొడుకు రణ్మస్తఖాన్ అని అతడి పేరు

ఎన్నో సంవత్సరాల తరువాత, ఎదిగినయువకుడైన తన కొడుకును తీసుకొని బిజాపూరుకు వచ్చి, కొంతపలుకుబడి నుపయోగించి రణ్మస్తఖాన్ సూల్తాను కొలువులో ప్రవేశించేటట్లు చేసింది ఈ అన్ని సంవత్సరాలూ తన ప్రేమనేకాక, అత్మగౌరవాన్ని కూడా నేలవేసి కాలరాచిన రామరాజు పట్ల అసహ్యతను, ద్వేషాన్ని పెంచుకొంది త్వరలోనే రణ్మస్తఖాన్ విజయనగర సంస్థానంలో బిజాపూరు సుల్తానుయొక్క రాయబారిగా నియమింపబడ్డాడు అప్పటికతడు మాప్ఫయి అయిదేండ్లవాడు. రామరాజు మెహెర్‌జాన్‌ను కలిసినప్పుడు అతని వయస్సు కూడా అంతే

రామరాజు మహమ్మదీయద్వేషి, స్త్రీ వంచకుడు అని రణ్మస్తఖాన్ అభిప్రాయపడేటట్లు చేసింది మెహర్‌జాన్ కాని, రామరాజతని తండ్రి అనే సూచన యేదీ చెయ్యలేదు

తనకు సంబంధించినంత వఱకూ మెహెర్‌జాన్ వెళ్ళిపోయినందుకు రామరాజెంతో బాధపడ్డాడు ఆమెను ఉద్యానవనంలో వదిలిరావడంలో, ఆమెను పూర్తిగా వదిలివేయాలన్నది అతని అభిప్రాయంకాదు ఆమెపట్ల అతని ప్రేమ కృతకమయిందికాదు అప్పటికి మాత్రం ఆమెనుండి దూరంగా ఉండాలనుకొన్నాడు కొంతకాలం తరువాత ఆమె తోడి తన సంబంధాన్ని కొనసాగించి ఉండేవాడు. ఆమెను మాటిమాటికి గుర్తుతెచ్చు కొనేవాడు ఉద్యానవనానికి వెళ్ళి, తానామెతో గంటల తరబడి ఆనందంగా గడిపిన స్థలాలన్నీ చూచి వచ్చేవాడు

బిజాపూరు సుల్తాను ప్రతినిధిగా విజయనగరానికి వచ్చిన రణ్మస్త ఖాన్‌తో పాటు మెహెర్‌జాన్, మార్జియానాలు కూడా ఉన్నారు వాళ్ళం దఱికూ ఒకప్పుడు రామరాజు, మెహెర్‌జాన్‌ల ప్రణయ జీవితానికి సాక్షిగా నిలచిన ఉద్యానవన గృహమే నివాసస్థలం చేయబడింది

ఉద్యోగిగా తన ఆస్థానానికి వచ్చిన రణ్మస్తఖాన్‌ను చూచిన రామ రాజుకు రణ్మస్తఖాన్ తప్పకుండా తనకొడుకే అయి ఉండాలనిపించింది ఆ పిదప అతడొక రాజోద్యోగి అనే విషయం మఱచి రామరాజతడినెంతో ఆదరంగా చూచేవాడు రణ్మస్తఖాన్‌కు అది అర్థం కాలేదు రామరాజు పద్ధతి అతనికి నచ్చలేదు బిజాపూరు సుల్తాను విరోధిగా చూచినా, వ్యక్తిగతంగా చూచినా రణ్మస్తఖాన్ హృదయంలో రామరాజుపట్ల అసహ్యత, ద్వేషమూ తప్ప వేఱేభావమూ లేకపోవడమే అందుకు కారణం ఈ విరుద్ధభావాలనూ, వాటిలో ఇమిడి ఉన్న సంఘర్షణనూ హరిభావ్ చాలా నిపుణంగా వర్ణించాడు

ఒకప్పుడు రామరాజు కొలువుతీరి కూర్చుండి ఉండగా, అతని మనుష్యులు సందేహాస్పదమైన పరిస్థితుల్లో పట్టుబడిందంటూ ఘోషాలో ఉన్న ఒక మహమ్మదీయస్త్రీని ఆయన ముందుతెచ్చి నిలిపారు. ఆమె ముసుగును తీసి వేయవలసిందని రామరాజు ఆజ్ఞాపించాడు అది విన్న రణ్మస్తఖాన్ విపరీతమైన కోపంతో తన ఆక్షేపణను తెలిపాడు. అయినా ఆమె ముసుగు తీసివేయబడింది తీయగానే అతి సౌందర్యవతి అయిన ఒక మహమ్మదీయయువతి అక్కడున్న వాళ్ళందఱిముందూ సాక్షాత్కరించింది. ఆమె కోపంతో వణకిపోతున్నది ఆ విధంగా బట్టబయలుగా కనిపించడం కంటే, ఒక ముస్లింయువతికి అవమానకరమైనది లేదు రామరాజు రణ్మస్తఖాన్, నూర్జహాన్‌ల ధైర్యాన్ని మెచ్చుకొని, ఆ అమ్మాయిని రణ్మస్తఖాన్ కు భార్యగా ఇచ్చి, రణ్మస్తఖాన్, అతని తల్లి కాపురమున్న ఉద్యానవనంలోని గృహంలోనే ఆమెనుకూడా ఉంచవలసిందిగా ఆజ్ఞాపించాడు

రణ్మస్తఖాన్ కూడా నూర్జహాన్ అందానికీ, ధైర్యానికీ ఆశ్చర్య పోయాడు రామరాజు మీద ద్వేషం మఱింత పెరిగినప్పటికీ, అంతకు మించి నూర్జహాన్‌ను తనదాన్ని చేసుకోవడానికి తహతహ లాడసాగాడు. కాని ఆమె హృదయం ఒక యినుప ముద్దలా తయారయింది తనకెక్కడ అవమానం జరిగిందో ఆ హిందూసామ్రాజ్యం సర్వనాశనమయ్యేదాకా పెండ్లాడదలచుకోనట్లు, ఆవిధంగా హిందూరాజ్యాన్ని నాశనం చేయగల వానినే తాను పెండ్లాడడానికి నిర్ణయించుకొన్నట్లూ చెప్పింది.

రణ్మస్తఖాన్ ఆమెనెలాగైనాసరే పెండ్లి చేసుకు తీరాలన్న తీవ్రమైన కోరికతో ఆమె తలపెట్టిన పనిని నెఱవేర్చడానికి తానే పూనుకొన్నాడు. ఇన్నాళ్ళూ రణ్మస్తఖాన్ తల్లిపట్లనే శ్రద్ధ ప్రేమ కలిగి ఉండేవాడు. కానీ, నూర్జహాన్ వచ్చేసరికి ఆ భావాలన్నీ ఆమెవైపు మళ్ళాయి కొడుకు క్రమంగా తనకు దూరంకావడాన్ని గుఱించి మెహర్‌జాన్ తీవ్రంగా మధనపడ సాగింది. ఆమె అనుభవించిన యీ అదనపు బాధను కూడా హరిభావ్ చాలా సూక్ష్మంగా వ్యక్తీకరించాడు

ఆ తరువాత రణ్మస్తఖాన్ తన కార్య సాధనకోసం అన్ని ప్రయత్నాలూ చేయసాగాడు. తనకు బిజాపూర్ సుల్తాన్‌సేవ యిష్టం లేనట్లు నటించి, రామరాజును సదా దగ్గఱే ఉండి సేవించాలనడం తన కోరికగా చెప్పాడు రామరాజుకు అంతకంటే యిష్టమైనది లేదు. అతడిని పూర్తిగానమ్మి తన అంగరక్షకుడుగా నియమించుకొన్నాడు తన కొడుకును సదా తన దగ్గఱ ఉంచుకో గలిగినందుకతడెంతో సంతోషించాడు.

బహుమనీ సుల్తానులు నలుగురూ కలిసి యుద్ధంలో విజయనగరం మీద కడపటి దెబ్బ తీయాలని నిర్ణయించుకొన్నప్పుడు రణ్మస్తఖాన్‌కు అతడెదురు చూస్తున్న అవకాశం అబ్బింది అప్పటివఱకూ ఆ సుల్తానుల మధ్యగల అనైకమత్యాన్ని విజయనగర ప్రభువులు తమకనుకూలంగా వాడుకొని, బహుమనీరాజ్యాలను ఒకదాని మీద మఱొకదానిని పురికొల్పుతూ, ఆ రాజ్యాలను పాడుచేస్తూండేవాళ్ళు విజయనగర సైన్యాలూ, పొత్తుకలుపుకొన్న బహుమనీ సుల్తానులసైన్యాలూ తళ్ళికోటలో తలపడి యుద్ధంచేశాయి. రామరాజు అంగరక్షకుడుగా రణ్మస్తఖాన్ యుద్ధరంగంలో అతని వెంతనే ఉన్నాడు. శత్రుసైన్యాలు వెనుదిరిగాయని అబద్ధం చెప్పి రాజును నమ్మించి, తనదగ్గఱున్న మనుష్యుల్ని పంపించివేయవలసిందని పట్టుపట్టాడు. శత్రువు ముట్టడించినప్పుడు రామరాజుకు దగ్గఱగా ఉన్న మనుష్యులకు బాగా దెబ్బలు తగిలి ఆయన్ని వదలి పాఱిపోయారు ఆ సందర్భాన్ని వినియోగించుకొని రణ్మస్తఖాన్ రామరాజు శిరస్సు ఖండించి తీసికొని ఉద్యానవనం లోని గృహానికి వెళ్ళాడు కథ ఉచ్చదశనందుకొన్న ఘట్టం ఇది. రణ్మస్తఖాన్ తన పనిని సాధించాడు నిజానికి, రామరాజు తల నఱికి అందరకీ కనిపించేటట్లు పొడుగైన బల్లేనికి గ్రుచ్చి చూపించినవాడు అహ్మద్ నగర్‌కు చెందిన హుస్సేన్ నిజాంషా - అన్నది చారిత్రక సత్యం. కానీ, తన నవలయొక్క శిల్పప్రయోజనం నెఱవేరడానికై హరిభావ్ దీన్ని మార్చేశాడు.

రణ్మస్తఖాన్ మహాసంతోషంతో ఆ తలనొక పళ్లెరంలో ఉంచి తీసుకు పోయి తనతల్లి అయిన మెహెర్‌జాన్‌కు చూపించాడు. ఆ పని చేసినందుకు తనకు బహుమానం లభించగలదని అతడనుకొన్నాడు కాని, ఆ తలను చూచేసరికి మెహెర్‌జాన్ "అయ్యో! నాయనా! నీవు నీ తండ్రిని చంపావు" అని ఒక కేకవేసింది ఆమె హృదయం అట్టడుగున రామరాజుపట్ల ప్రేమ యింకా సజీవంగానే ఉన్నది. ఆమె పగతీర్చుకోవాలనుకొన్నది గానీ, తన ప్రియుని మరణాన్ని కోరలేదు అగాధమైన వేదనతో ఆమె ఆ తలను పైకెత్తి చేతులతో మోసుకొంటూ వెళ్ళి దానితోపాటు జలాశయంలో దూకేసింది. తన ప్రియునితో పాటు జలాశయంలో మునిగి మరణించాలని ఆమె చాలా సంవత్సరాలక్రితం కోరుకొన్నకోర్కె ఆవిధంగా ఫలించింది ఆమెతోపాటే అదృశ్యమైపోయి, ఆమెతోపాటు మళ్ళీ ప్రత్యక్షమైన ధన మల్లుడు హఠాత్తుగా ఆమె వెనుకనేవెళ్ళి తటాకంలో దూకేశాడు నూర్జహాన్ కూడా తన ప్రియుడొక హిందువు యొక్క ఉంపుడుకత్తె కొడుకేగాక పితృ ఘాతకుడు కూడా అని తెలియడంతో విభ్రాంతురాలయింది ఆమె అతడిని ఎలా పెండ్లాడగలదు? ఆమెకూడా జలాశయం దగ్గరకు పరుగెత్తింది. ముప్పిరిగొన్న విభ్రాంతితో రణ్మస్తఖాన్ ఆమె వెనుకనే వెళ్ళాడు ఇద్దరూ కలిసి జలాశయంలో దూకేశారు ఆవిధంగా ఆ కథ యెక్కడ ప్రారంభ మయిందో అక్కడే - అంటే ఉద్యానవనంలోని గృహంలో అందులోని జలాశయంలో ముగిసిపోయింది

కథ కొంత వివరణాత్మకంగానే చెప్పవలసివచ్చింది. అలా చెప్పకుంటే కథయొక్క విషాదప్రణయతత్వం అర్థంకాదు.

కథలోని అన్ని అంశాలలోనూ స్త్రీ పురుషులకూ, తండ్రీకొడుకులకూ తల్లీకొడుకులకూ మధ్యగల ప్రణయవాత్సల్య భావాలు కథలో హృదయ స్థానాన్ని ఆక్రమిస్తున్నవి అందులోని నలుగురు వ్యక్తులూ సుడిగుండంలో తగుల్కొని, అడుగుకు వెళ్ళిపోతారు. నల్లగా, ఎత్తుగా, భీకరంగా, మూగగా కనిపిస్తూ మెహెర్‌జాన్‌ను ప్రేమించి, ఆమె యెక్కడికి వెడితే అక్కడకు వెళ్ళే ధనమల్లుడు కూడా యీ ప్రేమవలలో చిక్కినశించి పోయాడు. వాడు కొలనులోని నీటిలోపలి తీగల్లో తగులుకుపోయినటు హరిభావ్ వర్ణించాడు కూడా. ధనమల్లుడు మాట లేకుండా, దుర్దముడై వెంటబడివస్తూ, అమంగళ కరమైన జాంతవ కామస్ఫూర్తికి చిహ్నంగా కనిపిస్తాడు తనలో చిక్కురు బొక్కురై దాగొన్న తీగలతో కూడిన సరస్సునే ప్రణయానికొక సంకేతంగా గ్రహించవచ్చును. అది స్త్రీ పురుషులను కలిపి లాగుతుంది, వాళ్ళమీద

వలలా వాలి చుట్టుకొంటుంది. అలావేయడంలో ఒక్కొక్కప్పుడు వాళ్ళను సర్వనాశనం చేస్తుంది

ఈ నవల నలుగురువ్యక్తుల యొక్క కబళించే తీవ్రకాంక్షల పడుగు పేకలతో నేయబడిన వస్త్రం లాంటిది వీళ్ళకు ఐదవవాడు తోడు హరిభావ్ యీనేతలో గొప్ప నైపుణ్యం చూపాడు. అతని యితర నవలల్లో కనిపించే దొసగులు కొన్ని యీ నవలలో కూడా కనబడతాయి కాని దాని సంపూర్ణతత్వాన్ని పురస్కరించుకొని చూస్తే, అది అతని ఉత్తమనవలల్లో ఒకటనీ, అతని చారిత్రక నవలలన్నింటిలోనూ ఉత్తమమైనదనీ చెప్పవచ్చు అది సంపూర్ణమైన అతని కడపటి నవల అందులో సృజనాత్మక కళాకారుడుగా అతని ప్రజ్ఞలన్నీ సంపూర్ణంగా ఆవిష్కరింపబడ్డాయి నవలలో ఒకే ఒక చారిత్రక పురుషుడు రామరాజు ఒకే ఒక చారిత్రక సంఘటన తళ్ళికోట యుద్ధం ఒక దుర్బలమైన పురాతన కథా సూత్రం. ఇవి ఆధారంగా హరిభావ్ బలాబలసమన్వితాలైన మానవ మనస్తత్వాలను ఒక అద్భుతమైన వస్త్రంలాగా నేసి చూపించాడు 'కవి' అనేమాట సాధారణార్థంలో హరిభావ్‌కు అన్వయించదు కాని యీ నవలలో ఒక కవితాగుణం కనిపిస్తుంది.

హరిభావ్ చారిత్రక నవలల నొకసారి పర్యాలోకిస్తే ఊహ కల్పితాలు గానీ, నూత్న సృష్టిగానీ అయిన పాత్రలనూ, సందర్భాలనూ చిత్రించేటప్పుడు, ఆయన సామర్థ్యం పూర్తిగా వెల్లడవుతుందని చెప్పవచ్చు వాటి చిత్రణలో ఆయన యెక్కువ స్వాతంత్ర్యం వహింపగలడు. అందువల్లనే కాబోలు, సాధారణంగా ఆయన కల్పించిన పాత్రలూ, సంఘటనలూ పాఠకుని మనస్సు మీద ప్రగాఢమైన ముద్రవేస్తాయి. ఇది ఒక్కొక్కప్పుడు దృశ్యసౌందర్యాన్ని చెడగొట్టుతుందని కూడా మనం అంగీకరించక తప్పదు. కాని, పాఠకుని అదృష్టం బాగుండి వజ్రాఘాత్‌లో కానీ, శివాజీని గురించిన అతని నవలల్లో గానీ ఇదేమంత పెద్దగా జరుగలేదు. చారిత్రక విషయాలలో హరిభావ్ వహించిన కొద్దిపాటి స్వాతంత్ర్యం కళదృష్ట్యా సమర్థనీయమే.

హరిభావ్‌ను సర్ వాల్టర్ స్కాట్‌తో సరిపోల్చడం సబబు కాకపోవచ్చు కాని, మరాఠీలో చారిత్రక నవలలు వ్రాసిన తొలి గొప్ప రచయిత అతడే కావడంచేత, తన తరువాతి వారిని చెప్పుకోదగినంతగా ప్రభావితుల్ని చేయడంచేత, దీన్ని గురించి ఆయనే యేం చెప్పుకొన్నాడో చూడడం మంచిది. వజ్రాఘాత్‌కు వ్రాసుకొన్న ఉపోద్ఘాతంలో ఆయనిలా

అంటాడు. "సమకాలిక సాంఘిక నవలసారం భ్రమమాత్రమైన సత్యం మాత్రమే. చారిత్రక నవల సారంచారిత్రకసత్యం, భ్రమల సమ్మేళనం, లేదా చరిత్ర, పుక్కిటి పురాణాల సమ్మిశ్రణం. ఈ రెండంశాలు ఎంతెంత ఉంటే అవి పరస్పర సాహాయ్యకాలవుతాయో, అనుగుణంగా ఉంటాయో, రచనయొక్క రసవత్తను పెంచుతాయో తన సామర్థ్యాన్ననుసరించి నవలా రచయిత చేసుకోవలసిన నిర్ణయం." హరిభావ్ తన ఉత్తమ రచనలో చారిత్రకాంశాలను, స్వతంత్ర కల్పనలను, పురాతన కధలకు సంబంధించిన వస్తువును తనకు కావలసినట్లుగా వాడుకొన్నాడన్న విషయాన్ని కాదనడానికి వీల్లేదు. అతడు నవలరూపంలో చరిత్ర వ్రాయలేదు. ఒక నవలను రూపొందించడానికి చారిత్రక విషయాలనుపయోగించుకొన్నాడంతే. ఆ విధంగా నవలకాలపు చైతన్యాన్నీ, వాతావరణాన్నీ పునస్సృష్టి చేసి చూపాడు అంటే ఇక్కడ రచయిత దృష్టి చరిత్ర మీద కాదు; నవల మీద ఈ యర్థంలో అతని చారిత్రక నవలలు చారిత్రక పత్రాలు కావు. చారిత్రక కల్పిత గాధలు. అవి అలా రూపొందడంలోనే వాటి రసవత్త ఇమిడి ఉంది.

---

# ఇతర రచనలు - ముగింపు.

ముప్ఫయి నాలుగు సంవత్సరాల తన సాహితీజీవితంలో ఇరవై యొక్క నవలలూ, ఒక నవలిక వ్రాయడమే కాక, హరిభావ్ వివిధ ప్రక్రియలకు చెందిన చెప్పుకోదగిన యితర రచనలు కూడా చేశాడు విభిన్న సందర్భాల్లో ఎన్నో ఉపన్యాసాలిచ్చాడు ఈ రచనలూ, ప్రకటింపబడిన ఉపన్యాసాలూ కలిపి సులభంగా ఒక రెండువేల పుటలుండవచ్చు.

అగార్కర్ హామ్లెట్‌కు చేసిన మరాఠీ తర్జుమాను హరిభావ్ విమర్శించడం గుఱించి యీ వఱకే చెప్పబడింది. ఆవిమర్శను, తన జ్యేష్ఠ స్నేహితుడు, ఉపదేశకుడు - అయిన గోవిందరావ్ కనిత్కర్ చేసిన మఱొక హామ్లెట్ తర్జుమాను గుఱించిన ప్రశంసాపూర్వకమైన విమర్శతో కలిపాడు. కనిత్కర్ భాషాంతరీకరణంలోని దోషాలను కూడా అతడు కొన్నింటి నెత్తి చూపాడు. కాని, అగార్కర్ తర్జుమాలోని భాషాంతరీకరణౌచిత్యానికీ, భాషా ప్రయోగౌచిత్యానికీ సంబంధించిన విమర్శ మాత్రం చాలా తీక్ష్ణంగా

ఉంది. విమర్శాంతంలో భాషాంతరీకరణ కార్యానికి పూనుకొనే వాళ్ళకు మార్గదర్శకాలైన కొన్ని నియమాలను విధించాడు ఈ నియమాలు చాలా శాస్త్రీయంగా ఉన్నాయి రోమియో అండ్ జూలియట్‌ను గురించి నది ఆయన మరొక విమర్శ హాంలెట్ తర్జుమాకు సంబంధించిన ఆయన విమర్శకు ముందటిది. షేక్స్పియర్ నాటకాలను హరిభావ్ క్షుణ్ణంగా చదివాడనడానికి ఇదికూడా ఒక సాక్షి. కొన్ని సందర్భాల్లో అతడు డాక్టర్ శామ్యూల్ జాన్‌సన్, ఆలివర్ గోల్డ్‌స్మిత్‌ల వంటి గొప్ప రచయితల అభిప్రాయాల్ని కూడా త్రోసి రాజనడం గమనించదగిన విషయం. ఈ వ్యాసాలు వ్రాసినప్పుడు హరిభావ్ పందొమ్మిదేండ్ల వాడన్న విషయం గుర్తుతెచ్చుకొంటే ఎవరైనా ఆయన ధైర్యాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ మెచ్చుకొనక మానరు

1912 లో షేక్స్పియర్‌ను గురించి ఆయన మూడు శీర్షికల క్రింద వ్యాసాలు వ్రాయడం ప్రారంభించాడు. (1) షేక్స్పియర్ - అతని రచనలు. (2) షేక్స్పియర్ కవితా రచనలు. (3) షేక్స్పియర్ స్వీయ చరిత్రాత్మక కవితలు. ఒక్కొక్క శీర్షిక క్రిందా ఆయన రెండేసి వ్యాసాలు వ్రాశాడు కాని, దురదృష్టవశాత్తు అవి అసంపూర్ణాలు. అన్ని వ్యాసాలూ, వ్రాయబడి ఉంటే జీవితమంతా షేక్స్పియర్‌ను అధ్యయనం చేసిన ఒక వ్యక్తి షేక్స్పియర్‌ను గురించి చేసిన సంగ్రహ సమగ్రమైన విమర్శ మరాఠీలో మనకు లభించి ఉండేది. అది మరాఠీ సాహిత్య విమర్శలో ఒక నూత్న ధోరణికి ప్రాతిపదిక అయిఉండేది. ఏ ప్రముఖ ఆంగ్ల రచయితను గురించిన విషయనిభృతమైన సంపూర్ణ విమర్శ యీ నాటికీ మరాఠీలో లేకపోవడమే యిలా చెప్పడానికి కారణం. కాని, హరిభావు కెప్పుడూ మనసు పట్టనన్ని భావాలుండడంవల్ల, అతని కొన్ని నవలల్లాగా యీ వ్యాసాలు కూడా అసంపూర్ణంగానే మిగిలిపోవడం జరిగింది.

హరిభావ్ నవలారచన ప్రారంభించి కొనసాగించిన దశాబ్దంలో ఆరు నాటకాలను కూడా మరాఠీకరించాడు. వాటిలో మోలియర్ ఫ్రెంచి భాషలో వ్రాసిన నాటకాలు మూడు. అప్పుడు ఫ్రెంచి నేర్చుకొంటున్న హరిభావ్ వాటిని సరాసరి మూలమైన ఫ్రెంచి నుండే మరాఠీకరించాడు. "లా మెరెజే ఫోర్సే (1887) లేతార్తుఫే (1888-'89) లే మెడిసిన్ మాల్గ్రేలుయి" (1890) అనేవి ఆమూడు నాటకాలు. ఈ మూడు తర్జుమాలూ చాలా బాగున్నాయి. ముఖ్యంగా మూడోది చాలా ప్రసిద్ధమయింది ఇవిగాక కాంగ్రేవ్‌వ్రాసిన "ది మౌర్నింగ్ బ్రైడ్," విక్టర్ హ్యూగో

వ్రాసిన "హెర్నాని," షేక్స్పియర్ వ్రాసిన "మెషర్ ఫర్ మెషర్" అనే నాటకాలను కూడా ఆయన మరాఠీకరించాడు ఇందులో ఆయన ఫ్రెంచి నాటకాలను భాషాంతరీకరించడం చాలా ముఖ్యమైన విషయం ఎందుకంటే, అంతకుమునుపు సరాసరి ఫ్రెంచి నుండి తర్జుమా చేసినవాళ్ళు లేరు. ఆ కాలంలో మరాఠీలో ఉత్తమ తరగతికి చెందిన హాస్యనాటకం లేదు మోలియర్ నాటకాల భాషాంతరీకరణలు ఆలోటును తీర్చి ఉండేవి కాని, దురదృష్టవశాత్తు మఱింకే భాషాంతరీకరణలు రాలేదు తరువాతి మూడునాటకాల తర్జుమాలో మూలంలోని చైతన్య స్ఫూర్తిలేదు, భాష కూడా ఆయన నవలల్లో ఉన్నంత మనోహరంగాలేదు హరిభావ్ షేక్స్పియర్‌ను చాలా లోతుగా అర్థంచేసుకొన్నవాడు అందుచేత, షేక్స్పియర్ రచనల్లో ఏదైనా ఒక విశిష్టమైన నాటకాన్నిగాక అంతటిదికాని 'మెషర్ ఫర్ మెషర్' నుతన భాషాంతరీకరణాని కెన్నుకోవడం చాలా ఆశ్చర్యకరమైన విషయం తమాషా యేమిటంటే రోమియో అండ్ జూలియట్, హాంలెట్‌ల తర్జుమాల విషయమై అతడు చేసిన విమర్శల్లో చాలాభాగం అతని భాషాంతరీకరణలకు కూడా అన్వయిస్తుండడం

ఈ భాషాంతరీకరణాలతోపాటు అతడు సంత్ సఖూబాయి, సతీపింగళా - అనే రెండు నాటకాలు సొంతంగా వ్రాశాడు రెండూ ప్రఖ్యాతమైన కథలను పురస్కరించుకొని వ్రాయబడిన నాటకాలే వాటిలో సంత్ సఖూబాయి రంగస్థలంమీద విజయాన్ని సాధించిన నాటకం కాని, మొత్తంమీద నాటకరచన అతని ప్రధానగుణం కాదని చెప్పవచ్చు అతని తెలివితేటలకు నాటకరచనతో పొత్తుకుదరలేదు

అతని చిల్లర రచనల్లో కొన్ని 'స్ఫుట్ గోష్టి' అనే ఒకే శీర్షిక క్రింద నాలుగు సంపుటాలుగా ప్రకటింపబడ్డాయి ఈ శీర్షిక యెవరికైనా యీ నాలుగు సంపుటాల్లో ఉన్న రచనలన్నీ కథలేఅన్న అభిప్రాయాన్ని కలిగించవచ్చు అందులో మొత్తం ఇరవై కథలు మాత్రమే ఉన్నాయి. తక్కినవాటిలో విభిన్న విషయాలను గుఱించిన వ్యాసాలెనిమిది, జీవిత చరిత్రలు పన్నెండూ (వాటిలో కొన్ని తర్జుమా చేయబడినవి ), ఉత్తరాలు ఇరవైఒకటీ ఉన్నాయి

మొత్తంలో హరిభావ్ ముప్పయికిపైగా కథలు వ్రాశాడు. వాటిలో నాలుగు పెద్దకథానికలు. అందులో మహారాష్ట్రలోని క్షామాన్ని అభివర్ణించే ఒకదాన్ని ఆంగ్లభాషలోనికి తర్జుమాచేసి ఫిషర్ అండ్ అన్‌విన్‌లు 'రాంజీ' అనే శీర్షికతో ఇంగ్లండులో ప్రకటించారు. అది యింగ్లండులో విస్తృతంగా

చదువబడింది. కాని, తరువాత అది ఇండియాలోని బ్రిటీషు ప్రభుత్వ పాలనను గురించి ఆంగ్లపాఠకుల మనసుల్లో విపరీత భావాలను రేకెత్తించ వచ్చుననే భయంవల్ల ప్రభుత్వందాని అమ్మకాన్ని నిషేధించింది తరువాతి కాలంలో ఒక నిర్దిష్టమైన సాహిత్య ప్రక్రియగా ప్రసిద్ధికెక్కిన కథానికతో శాస్త్రీయంగా సరిపోల్చి చూడదగిన కథానిక లిందులో కనీసం అయిన్నాయి. ఆధునిక మరాఠీ నవలలేగాక కథానికనుగూడ ప్రారంభించిన వ్యక్తి హరిభావేనని యిది తెలుపుతుంది ఈ రూపంలో అంతకుమునుపు వెలసిన రచన యేదీలేదు కొన్ని విషయాలు లఘు రూపంలోనే ఉత్తమ రచనలుగా నిర్వహింపబడగలవని కనిపెట్టినవాడు హరిభావే. తానొక కొత్త ప్రక్రియను సృష్టిస్తున్నట్లు అతడనుకోలేదు. కాని, కార్యరూపంలో అదే చేశాడు

అతని రచనా వ్యాసంగం సాగిన రెండో దశాబ్దంలో, పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో, 'మీ' లు వ్రాయబడుతున్న కాలంలో హరిభావ్ రెండు వర్గాలకు సంబంధించిన ఉత్తరాలు ప్రకటించాడు ఒక తల్లి తన కూతురికి వ్రాసినట్లున్నవి ఒక వర్గం, దానికి "సుగుణ బైచిన్ మూలీస్ పత్రేన్" అనేది శీర్షిక మరొకవర్గం ఒక తండ్రి తన కొడుక్కి వ్రాసినట్లున్నవి. "గోవింద్రా వాన్‌చిన్ ములాస్ పత్రేన్'' అనేది ఆ వర్గానికి శీర్షిక హరి భావ్ నవలలైన ''గణ్‌పత్‌రావ్, పణ్ లక్ష్యాన్త్ కోణ్ ఘేతో?'' తమ భర్తల దగ్గఱ విద్య నేర్చుకోవడానికి యువతులైన భార్యలు చేసే ప్రయత్నాన్నీ, ఆ ప్రయత్నంలో వాళ్ళెదుర్కొనవలసి వచ్చిన కుటుంబంలో పెద్ద వాళ్ళైన స్త్రీల వ్యతిరేకతనూ వర్ణిస్తాయి తల్లి వ్రాసిన ఉత్తరాలు పెద్ద తరం స్త్రీలతో, ముఖ్యంగా అత్తగార్లతోడి తమ ప్రవర్తనలో అమ్మాయిలు అలవఱచుకోవలసిన శాంత స్వభావాన్ని గుఱించి తెలిపేవి. సగుణబాయ్ అందఱు అత్తగార్లూ చెడ్డవాళ్ళుకారనీ, కుటుంబంలోని పెద్దతరం స్త్రీలను రెచ్చగొట్టకుండా విద్యార్జన చేయడం, యువతులకు తప్పకుండా సాధ్యపడు తుందనీ తన కూతురికి నచ్చజెపుతుంది. గోవిందరావ్ తన ఉత్తరాల్లో పెద్దతరం వ్యక్తులపట్ల తాల్మికోల్పోకూడదనీ, వాళ్ళ అనుభవాలవల్ల తాము లాభం పొందాలనీ యువతరం వారికి బోధించడం జరిగింది

హరిభావ్ తీవ్రసంఘసంస్కార ప్రియుడైనా, సంయమ స్వభావం కలవాడని యీ ఉత్తరాలు తెలియజేస్తాయి ఆయన నవలల్ని బట్టి వట్టి సాంఘిక సమస్యలేగాక, రాజకీయ, ఆర్థిక, పారిశ్రామికాది సమస్యలను గుఱించిన అవగాహన కూడా ఆయనకున్నదని మనకెఱుక పడింది.

ప్రాథమికంగా అతడొక ప్రబోధకుడు. సంఘసంస్కర్త అన్నమాటలు ఆయనపట్ల పూర్తిగా సార్ధకాలు

హరిభావ్ ప్రసిద్ధులైన స్త్రీపురుషుల సంగ్రహ జీవితచరిత్రలు కూడా ఒక డజనుపైగా వ్రాశాడు వీటిలో కొన్ని ఆంగ్ల రచనలకు తర్జుమాలు. నానావిధాలైన విషయాలను గురించి యెఱుక కలిగించేవీ, ఉపదేశాత్మకాలు అయిన అనేక వ్యాసాలు కూడా వ్రాశాడు

నవలా రచయితగా, సంఘసేవకుడుగా ఆయన ప్రతిష్ఠ పెరిగే కొలదీ, ముఖ్యమైన సందర్భాల్లో ఉపన్యసించడానికాయన ఆహ్వానింపబడే వాడు. ఆ ఉపన్యాసాలలో చాలాభాగం సాహిత్యానికి సంబంధించినవే ఆయన మనస్సుకు నచ్చిన విషయం సారస్వతమే అనడానికిది నిదర్శనం. వాటిలో "నవలాతత్వం" (The Philosophy of Fiction), 'నవలల్లో వాస్తవికత' (Realism in Fiction) అనే రెండూ పూనాలోని 'ఉదార స్నేహిత సమాజం' (Friends Liberal Association) - ముందు ఆంగ్లంలో నిర్వహింపబడిన ఉపన్యాసాలు. ఇవి లభించడం లేదు "నవలల"ను గురించి అతడు బొంబాయిలో శరత్కాలోపన్యాస పరంపర (Autumn Lecture Series) లో మరాఠీలో చేసిన మూడవ ఉపన్యాసం కూడా లభ్యం కావడంలేదు ఈ ఉపన్యాసంలో ఆయన నవలలను నాలుగు తరగతుల క్రింద విభజించాడు. అవి ఆదర్శకాలు, కాల్పనికాలు, ఉద్వేగజనకాలు, వాస్తవికాలు - అనేవి ఈ విభాగాలను ఇతరత్ర కూడా ఆయన పేర్కొన్నాడు

నేడు లభ్యమౌతున్న ఆయన మరాఠీ ఉపన్యాసాలు మూడింటిని గురించి కొంత విపులంగా చెప్పవలసి ఉంది 1903లో పూణాలోని మరాఠీ గ్రంథ సంగ్రహాలయం యొక్క వార్షికోత్సవ సందర్భంలో ఆయన అధ్యక్షోపన్యాసం చేశాడు. ఉపన్యాస విషయం 'మరాఠీ సారస్వతాధ్యయనం'. ఉపన్యాసంలో ఆయన వాక్కు, (ప్రసంగం లేక మాట) యొక్క అర్థాన్ని గురించి చర్చించి, సారస్వతాన్ని గురించి లార్డ్‌మోర్లే, సెయింట్ బ్యూవే యిచ్చిన నిర్వచనాలపై చర్చ సాగించి, మరాఠీ సారస్వతాన్నంతా ఒకసారి సమీక్షించి, అంతంలో ఒక సంఘం యొక్క సాంస్కృతిక జీవితంలో గ్రంథాలయాల ప్రాధాన్యాన్ని గురించి నొక్కి చెప్పాడు

ఆయన 1911 లో బొంబాయిలో ముంబై మరాఠీ గ్రంథ సంగ్రహాలయ వార్షికోత్సవ సందర్భంగా ఇచ్చిన అధ్యక్షోపన్యాసం ఈనాటికీ

గొప్పగా చెప్పుకోబడుతున్న ప్రసిద్ధమైన ఆయన ఉపన్యాసం ఉపన్యాస శీర్షిక 'విదగ్ధవాఙ్మయం' సారస్వతానికి సంబంధించి 'విదగ్ధ' శబ్దాన్ని ప్రయోగించడంలో తన ఉద్దేశమేమిటో వివరింపసాగుతాడాయన డీ - క్వీన్సీని ఆయన పేరు చెప్పకుండా - అనుకరిస్తూ సారస్వతాన్ని మొదట రెండు రకాలుగా విభజిస్తాడు అందులో ఒకటి 'శాస్త్రసారస్వతం', లేదా వైజ్ఞానిక సారస్వతం సత్యం, లేక వాస్తవాన్ని చెప్పడం ఇందులో ప్రధానం అది కళాత్మకంగా చెప్పబడుతున్నదా, లేదా అనేది ముఖ్యం కాదు మఱొక రకమైన సారస్వతంలో అది చెప్పబడుతున్న వైఖరికే ప్రాధాన్యం అది తప్పనిసరిగా కళాత్మకం కావాలి దీని పరమ ప్రయోజనం కూడా పాఠకునిచేత సత్యదర్శనం చేయించడమే కానీ యీకార్యం ఎంతో లలితమూ, సుందరమూ, ఆకర్షకమైన ధోరణిలో నిర్వహింపపడాలి ఇదే డీ - క్వీన్సీ యొక్క "లిటరేచర్ ఆఫ్ పవర్"(శక్తి సంయుత సాహిత్యం - అంటే కావ్య సారస్వతం) కాని, ఆవిష్కరణ సౌందర్యం, లాలిత్యాలు ప్రాధాన్యం వహించే "బెల్స్ లెటర్స్" కూ (Belles - letters), కళాత్మక సారస్వతానికీ (Artistic Literature) మధ్య హరిభావ్ ఒక విభేదాన్ని దర్శిస్తాడు ఈ రెండవది, ఆయన అభిప్రాయం ప్రకారం 'విదగ్ధవాఙ్మయం', అంటే అత్యుచ్చ దశకు చెందిన సారస్వతం. ఈవాఙ్మయం యొక్క పరమమైన గమ్యం సత్యమే. కాని, అది మొదట పాఠకుడికి శ్రద్ధ కలిగించి, రకరకాలైన కళాత్మక పద్ధతులతో, శైలులతో కథానిర్మాణ సౌందర్యాదులతో అతడిని మురిపింప జేసికానీ యీగమ్యాన్ని చేరుకోవడం సాధ్యంకాదు ఈ రకమైన సారస్వతంలో దాని అవ్యవహిత ప్రయోజనం పాఠకుడిని సంతోషపెట్టి వినోదాన్ని కలిగించడమే అనడం స్పష్టం. కాని, దాని రహస్యమైన చరమగమ్యం పాఠకుడికి విషయ పరిజ్ఞానం కలిగించి, సత్య దర్శనం చేయించి, అతడిని ధర్మానురక్తుణ్ణి చేయడమే. ఆయన మఢ్లిస్థితికి వ్రాసిన ఉపోద్ఘాతంలో చెప్పిన విషయాని కనుగుణంగానే యిది చెప్పబడింది. ఆయనొక శ్లోకాన్ని ఉదాహరిస్తాడు

"స్వాదు కావ్యరసోన్మిశ్రం
వాక్యార్థము పభుంజతే -
ప్రథమాలీఢ మధవః
పిబన్తికటుభేషజమ్"

ఆ తరువాత అతడు కవిత్వాన్ని (విశాలార్థంలో ఇదే సారస్వతం.) రేఖాచిత్రణ, వర్ణసంయోజన కళలతో పోల్చి విమర్శిస్తాడు. సంస్కృతా

లంకార శాస్త్రాల్లోనూ, ఐరోపీయ వేదాంతుల, కవుల రచనలలోనూ ఇవ్వబడిన కవిత్వ నిర్వచనాల నుదాహరిస్తాడు కడకు తేలే విషయం అతని మతంప్రకారం కవిత్వం (కళాత్మక సాహిత్యం) భావనా జన్య మయిందని అది చలన సౌందర్యవిశిష్టమై పాఠకుని సంతోషపెడుతూ, వినోదపరుస్తూ, అది సాధనంగా అతడు ప్రకృతి సంబంధమైన, మానవ మనస్తత్వ విషయికమైన సత్యాలను దర్శించేటట్లు చేస్తుంది కవిత్వ క్షేత్రానికి హద్దులులేవు. దానిలో ఇమిడిపోని విషయంలేదు దానికి బాలనిది, దానిని మించినదీ అయిన విషయమూలేదు

1912 లో మరాఠీ సారస్వత సమావేశానికి సంబంధించిన అకోలా సభలో ఆయన చేసిన అధ్యక్షోపన్యాసమే సారస్వతాన్ని గురించిన ఆయన తరువాతి ఉపన్యాసం ఈ ఉపన్యాసంలో అతడు, సారస్వతచర్చ చేయడంతోపాటు నాలుగు సలహాలు కూడా ఇచ్చారు. ఈ నాటికీ అసంగతాలు కాకుండా మిగిలిఉన్న ఆ సలహాలివి·

(1) విశ్వవిద్యాలయ స్థాయిలో భారతీయ భాషాధ్యయనం నిర్బంధం చెయ్యబడాలి

(2) మెట్రిక్యులేషన్ పరీక్షవఱకూ మరాఠీ మాధ్యమంతో విద్యాబోధన జరగాలి

(3) మరాఠీ నిఘంటువుకు ఒక కొత్త ప్రతిని రూపొందించాలి

(4) భారతీయ భాషలన్నింటికీ సమానంగా వర్తించే శాస్త్రీయ పరిభాష కావాలి

ఆయనకు సారస్వతంతో ఉన్న ప్రగాఢమైన అనుబంధం ఎటువంటిదో, సారస్వతాన్ని ఆయన యెంతగా మన్నించాడో, భారతీయ భాషల ఔన్నత్య సాధనకెంత త్రికరణశుద్ధిగా పాటుపడ్డాడో, ఈ ఉపన్యాసాలు తెలుపగలవు.

అతని యితర ఉపన్యాసాలలో ప్రత్యేకించి స్మరింపదగింది ఒకటుంది అది 1901 లో "భగవద్గీతోపదేశం" అనే విషయంమీద ఆంగ్లంలో ఇవ్వబడిన ఉపన్యాసం అతడు ముఖ్యమైన మూడు ప్రశ్నలు వేశాడు నేనెవరిని ? నేనేం చేయాలి ? నేనాసించవలసిందేది ? ఇవి ప్రతివ్యక్తి తనకు తాను వేసుకునే ప్రశ్నలు వీటిలో మొదటిది ప్రాథమికమైన ప్రశ్న.

మూడోది అనుబంధ ప్రశ్న మూడింటిలోనూ రెండవ ప్రశ్నే అతిముఖ్య మయింది. ఈ ప్రశ్నకు "సందర్భాన్నిబట్టి నీకు సాధ్యపడినట్లు నీధర్మాన్ని నీవు నిర్వర్తించు" - అనేది సమాధానం ఇందులో ఎవరికైనా కర్మ యోగాంకురం కనిపిస్తుంది అంతిమ పరమాశయమైన ఆత్మసాక్షాత్కారం కోసం ప్రయత్నించే వివిధ తత్త్వధోరణుల సమన్వయ ప్రయత్నం భగవద్గీతలో జరిగిందని కూడా ఆయన చెప్పాడు.

విష్ణుశాస్త్రి చిప్లంకర్ శాశ్వత స్మృతిచిహ్నంగా "నూతన్‌మరాఠీ విద్యాలయ"ను నెలకొల్పిన వారిలో హరిభావ్ ఒకడు ప్రతి సంవత్సరం వేసవి సెలవులకు ముందు ఆయన విద్యార్థులకొక వీడ్కోలు ఉపన్యాసం ఇచ్చేవాడు అటువంటివి పదిఉన్నాయి ఆయన్నిటికీ కలిపి, "బాలురకు హితబోధ" అనేది శీర్షిక

హరిభావ్ కాశీబాయ్ కనిత్కర్‌కు వ్రాసిన ఉత్తరాలను గురించి యీ వఱకే చెప్పబడింది కాని, యిక్కడ మఱొక విషయం చెప్పడం అను చితం కాదనుకొంటాను ఈ సంపుటిలో తారీఖు కలిగిన ఉత్తరాలు ముప్పయిమూడున్నాయి. మొదటిది 1885 మే నెల 6వ తేదీది. కడపటిది 1889 మార్చి నెల 7వ తారీఖుకు చెందింది తారీఖులులేని, అసంపూర్ణాలైన మఱి రెండుత్తరాలున్నాయి ఈ ఉత్తరాలు చాలా భాగం కాశీబాయ్‌కి, కొన్ని ఆమెభర్తయిన గోవిందరావుకు వ్రాయబడినవి. అందఱికోసం ఉద్దేశింపబడినవి కావు కాబట్టి యీ ఉత్తరాలు దాపరికం లేని సహజధోరణిలో వ్రాయబడినవి హరిభావ్ కుటుంబ జీవితాన్ని గుఱించీ, కొన్ని విషయాలకు సంబంధించిన అతని అసంతృప్తిని గుఱించీ, అతని పుస్తకపఠనం, అధ్యయనాల గుఱించీ, వార్తా పత్రికలకు సంపాద కత్వం వహించి ప్రకటించడంకోసం ఆయన వేసుకొన్న పథకాలను గుఱించీ, సంఘసేవకులపట్ల ఆయనకుగల అభిప్రాయాలను గుఱించీ యీ ఉత్తరాలెన్నో విషయాలు తెలుపుతాయి భారతదేశంలో క్రైస్తవమిషనరీలు చేసిన మంచిపనులను గుఱించి ప్రశంసిస్తూ అతడు వ్రాసిన సుదీర్ఘమైన లేఖ ప్రత్యేకించి పేర్కొనదగింది ఆ రోజుల్లో రహస్యంగానైనా అటువంటి అభిప్రాయాలు ప్రకటించడానికి గొప్ప ధైర్యం కావలసి ఉండేది ఈ ఉత్తరాల సంపుటికి కాశీబాయ్ కనిత్కర్ వ్రాసిన ఉపోద్ఘాతాన్ని బట్టి తానూ తన భర్త గోవిందరావూ హరిభావ్‌కు వ్రాసిన ఉత్తరాల నతడు భద్రపఱచ గలనని వాగ్దానం చేసినట్టు తెలుస్తుంది. వాటినతడు భద్రపఱచే ఉంటా డని ఆమె విశ్వాసం కానీ, అతని మరణం తరువాత, అతని కాగితాల్లో ఆ ఉత్తరాలు లేకపోవడంవల్ల తక్కిన కాగితాలతోపాటు వాటిని కూడా

అతని సేవకుల్లో ఒకడు అగ్నికాహుతి చేసి ఉంటాడని ఆమె ఊహించింది. హరిభావ్ స్వీయ జీవితచరిత్ర రచన కూడా ప్రారంభించాడనీ, అయితే అది కూడా అగ్నికే ఆహుతై ఉండాలనీ ఆమె తెలుపుతున్నది ఇది చాలా దయనీయమైన విషయం కాశీబాయ్, ఆమె భర్త గోవిందరావు హరిభావ్‌కు వ్రాసిన ఉత్తరాలూ, అయన స్వీయజీవితచరిత్ర లభించకపోవడం చాలా విచారకరమైన విషయం ఈ రెండూ లభించి ప్రకటింపబడి ఉంటే, మనకతన్ని గురించి యింకా యెంతో తెలిసి ఉండేది

నానావిధాలైన యీ రచనలనూ, ఉపన్యాసాలనూ పరిశీలించి చూస్తే, హరిభావ్ ఆసక్తి విభిన్న విషయాలకు సంబంధించిందీ, సువిస్తృతమైన పరిధి కలిగినదీ అనే అభిప్రాయం తప్పకుండా యెవరికైనా కలుగుతుంది అతని విషయ పరిజ్ఞానం ఇంచుమించొక విజ్ఞాన సర్వస్వం వంటిదనీ, తన రచనల ద్వారా గానీ, ఉపన్యాసాల ద్వారాగానీ, అతడు సాధించదలచిన ప్రయోజనం స్త్రీ పురుషులూ, చిన్నా పెద్దా అయిన ప్రజలకు విషయబోధ చేసి, పరిజ్ఞానాన్ని కలిగించి, వాళ్ళను విద్యావంతుల్ని చేయడమేననీ, అయన సంఘసేవాభావం చాలా పటిష్ఠమైనదని కూడా మనకు తెలియగలదు

ఏమైనా, ఆయన పెద్ద రచనల్లో మరాఠీ పాఠకులను ప్రభావితుల్ని చేసి, వాళ్ళ మనస్సులమీదా, మరాఠీ నవలా రచన మీదా చెరగని ముద్ర వేసినవి ఆయన నవలలే. ఆయన నవలా రచనకు కలిగించిన ప్రసిద్ధి వల్ల, ఆయన జీవితకాలంలోనే ఎందరో నవలా రచయితలు అభివృద్ధి చెందారు శతాబ్దాంతానికి నవలల్ని వరసగా ప్రకటించడానికై ఎన్నో పుస్తక ప్రకటన సంస్థలు స్థాపింపబడ్డాయి ఆయన జీవితకాలంలోనే కథానిక కూడా ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా స్థిరపడి ప్రచారం పొందసాగింది.

అతని సంకీర్ణ రచనల్లోనూ, ఉపన్యాసాల్లోనూ 1911 లో 'ముంబై మరాఠీ గ్రంథ సంగ్రహాలయ'లో ఇచ్చిన ఉపన్యాసం, 1912 లో అకోలాలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసం, షేక్స్పియర్ నాటకాల భాషాంతరీకరణాలను గురించిన అతని విమర్శ - మరాఠీ సారస్వత విమర్శ చరిత్రలో, సారస్వత సమస్యాచర్చల్లో సరిహద్దురాళ్ళుగా నిలిచిపోయాయి. హరిభావ్ తన మొదటి నవల వ్రాసి యిప్పటికి దాదాపు వంద సంవత్సరాలయ్యాయి. అతని కడపటి నవల ప్రకటితమై అరవైయేండ్లయ్యాయి. కాని, యిప్పటికీ, నవలా రచయితగా సాధారణ పాఠకులకతడెంతో యిష్టుడు, రచయితలకు, విమర్శకులకూ ఆదర్శపురుషుడు.

# హెచ్. ఎన్. ఆప్టే ప్రధాన రచనలు

**నవలలు - సాంఘికం**

| | | |
|---|---|---|
| मधली स्थिति | — | మధ్లిస్థితి. |
| गणपतराव | — | గణ్‌పత్‌రావ్ |
| पण लक्ष्यात कोण घेतो | — | పణ్ లక్ష్యాంత్ కోణ్ ఘేతో. |
| यशवतराव खरे | — | యశ్వంత్‌రావ్ ఖరే |
| मी | — | మీ |
| जग हे असे आहे | — | జగ్ హే అసే ఆహే |
| भयकर दिव्य | — | భయంకర్ దివ్య |
| आजच | — | ఆజచ్ |
| मायेचा बाजार | — | మాయేచా బాజార్. |
| कर्मयोग | — | కర్మయోగ |

**నవలలు - చారిత్రకం**

| | | |
|---|---|---|
| म्हैसूरचा वाघ | — | మైసూర్చావాఘ్. |
| उषःकाल | — | ఉషః కాల్ |
| केवल स्वराज्यासाठी | — | కేవల్ స్వరాజ్యా సాఠీ. |
| रूपनगरची राजकन्या | — | రూప్‌నగర్చీ రాజకన్యా. |
| चन्द्रगुप्त | — | చంద్రగుప్త |
| सूर्योदय | — | సూర్యోదయ |
| मध्यान्ह | — | మధ్యాహ్న. |
| सूर्यग्रहण | — | సూర్యగ్రహణ్. |
| कालकूट | — | కాలకూట్. |
| वज्राघात | — | వజ్రాఘాత్ |
| गड आला पण सिह गेला | — | గడ్ ఆలా పణ్ సింహ్‌గేలా. |

నాటకాలు

जवरीचा विवाह — జబరీచా వివాహ్
धूर्त विलसित — ధూర్త్ - విలసిత్
मारून मुटकून वैद्यबुवा — మారూన్ ముటూ్కన్ - వైద్యబువా

[మోలియర్ ఫ్రెంచి నాటకాలకు భాషాంతరీకరణలు.

क्षुतकीर्तिचरित — శ్రుతకీర్తిచరిత
जयध्वज अथवा असूयाग्निशमन — జయ ధ్వజ అదవా - అసూయాగ్ని శమన.
सुमतिविजय — సుమతి విజయ
सन्त सखूबाई — సంత్ సఖూబాఈ
सती पिंगला — సతీ పింగలా

నానావిధ రచనలు

1. स्फुट गोष्टी भाग १ ते ४ — స్ఫుట్ గోష్టి భాగాలు 1 - 4
2 1903 లో రాణేలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసం
3. 1911 లో బొంబాయిలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసం.
4 1912 లో అకోలాలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసం.

(2, 3 & 4లు సారస్వతం, సారస్వత విమర్శ, సారస్వత సమస్యలను గురించిన ఉపన్యాసాలు).

# సుసంచిత గ్రంథ సూచిక


హరిభా ఉ — డా॥ ఎల్. ఎమ్. బింగారే

హరినారాయణ్ ఆప్టే (జీవితం & సాహిత్యం) — కుమారి వేణుబాఈ - పాన్సే

కీ శే హరినారాయణ్ ఆప్టే జీవిత వివరాలూ నవలలూ — వాగ్భట్ నారాయణ్ దేశ్ పాండే

హరిభావు సాంఘిక నవలలు — డబ్ల్యు ఎల్. కులకర్ణి

హరిభావు నవలల్లోని పాత్రలు — ఉషా హస్తక్.

హరిభావు ఆప్టే నవలలు — అచలా జోషి.

హరిభావు నవలా తంత్రం — డా॥ కె. ఆర్. సావంత్.

మరారీ నవల మొదటి వంద సంవత్సరాలు — శ్రీమతి కుసుమావతి దేశ్ పాండే

కొల్హాట్కర్ రచనలు — సంపాదితం

హరిభావు లేఖలు — వాగ్భట్ నారాయణ్ - దేశ్ పాండే సంపాదితం.

మాసిక్ మనోరంజన్ — ఏప్రిల్ 1919 - ప్రత్యేక పంచిక

షేక్స్పియర్ నాటకాల భాషాంతరీకరణాలపై రెండు సమీక్షలు. హెచ్. ఎన్. ఆప్టే — డా॥ ఎస్ జి మాల్షే సంపాదితం.